

యమునా తిలకం


CHANDRIKA
AYURVEDIC
SOAP
CHANDRIKA SOAP
AYURVEDIC TOILET

# ఈ సంచికలో



ముఖచిత్రం ఉయ్యాల పండగ

చిత్రకారుడు వడ్డాది పాపయ్య


Member of Audit Bureau of Circulation Ltd




ఈ నెల విడుదల అయిన యువ నన్నెంతో పులకింపజేసింది "బంకిమ్ చంద్ర"గారి సంక్షిప్తనవల చాల బాగుంది. రజనిపాత్ర నన్నెంతో ఆకర్షించింది ఇటువంటి నవలను మావంటి పారకులకు అందింపచేసిన యువ ప్రచురితలకు, బంకిమ్ చంద్రగారికి నా హృదయపూర్వకాభినందనలు.

ఎమ్ ఎస్. మూర్తిగారి "కుర్రవాడు సరసమాడె" నన్నెంతో కడుపుబ్బ నవ్వించింది. వారికి నా కృతజ్ఞతలు.

సత్య
రావులపాలెం

అక్టోబర్ 'యువ' చాలా బాగున్నది. ఈసారి కార్టూన్లు హెచ్చుగా యిచ్చుట పత్రికకు అందము చేకూరినది. ఈ నెల కథలలో 'బర్హిశ్శుష్మ' అనే ఎన్. ఆర్. నందిగారి కథ. 'నాకు చచ్చిపోవాలని వుంది' అనే ముప్పాళ రంగనాయకమ్మ గారి కథ చాల బాగావున్నాయి. ఇటువంటి మంచి కథలు ప్రచురించిన 'యువ' కు ఆ రచయితలకు నా హృదయపూర్వక అభినందనలు.

వల్లంశెట్టి సాయిబాస్కర్
కాకినాడ

అక్టోబరు యువ సంచికలో "అందని పూలు" నన్నెంతో ఆకర్షించింది. కథ అంతా ఓ నూతన పంథాలో నడిచింది. రచయితకు నా అభివందనాలు.

"చక్రనేమి" సీరియల్ చాలాచక్కగ సాగిపోతూఉంది.

బంకిమ్‌చంద్ర చటర్జీగారి "రజని" సంక్షిప్త నవల పాఠకుల నాకర్షిస్తోంది ఇటువంటి కథలను ఈ యువలో అచ్చు వేయించిన ఎడిటర్‌గారికి ధన్యవాదాలు.

వాసంతి

వాల్తేరు

'యువ' అక్టోబర్ సంచికలో బంకిమ్ చంద్ర చటర్జీగారి 'రజని' కథ చాలా బాగుంది. ముప్పాళ రంగనాయకమ్మ గారి కథ "నాకు చచ్చిపోవాలని వుంది" లో నిజం ఉట్టిపడుతోంది. ఆమెకు నా హృదయపూర్వక అభివందనలు మిగత కథలు సుమారుగా వున్నాయి.

సి. శ్యామల

కందుకూరు

అక్టోబరు యువ పత్రికలో ప్రచురింపబడిన శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ గారి రచన "నాకు చచ్చిపోవాలని వుంది" అత్యుత్తమంగా వుంచి కథలోవి, శైలి రచయిత్రి ప్రతిభను చాటుతున్నది ఇంత చక్కని కథను వ్రాసిన శ్రీమతి రంగనాయకమ్మగారికి. ప్రచురించిన మీకు అభివందనలు.

కృష్ణ

గుంటూరు

# యువ

## దీపావళి సంచిక

ఇందులో

పాలగుమ్మి పద్మరాజు — మా గోఖలే

శ్రీమతి భానుమతీ రామకృష్ణ — విజయలక్ష్మి

బుచ్చిబాబు — శర్వాణి

S V రంగారావు — శంకరమంచి సత్యం

ముప్పాళ రంగనాయకమ్మ — కొమ్మూరి వేణుగోపాలరావు

యద్దనపూడి సులోచనారాణి

ఇంకా

సంక్షిప్త నవల, వడ్డాది పాపయ్యగారి వర్ణచిత్రాలు, బైరాగి, దాశరథి గార్ల పద్యాలు, బొమ్మల కథ, ముచ్చటయిన కార్టూన్లతో, వైట్ ప్రింటింగ్ మీద ముద్రింపబడి దీపావళికి మీకు అందుతుంది.

వెల రు. **4-0-0**

## యువ కార్యాలయము

పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్ - 1

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు చక్రపాణి

సంపుటి 10 నవంబరు 1964 సంచిక 5

సెప్టెంబర్ నెలలో ఆంధ్రదేశంలో గత నూరేండ్లలో కని విని ఎరుగని ఉత్పాతం సంఘటిల్లింది 28 తేదీన గుంటూరు, కర్నూలు కృష్ణా, ఖమ్మం జిల్లాలలో కుంభ వృష్టి కురిసి, కాలువలు నదులుగానూ, చెరువులు సరస్సులుగానూ పొంగి పొర్లినవి మాచర్లవద్ద కృష్ణానదిమీద సిమెంటుతో కట్టిన రోడ్డువంతెన నీళ్ళలో కొట్టుకుపోయింది విజయవాడ – ఖమ్మంల మధ్య రైలుదారికి గండ్లు పడి, మూడు రోజులు రైళ్ళు నడవలేదు. విజయవాడ పట్టణంలోనే అనేక ప్రాంతాలలో ఇళ్లుకూడా మునిగి పోయినంతగా వరదనీరు ప్రవహించింది.

ఈ ప్రళయం సుమారు రెండువందలమంది ప్రాణాలను బలిగొన్నది కొన్ని వేల ఎకరాలలో పంటలు దెబ్బతిన్నవి ఎన్నో యిళ్ళు కూలిపోయినవి ప్రాణ నష్టంతోపాటు, అపారంగా ఆస్తినష్టంకూడా కలిగింది. ఇంతటి ఘోర ప్రమాదం ఇటీవలి చరిత్రలో ఆంధ్రదేశం ఎరుగదు

అయితే, ఇలాటి ప్రమాదం సంభవించడానికి అవకాశం ఉన్నదని ప్రజలకూ, ప్రభుత్వానికీ తెలియకపోలేదు. ప్రతి సంవత్సరమూ ఆగస్టు, సెప్టెంబర్ నెలలో ఈ ప్రాంతాలలో వానలు కురవడం మామూలే ప్రతి సంవత్సరమూ రైళ్ళ రాక పోకలకు ఇబ్బంది కలగడం అందరికీ తెలిసిన విషయమే మాచర్ల దగ్గర రోడ్డు

వంతెన నీళ్ళలో కొట్టుకొనిపోవడం అనుకోని సంఘటన కావచ్చును; కాని ఖమ్మం-విజయవాడల మధ్య రైలుదారికి గండ్లు పడడం, కొత్తసంగతి కాదు బుడమేరు పొంగి వేలాది ఎకరాలలోని పంటలు నాశనం కావడం గాని, విజయ వాడలోకి వరదనీరు వచ్చి ఇళ్ళు కూలిపోవడం, వేలాది ప్రజలు నిరాశ్రయు లవడం గాని కొత్తసంగతి కాదు

ఇల్లు కట్టుకోవడం, ఒక మనిషి జీవితకాలంలో సాధించే మహత్తర కార్యాలలో ఒకటి ఇల్లు కట్టుకోడానికి ఎంత కష్టపడాలో, ఎన్ని అవసరాలను గడుపుకోకుండా డబ్బును కూడబెట్టుకోవాలో, ఎంతంత వడ్డీకి అప్పు చెయ్యాలో, ఇల్లు కట్టుకున్న ప్రతి సామాన్య గృహస్తుడికీ తెలుసు. అలా కష్టపడి కట్టుకున్న ఇల్లు, వరదలకి కూలిపోతే, ఆ గృహస్తుడికి మిగిలిన జీవిత మంతా రోదనమే కదా!

శ్రమపడి దున్ని, విత్తనం నాటి, పంటకోసం ఎదురుచూసే రైతు, తన పొలం వరదలో మునిగి యీయేటి పంట వరదపాలై పోతే, మళ్ళీ సంవత్సరం దాకా ఎన్ని అవస్థలు పడుతూ కాలం గడపాలి? ఇలాటి విపత్తు రాకుండా మనం జాగ్రత్త పడలేమా?

ఇదివరకు ఎన్నడూ కుంభవృష్టిని ఎరుగని ప్రాంతాలలో విపరీతంగా వానలు కురిస్తే, దానివల్ల ప్రజలకు కష్ట, నష్టాలు సంఘటిల్లితే, అనుకోని ప్రమాదం వచ్చి నప్పుడు ఎవ రేం చెయ్యగల రని మనస్సుకు సమాధానం చెప్పుకోవచ్చును.

కాని, ఏటేటా వచ్చే ముప్పును తొలగించుకోవడానికి ప్రయత్నం చెయ్యక పోవడం, మూఢత్వం అవుతుంది.

బుడమేరు పొంగి, ప్రొర్లి ఏటేటా విస్తారమైన నష్టాన్ని కలిగిస్తున్నది. ఏటేటా ప్రజలు, యీ ముప్పును తొలగించండోయ్ అని ప్రభుత్వాన్ని అర్థిస్తూనే వున్నారు. బుడమేరు నీటిని మళ్ళించి, ప్రజలకూ, పంటలకూ నష్టం వాటిల్లకుండా చెయ్యడానికి నాలుగేళ్ళనాడు ఒక పథకం కూడా తయారు చెయ్యబడింది. కాని, ఆ పథకాన్ని అమలు జరపకుండా మూల పారేసింది రాష్ట్ర ప్రభుత్వం. ఇలా చెయ్యడం కర్కశత్వం.

ఏటేటా ఇలాటి ప్రమాదాలను ప్రజలు ఎదురుచూస్తూ వుండవలసినదేనా ?

బుడమేరు పెద్దనది కాదు వర్షాకాలంలో మాత్రం విజృంభించి, ఎండాకాలంలో కిమ్మనకుండా వుండే ఏరు ఈ ఏటి వరదనీటిని ఒక రిజర్వాయరులోకి మళ్ళించడం గాని, కృష్ణానదిలోకి మళ్లించడం గాని నాగార్జునసాగర్ లాంటి గొప్ప ప్రాజెక్టును కట్టిస్తున్న రాష్ట్ర ప్రభుత్వానికి అసాధ్యమైన పనికాదు దీని కయ్యే ఖర్చు, ప్రభుత్వం భరించలేనిదీ కాదు.

ఏటేటా, బుడమేరు వరదలవల్ల నష్టపడినవారికి సహాయం చెయ్యడానికి ప్రభుత్వం ఇచ్చే డబ్బు, పంటల నష్టంవల్ల పన్నులో తగ్గింపు చేసే డబ్బు, వరద ప్రాంతాల తణిఖీకి వెళ్ళే ఉద్యోగులకు ఇచ్చే బత్తా డబ్బు – ఇవన్నీ ప్రభుత్వానికి నష్టాలే.

బుడమేరు ప్రాజెక్టును కట్టించినట్లయితే, ఏటేటా యీ నష్టం ఉండకపోగా కొన్నేళ్ళ తరవాత ఇదొక లాభసాటి పథకంగానే పరిణమిస్తుంది పైగా, వేలాది ప్రజలకు సంభవించే కష్టాలనూ, నష్టాలనూ తొలగించడ మవుతుంది.

ఈ సంగతు లన్నీ ప్రభుత్వానికి – అంటే మంత్రులకు – తెలియవా ? తెలిసి కూడా ఎందుకు నిర్లక్ష్యం చేస్తున్నారు ?

ప్రజల కష్టాలను తొలగించడానికి అవసరమైన పథకాన్ని నిర్వహించకపోవడానికి రాజకీయ కారణాలు వుండకూడదు; ఖర్చు విషయమై ప్రభుత్వం ఆలోచించకూడదు.

మళ్ళీ 1965 లో వరదలు వచ్చి ప్రజలకు ఆపద కలిగేదాకా వూరుకోకుండా, ఇప్పుడే ప్రభుత్వం యీ విషయం ఆలోచించి, వెంటనే కార్యాచరణకు పూనుకోవాలి. లేకపోతే, ఏటేటా యీ ముప్పు తప్పదు.






''అవునండీ! ఈ రోజుల్లో ఇళ్ళల్లో రెండు రేడియోలూ ఉండాల్సిందే; ఒకదాంట్లో నేను క్రికెట్ కామెంట్రీ వింటున్నా; రెండోది నా భార్య సినిమాపాటలకి.''




"స్కూల్లో మీకు మార్కులు ఎలా వచ్చాయిరా?''
"నేను లెక్కల్లో స్కూలు అంతటికీ ఫస్టుమార్కు మావయ్యా."
''నేను బడినుంచి వచ్చేటప్పుడు ఫస్టు మావయ్యా!''

# చిత్రవార్తలు



ఇటీవల కృష్ణానదిలో భీభత్సంగా ప్రవహించిన వరదవెల్లువలు విజయవాడవద్ద బ్యారేజీనీ, రైలు వంతెననూ ముంచెత్త జూస్తున్న దృశ్యం.



తాజ్‌మహల్‌ను చూచే యాత్రికుల రాకపోకల సౌకర్యార్థం న్యూఢిల్లీనుంచి ఆగ్రాకు 'టాజ్ ఎక్స్‌ప్రెస్' అనే స్పెషల్ రైలుబండి అక్టోబర్ 1 నుండి నడుపబడుతున్నది.



మన ముఖ్యమంత్రి, రెవిన్యూమంత్రి, యూనియన్ ఆహారశాఖామంత్రి నాగార్జునసాగర్ వద్ద కృష్ణానది ప్రళయప్రవాహాన్ని తిలకిస్తున్నారు.



చంద్రవంక వరదలవల్ల మాచర్ల స్టేషన్‌వద్ద రెండు ఫర్లాంగుల రైలురోడ్డు కొట్టుకొనిపోయింది.



ప్రెసిడెంటు రాధాకృష్ణన్ మాస్కో ఏర్‌పోర్టువద్ద శ్రీ ఎ. మికోయన్, శ్రీ కృశ్చేవ్ మొదలైన సోవియట్ ప్రముఖులకు వీడ్కోలు తెలుపుతున్నారు.



ప్రధానమంత్రి శ్రీ లాల్‌బహాదూర్ శాస్త్రి కైరోలో యుగోస్లావియా ప్రెసిడెంట్ మార్షల్ టిటోతో ముచ్చటిస్తున్నారు.




జ రి గి న క థ

[పారశాల రోజుల్లో పిల్లలమధ్య భేదాభిప్రాయాలూ ఈర్ష్యలూ ఉంటాయి కాని కిశోర్ సద్గుణాలు శంకర్‌ను దగ్గరచేసి ఇద్దరి మధ్యా స్నేహానుబంధం ఏర్పడింది. పరిస్థితులవల్ల ఇద్దరూ విడిపోయి క్రమేణా ఎంతో దూరం అయిపోయారు అకస్మాత్తుగా సమాగమం కలకత్తాలో కిశోర్ మెడిసిన్ చదువుతూ శంకర్ లా చదువుతూఉండగా. ఏదో ఆప్యాయతా — ఎంతో దగ్గరైనట్లుగా అన్పించిం దిద్దరికీ

ప్రమీల శంకర్ చెల్లెలు. ప్రమీలను సుకుమార్, చెల్లెలైన నీహారిక కోరికపై వివాహ మాడడు. నీహారిక స్త్రీలకు స్వాతంత్ర్యం, హక్కులూ ఉండాలనే తత్త్వం గలది. వాటిపై ఆమె వ్రాసిన వ్యాసాలుకూడా ప్రచురిత మయ్యాయి

కిశోర్ ఉబుసుపోకకు రచయితయ్యాడు. నీహారిక వ్యాసాలు చూచి యీ వ్యాసాలకు విమర్శలు వ్రాశాడు: 'దివాకర శర్మ' పేరుతో ప్రచురింప బడ్డాయి ఈ విమర్శలకు ప్రతివిమర్శలు వ్రాసి 'మేఘబాల' పేరుతో నీహారికపంపింది ప్రచురణార్థం

తరుచు చెల్లెలికోసం రావడంతో, శంకర్‌కు నీహారికతో ఎక్కువ సన్నిహితత్వం ఏర్పడింది. కిశోర్‌ను కూడా వెంట గొనివెళ్ళి పరిచయం చేశాడు శంకర్ క్రమంగా కిశోర్, నీహారికలు దివాకరశర్మా, మేఘబాలా అని తెలివిడి అయిండి ఇద్దరి మధ్యా ఒక విధమైన గౌరవానురాగాలు ఏర్పడినై

నీహారిక తల్లికి సుస్తి చేసినప్పుడు కిశోర్ చేసిన సహాయానికి నీహారికమనసులో కిశోర్‌పై ఓ విధమైన అభిప్రాయం ఏర్పడింది కాని శంకర్‌కు ఇది తెలిసి ఒక విధంగా క్రుంగిపోయాడు.]

— ఇక చదవండి

నేను ప్రమీలను అమ్మదగ్గర కూచోబెట్టి వాళ్ళకు టీ తీసుకుపోయాను. శంకర్ టీ త్రాగుతూ - "అత్తయ్య స్థితి బాగా లేదనుకుంటాను, ఏమంటావు సుకుమార్ !'' అన్నాడు.

''డాక్టరు వచ్చినప్పుడు అన్నయ్య లేడు. నేను డాక్టరు వెళ్ళినాక కిశోరును అడిగాను. అతను "సీరియస్ కేసే గాని భయం లేదన్నాడు'' అన్నాను

శంకర్ ముఖం చిట్లించుకుని - "కిశోర్‌కు ఏమి తెలుసు-వాడు స్టూడెంటు. అతని అభిప్రాయానికి విలువ యిస్తే ఎలా ? అతను తెచ్చిన డాక్టరుకూడా అంత గట్టివాడు కాదని తోస్తున్నది. నా ఉద్దేశం ఇంకో డాక్టరికి చూపిస్తే బాగుంటుందని" అని అన్నాడు.

"అలాగే. కిశోర్ రాత్రికి ఇక్కడికి వస్తాడు. అతన్ని కనుక్కుని ఇంకొకర్ని పిలిపిద్దాము'' అన్నా నేను.

"నీరూదేవి ! నేను చుట్టాన్ని అయిఉండికూడా మీ కేమీ సహాయపడలేక పోయినందుకు నాకు సిగ్గేస్తున్నది. కిశోర్ ముందు నేనెందుకూ పనికిరాక పోయాను'' అన్నాడు శంకర్.

"మీరు డాక్టరూ కాదాయె. అదీకాక మీయిల్లు చాలాదూరమాయె."

"సరే అయితే. నేనుకూడా ఇక్కడే వుంటాను."

"మరీ మంచిది !" అన్నాడు అన్నయ్య నవ్వుతూ.

శంకర్ ధోరణి చూసి నాలో నేను నవ్వుకున్నాను. తన ఆంతరంగిక మిత్రుడని నాలుగురోజులకిందట ఎవరినిగురించి చెప్పారో అతనిమీదే ఇంత అసూయ ! కిశోర్ ఇంత తరుచుగా ఇక్కడికి రావటమూ, నాతో కలవటమూ శంకర్‌కు ఇష్టం లేదని గ్రహించాను.

ప్రొద్దుగూకినాక కిశోర్ వచ్చాడు. అంతా లైబ్రరీగదిలో వున్నాము శంకర్ అన్నాడు :- "ఏమోయ్ కిశోర్ ! నువ్వు పెద్ద డాక్టరువి అయి పోయావటే ?"

కిశోర్ కూచుంటూ-"ఇంకా కాలేదు; అవుదామని ఉద్దేశం. నువ్వెప్పు డొచ్చావు, శంకర్ ?" అని అడిగాడు.

"ఇవ్వాళ కాలేజీనించి ఇటే వచ్చాను. రాత్రికి ఇక్కడే ఉంటాను." కిశోర్ నావంక చూసి - ''ఇవ్వాళ అమ్మకు ఎలా ఉంది ? జ్వరం తగ్గిందా ? అలానే ఉందా ?" అన్నాడు.

"మీ రొచ్చి చూడండి" అన్నాను నేను.

కిశోర్ నా వెంట వచ్చాడు, అమ్మను చూడను. మాతో అన్నయ్యా, శంకర్ వచ్చారు.

కిశోర్ థర్మామీటరు పెట్టి అమ్మపక్కనే కూచున్నాడు. అమ్మ కళ్ళు తెరిచి– "నాయనా, వచ్చావా? చాలా నొప్పిగా ఉంది వీపు –" అంది.

"ఆహార మేమన్నా ఇచ్చారా?'' అని అడుగాడు కిశోర్ నన్ను.

''బార్లీ నీళ్ళలో పాలు కలిపి ఇచ్చాను. కాని తాగనంటుంది. బలవంతాన కాసిని తాగింది, చివరికి.''

కిశోర్ థర్మామీటరు తీసిచూసి– "103° ఉంది. ఇంకా ఎక్కువ కావచ్చు. ఏదోవిధంగా ధారకం పోకపోతే లాభంలేదు. అసలే బలహీనంగా ఉంది'' అన్నాడు.

ఆతర్వాత ముగ్గురూ లైబ్రరీగదిలోకి వెళ్ళారు. ప్రమీలను పిలిచి అమ్మదగ్గర కూచోబెట్టి నేనూ అక్కడికి వెళ్ళాను. అప్పటికి ప్రమీల వంట చేసింది.

"మీ డాక్టరు ఏమి చెప్పాడు రోగాన్నిగురించి?'' అని శంకర్ కిశోర్‌ను అడిగాడు.

''రాచపుండు డెవలప్ అవుతున్న దనీ, దానికే ఇంతజ్వర మనీ డాక్టరు చెప్పాడు. అయితే ఆపరేషను చెయ్యాలా లేదా అనేవిషయం ఇంకా రెండు రోజులు లాగికాని చెప్ప లేనన్నాడు. కేసు సీరియస్ కాని మలిగ్నెంట్ వైపు కాకపోతే ఫర్వాలేదు" అన్నాడు కిశోర్.

"చాలామంది డాక్టర్లు సమయానికి జబ్బు కనుక్కోలేరు. ఆ తర్వాత కనుక్కున్నా ప్రయోజన ముండదు. మీ డాక్టరుకు అంత అనుభవం ఉన్నట్టుగా కనిపించదు. ఇంకొకర్ని పిలిచిచూపిస్తేనేం?'' అని అడిగాడు శంకర్.

''ఆయనకి అభ్యంతర మేముంటుంది కిశోర్‌బాబూ? ఇంకొక పెద్దడాక్టర్ని పిలిచి చూపిద్దాము" అన్నాడు అన్నయ్య.

"ఏమీ అభ్యంతరంలేదు. మనం పెద్దడాక్టర్లదగ్గరికి పోయినకొద్దీ డబ్బు తగలేయటం తప్ప ఉపయోగ మేమీ ఉండదు.''

''కిశోర్‌బాబూ! అమ్మకు ఆపరేషన్‌తో పనిలేకుండా జరిగేటట్టు చూడండి. అసలే బలహీనం, అందులో వృద్ధాప్యం; తట్టుకోలేదు'' అన్నాను నేను.

''అందుకనేగా ఈ డాక్టరు మందే ఇస్తున్నాడు.''

"మరి ఉపయోగ మేమీ కనపడటంలేదే. అయితే మనం ఇంకోపని చేయ కూడదూ? ఇంకో డాక్టర్ని పిలిచి సలహా తీసుకుంటే" అన్నాడు అన్నయ్య.




**గడియారాల మెకానిక్ అయిన భర్తతో "నా నెక్లెస్ చూడండి" అంది భార్య.**

''డాక్టర్ డి. యస్. ముఖర్జీ పెద్ద సర్జన్ అని వాడుక. అతనికి చూపించ వచ్చు'' అన్నాడు శంకర్.

''నువ్వు ఎరుగుదువా కిశోర్ ?'' అని అడిగాడు అన్నయ్య.

''పేరు విన్నానుగాని ఆయనతో పరిచయంలేదు. ఆయన చికిత్స సంగతి కూడా నాకు తెలియదు.''

''నీ కేం తెలుస్తుంది - కాలేజీ, మెస్సూ తప్ప; డాక్టరు ముఖర్జీ ఇంగ్లండులో చదవటమే కాక ఐదేళ్ళు ప్రాక్టీసు చేసివచ్చాడు. ఎంత పెద్ద ఆపరేషనైనా ఆయనకు మంచినీళ్ళప్రాయం. మా భవానీపూర్‌లో అందరికీ తెలుసు ఆయన సంగతి'' అన్నాడు శంకర్.

''మీరు ఆపరేషను అంటుంటే నాకు చాలా భయ మేస్తున్నది, శంకర్ బాబూ!'' అన్నాను నేను.

''భయ మెందుకూ ? అవసరం లేదనుకుంటే ఆయన చెయ్యనే చెయ్యడు.''

''సరే, నువ్వు రేపు పొద్దున పోయి ఆయన్ను కనుక్కో. ఆయన ఎప్పుడు వచ్చేదీ మాకు తెలిపితే కిశోర్ సురథబాబును వెంటబెట్టుకు వస్తాడు. ఏం సరేనా ?'' అన్నాడు అన్నయ్య.

"అలాగే. నేను మెడికల్ కాలేజీకి పోయి, కిశోరుకు చెప్పుతాను. ఆయనకు ఫీజు పదహారు రూపాయలు" అన్నాడు శంకర్.

"అలాగే ఇద్దాము" అన్నాడు అన్నయ్య.

నేను పోయి భోజనాల ఏర్పాట్లన్నీ చేశాను. భోంచేసేటప్పుడు కిశోర్ నాతో అన్నాడు:—"మీరు రెండుమూడు రోజులనించీ మేలుకున్నారు; ఇవ్వాళ నిద్రపోండి. నేను కూచుంటాను."

"అయితే అర్ధరాత్రిదాకా నేను ఉంటాను. ఆ తర్వాత కిశోర్ ఉంటాడు" అన్నాడు శంకర్.

"నీకేమి తెలుసు నర్సింగ్? నాకు రాత్రిళ్లు మేలుకోవటం అలవాటే. మీ రంతా పడుకోండి. నేను ఒక్కణ్ణి చాలు" అన్నాడు కిశోర్.

"రాత్రి పన్నెండు గంటలదాకా మే మంతా మేలుకుని ఉంటాము. మీరు నిద్రపోండి. కిశోర్ బాబూ! ఆ తర్వాత మీ రుండి మగత రాకుండా చూడండి" అన్నాను నేను.

"మగత రాకుండా చూడాలంటే నేనే కనిపెట్టుకుని ఉండాలి."

భోంచేసినతర్వాత తాంబూళం తీసుకుని కిశోర్ అమ్మదగ్గర కూచున్నాడు. అన్నయ్య, శంకర్ కూడా అక్కడే కూచుని మాట్లాడుతున్నారు. నేనూ ప్రమీలా భోజనాని కెళ్ళాను.

నేను భోంచేసివచ్చేవరకు అమ్మ తలమీద ఐస్ బాగ్ పెట్టిఉంది. నేను కిశోర్‌తో - "మీరు పడుకోండి కాసేపు. నేను అమ్మదగ్గర కూచుంటాను" అన్నాను.

అన్నయ్య అప్పటికే నా పక్కమీద నిద్రపోయాడు. కునికిపాట్లు పడుతున్న శంకర్ నా మాట విని కళ్ళు విప్పుకు చూశాడు. నేను అన్నయ్యను లేపి - "అన్నాయ్ నువ్వు పోయి పడుకో. శంకర్ బాబుకు కూడా ఆయనపక్క చూపు" అన్నాను.

కాని శంకర్‌కు పోవటం ఇష్టంలేదు-కిశోర్‌ను వదిలి. నేను బలవంతాన కిశోర్‌ను పంపాను-శంకర్ కూడా అతని వెంబడే వెళ్ళాడు.

జ్వరం పెరుగుతూనే ఉంది. నేను ఐస్ బాగ్ ఉంచుతూనే ఉన్నాను. అమ్మ మూలుగుకు విరామమే లేదు. పన్నెండుకాగానే కిశోర్ వచ్చి- "ఇక మీరు లేవండి" అన్నాడు.

"మీరు సరిగ్గా పన్నెండింటికే వచ్చారు. నిద్ర పోలేదా ఏమిటి ?" అన్నాను నేను. నే నీమాట అన్నానో లేదో శంకర్ వచ్చేశాడు.

"మీ రెందుకు వచ్చారు శంకరుబాబూ ? మీ స్నేహితుడిది కాదూ వంతు ?" అన్నాను నేను.

"నేనూ కిశోరుతో కూచుంటాను" అన్నాడు శంకర్. అతనిమాట నా కేమీ నచ్చలేదు.

"నీ కంతగా మేలుకోవాలని ఉంటే మూడుగంటల కొచ్చి లేపుతాను-ఇప్పుడు నిద్రపో. నీరూదేవీ ! మీరుకూడా ఇక పోయి పండుకోండి" అన్నాడు కిశోర్.

కాని నా మంచం ఆ గదిలోనే ఉంది. కిశోరును నాదగ్గర వదిలిపెట్టి శంకర్ బయటి కెలాపోతాడూ ? కాని వెళ్ళకుండా ఉండే మార్గమూ కనిపించలేదు. కాసేపు అటూఇటూ తచ్చుకాడి శంకర్ వెళ్ళాడు. నేను పడుకున్నాను. కిశోర్ కుర్చీపీపు నావైపుకు ఉండేటట్టుగా తిప్పి కూచున్నాడు. నాకు పడుకోటానికి వేరే గదిలేదు. ఉంటే నే నక్కడ పడుకునేదాన్ని కాదు.

నే నెంతసేపు నిద్రపోయానో తెలియదు. హఠాత్తుగా మెలకువ వచ్చి కళ్ళు తెరిచాను-కిశోర్ రెప్పవాల్చకుండా నా ముఖంవంక చూస్తున్నాడు. ఎందుకో చెప్పలేను కాని నాకు తెలియకుండానే నవ్వి, ముఖం కప్పుకున్నాను. కిశోర్ అప్రతిభుడై -"లేచారే. మీరు లేచారో లేదో నసే చూస్తున్నాను. ఇంకొంచెం సేపు పడుకోండి; ఇప్పుడు ఒంటిగంటే" అన్నాడు.

నే నేమీ జవా బివ్వకుండా పక్కకు తిరిగి పడుకున్నాను. నాకప్పుడు కోపం కూడా వచ్చింది. ఈ మగవాళ్లు మమ్మల్ని ఏమనుకుంటారు ? ఆడవాళ్ళమీద వీళ్ళ కింతలోభం ఎందుకూ ? కిశోర్ ఇవ్వాళ నన్నెన్నిసార్లో చూశాడు; నేను ముసుగు వేసుకునేదాన్నికూడా కాను ; కావాలంటే ఎప్పుడూ చూడవచ్చు; మరి ఈ దొంగచూపు లెందుకూ ? ఈ కిశోర్ చాలా మంచివా డని ఇదివరకు విన్నాను. అతని ప్రవర్తనే ఇలా ఉంది ! ఈ ప్రపంచంలో ఎవ్వరినీ నమ్మటానికి వీల్లేదు. అందుచేత శంకర్ యిక్కడ కాపలా వుంటానికి వచ్చాడు.

ఇలా ఆలోచిస్తూ నేను మెదలకుండా పడుకున్నాను. తెల్లవారుఝామునకు అమ్మ బాధ మరీ ఎక్కువైంది. మగత రాలేదు కాని జ్వరమూ తగ్గలేదు. నా కిక నిద్రపట్టలేదు. కిశోర్ రాత్రంతా అలానే కూచున్నాడు. మూడుగంటలప్పుడు శంకర్ మళ్ళీ వచ్చాడు-అతనికి పాపం మనశ్శాంతిలేదు. ఎన్నో సందేహాలు,

పి శ్రీధరినీ చూసేవరకు నా కింత దుఃఖంలోకూడా నవ్వు వచ్చింది. ఆరాత్రి ఈవిధంగానే తెల్లవారింది.

## 11

ఉదయం పదకొండుగంటలకు డాక్టరు ముఖర్జీనీ, సురథబాబునూ వెంట బెట్టుకుని కిశోర్ వచ్చాడు. శంకర్ కొంచెం ఆలశ్యంగా వచ్చాడు. ముఖర్జీ అమ్మను పరీక్షచేసి సురథబాబుతో పరామర్శ చేసి అన్నయ్యతో – "ఇది రాచ పుండు! అందుకే త్వరగా పాకిపోతున్నది. కాబట్టి ఎంత త్వరగా ఆపరేషన్ చేస్తే అంత మంచిది" అన్నాడు. నే నీసంగతి విని ఏడ్చాను. నాకు మొదటినించీ భయ ముంది అమ్మ శస్త్ర చికిత్సకు తాళలేదని. అన్నయ్యా. కిశోరూ నాకు చాలా నచ్చచెప్పారు. శంకర్ కూడా వాళ్లతోపాటు కలిశాడు. విధిలేక నేను చివరకు వొప్పుకున్నాను.

మర్నాడు పదిగంటలకు డాక్టరు ముఖర్జీ, సురథబాబూ వచ్చి శస్త్రం చేసే ట్టుగా నిర్ణయం జరిగింది. దానికి ఏమేమి సరంజామా కావలిసిందీ కిశోర్‌కు చెప్పారు డాక్టర్లు. డాక్టరు ముఖర్జీ 16 రూపాయలు తీసుకున్నాడు. శస్త్రం చేసినందుకు 50 రూపాయలట.

వస్తువులకోసం అన్నయ్యా, కిశోరూ, శంకర్ బజారి కెళ్ళారు–ఆ పగలంతా నేనే కూచున్నాను అమ్మదగ్గర. ఆ పగలు పళ్ళరసంమాత్రం ఇచ్చాను అమ్మకు. సాయంత్రం అన్నయ్యా, శంకరూ సామాను తీసుకు వచ్చారు. కిశోర్ ఆస్పత్రి పని చూసుకుని రాత్రి పదిగంటలకు వస్తా నని చెప్పాడట.

అమ్మకు ఇవ్వాళకూడా జ్వరం ఎక్కువగానే ఉంది. ఐస్ బాగ్ పెట్టాను తల మీద. నేను భోజనానికి వెళ్ళినప్పుడు అన్నయ్యా శంకరూ కూచున్నారు అమ్మదగ్గర. నాకు అన్నం లోపలికి పోలేదు. నేను తిరిగి వచ్చేవరకు కిశోర్ వచ్చాడు.

"శంకర్ నువ్వు లే, నేను కూచుంటాను" అని కిశోర్, తర్వాత నాతో– "మీరుకూడా కాసేపు నిద్రపోండి" అన్నాడు శంకర్ "కిశోర్ నువ్వు రాత్రి కూడా నిద్రపోలేదు. పడుకో, నేనే కూచుంటాను" అని నాతో–"మీరుకూడా పడుకోండి, నిరూదేవీ!" అన్నాడు.

"ఇక నేను? మీ రంతా మేలుకుంటే నేను హాయిగా నిద్రపోయేదా?" అన్నాడు అన్నయ్య.

డాక్టర్లను పంపి అంతా లోపలికి వచ్చారు. కిశోర్ డాక్టరు ముఖర్జీ యిచ్చిన ప్రిస్క్రిప్షన్ కాగితం నాకిచ్చి "ఇందులో రాసినమందు నేను తెచ్చి యిచ్చి పోతాను. నాకు కాలేజీ ఉంది ఇవాళ" అన్నాడు.

"తెచ్చి ఇక్కడే భోంచేసిపోండి" అన్నాను నేను.

"సాయంత్రం తప్పక వస్తాను. నాకు మెస్‌లోనే భోజనం ఉంటుంది" అన్నాడు కిశోర్.

"మందు తీసుకుని మళ్ళీ నువ్వు రావట మెందుకూ ? నేను నీ వెంట వచ్చి తీసుకువస్తాను" అన్నాడు శంకర్.

నేను అన్నాయిని కాలేజీకి పోవద్దని చెప్పి, శంకర్ కిశోరులతో బయటికి వచ్చాను. నాకింకా అమ్మనుగురించి భయం పోలేదు. కిశోర్‌ను అడిగాను: "కిశోర్ బాబూ ! డాక్టరు ఏమి చెప్పాడు ? అనేక సందర్భాల్లో ఆపరేషను అయినాకకూడా విపత్తు రావటం కద్దు."

"అందుకేకదా మందిస్తున్నది. కొంచెం జాగర్తగా వాచ్ చెయ్యాలి. నేను సరిగ్గా నాలుగుగంటలకు వస్తాను. ఈ రాత్రికి నేనే కనిపెట్టివుంటాను. బహుశా ఈపూట జ్వరం ఎక్కువ కావచ్చు. మీరుమాత్రం రోగిని కదలనివ్వకండి. జాగర్త!" అన్నాడు కిశోర్.

కిశోర్ శంకరుతోపాటు వెళ్ళిపోయాడు. నేను అమ్మదగ్గరికి వచ్చి కూచు న్నాను. జ్వరం ఎక్కువ అవుతూనేవుంది. శంకర్ మందు తెచ్చాడు. మూడు గంటల కొకసారి ఆ మందు ఇవ్వ సాగాను. అన్నయ్యా, శంకరూ భోంచేసి అమ్మదగ్గర కూచున్నారు. నేనూ ప్రమీలా భోజనానికి వెళ్ళాము. నేను భోంచేసివచ్చి అమ్మదగ్గర కూచున్నాను. సరిగా సాయంత్రం నాలుగుగంట లకు కిశోర్ వచ్చాడు. అతను అమ్మ నాడి చూసి చాలా దుర్బలంగా ఉంద న్నాడు. అయితే టెంపరేచరు ఎక్కువ కాలేదన్నాడు.

నేను జ్వరం 101° ఉందని చెప్పాను. "ఇదివరకు ఇంతజ్వరం ఉంటే బాగా మాట్లాడేది. ఇవ్వాళ కదలకుండా పడుకున్నది" అని చెప్పాను.

"అయితే నేను పోయి ఒకమాటు సురథబాబును పిలుచుకొచ్చి చూపిస్తాను" అన్నాడు కిశోర్.

"త్వరగా పిలుచుకురండి" అన్నాను నేను.

అన్నయ్యవచ్చి — 'కండిషన్ ఎలాఉంది కిశోర్‌బాబూ' అని అడిగాడు.

''నాకంత బాగాఉన్నట్టు తోచటంలేదు. నే నిప్పుడే పోయి డాక్టర్ను పిలుచుకువస్తాను'' అన్నాడు కిశోర్.

కిశోర్ వెళ్ళి ఒక గంటలో సురథబాబును పిలుచుకొచ్చాడు. సురథబాబు రోగిని పరీక్షచేసి ఒక ప్రిస్క్రిప్షన్ రాసి వెంటనే తెమ్మన్నాడు. శంకర్ మందుకు పోయాడు. నేను అన్నయ్యతో చెప్పాను, కండిషన్ ఎలా ఉందో డాక్టర్ను కనుక్కో మని.

అన్నయ్య డాక్టరును కనుక్కున్నాడు, కాని వాళ్ళ మాటలు అంత ధైర్య మిచ్చేటట్టుగా లేవు. నేను కిశోరును అడిగాను – "ఇంకో డాక్టర్ను పిలిచి చూపిస్తే బాగుండదా?'' అని. కిశోర్ డాక్టర్ని అడిగాడు. ఆయన "తప్పకుండా; డాక్టరు ముఖర్జీనే పిలుచుకురండి'' అన్నాడు. కిశోర్ డాక్టరుకోసం పోయాడు. నేను అమ్మదగ్గరికి పోయి కూచున్నాను. ఆమె స్థితి చూస్తే నాకు ఏడుపు ఆగటంలేదు. అన్నయ్యకూడా అక్కడికి వచ్చాడు. ఇంతలో శంకర్ మందు తెచ్చాడు. డాక్టరు వచ్చి ఆమందు ఒక డోసు తాగించాడు.

దాదాపు రాత్రి ఎనిమిది గంటలకు కిశోర్ డాక్టరు ముఖర్జీని వెంట పెట్టుకునివచ్చాడు. ఆయన రోగిస్థితి చూసి పెదెం విరిచాడు. ఇద్దరు డాక్టర్లూ ఆలోచించుకుని మందు మార్చారు. కిశోర్ పోయి మందు తెచ్చాడు. ముఖర్జీ ఒకడోసు మందిచ్చి, సురథబాబుతో మెల్లగా ఏదో చెప్పి ఫీజు తీసుకుని వెళ్లిపోయాడు. నేను కిశోర్‌ను పిలిచి డాక్టరు అభిప్రాయం దాచకుండా చెప్పమని అడిగాను.

"ఐతే సురథబాబును రాత్రికి ఇక్కడే ఉండమనండి'' అన్నాను నేను.

''అలాగే ఉండమందాము. ఈరాత్రే చాలగడ్డు'' అన్నాడు శంకర్.

ఈమాట వినేవరకు ఏడుపు వచ్చింది. కిశోర్ నన్ను ఓదార్చాడు.

''మీ రలా అధైర్యపడకండి. అమ్మను చూస్తూఉండండి. నేను సురథబాబు దగ్గర ఉంటాను. మధ్యమధ్య వచ్చి ఆయన నాడి చూస్తూఉంటాడు.

మందు ఇచ్చినతర్వాత రెండుగంటలకు అమ్మ ఒకమాటు కళ్ళు తెరచింది. బహుశా ఇప్పుడు మైకం లేదనుకుంటాను. నేను పోయి కిశోరును పిలిచాను. అతనూ డాక్టరూ వచ్చారు. అన్నయ్యా శంకరూ గూడా వచ్చారు. డాక్టరు అమ్మను పరీక్షచేశాడు. అమ్మ ''నీళ్ళు'' అంది, నీరసంగా. నేను చెంచాతో నోటికి నీళ్ళు అందించాను. అమ్మ నావైపే చూస్తూ ఉండిపోయింది. ఆమె



"బాస్, నన్ను ఒక్క వారం రెస్టు తీసుకోమంటారా?...రోజులు రెండు...ఈ రోజు సాయింత్రం...లేకపోతే ఈ రోజు రాత్రి ఓవర్‌టైమ్ చెయ్యమంటారా?"

---

కళ్ళ వెంట నీళ్ళు కారాయి. నేను చెరగుతో కళ్ళు తుడిచాను. ఆ తర్వాత అమ్మ కళ్ళు తెరిచి చుట్టూ చూసింది–ఎవర్నో వెతుకుతున్నట్టుగా. చివరకి ఆమె చూపు కిశోర్ మీద నిలిచింది. ఆమె కళ్ళు మెరిసినై. ఆమె సైగతో కిశోరును పిలిచింది. కిశోర్ దగ్గరకు వచ్చి నిలబడగానే, ఎక్కడో ఖావిలోవుండి మాట్లాడినట్లు–''బాబూ! నీరూను నీకు వప్పగించిపోతున్నాను'' అని కళ్ళు మూసుకుంది. నాకు ఏడుపు ఆగక బయటికి వెళ్ళిపోయాను.

డాక్టరు అమ్మదగ్గర ఉన్నవాళ్ళ నందరినీ బయటికి పొమ్మన్నాడు. అన్నయ్యా శంకరూ వెళ్లిపోయారు. నేను మళ్ళీ వెళ్లి అమ్మ తలాపిదగ్గర నుంచున్నాను. డాక్టరు అమ్మ నాడిచూసి లైబ్రరీగదిలోకి వెళ్లి కూచున్నాడు.

రాత్రి పన్నెండుగంటలకు అమ్మకు ఎగశ్వాస పుట్టుకువచ్చింది. నేను అన్నయ్యను పిలిచాను. అన్నయ్యవెంట డాక్టరూ కిశోర్ కూడా వచ్చారు. డాక్టరు నాడి చూసి "నాడి అందటంలేదు" అని బయటికి వెళ్ళాడు. అన్నయ్యా కిశోరూ డాక్టరు వెంట బయటికి వెళ్ళారు. నాకు డాక్టరు మాట అర్థంకాలేదు. భయం నన్ను ఆవరించింది. కాసేపటికి అన్నయ్య తిరిగివచ్చి "డాక్టరు ఇక లాభంలేదని చెప్పి వెళ్ళిపోయాడు" అని ఏడ్చాడు. ఆమాట వినేవరకు నేనూ ఇక ఆపుకోలేకపోయాను. భోరున ఏడ్చాను. మా యేడుపు విని కిశోరూ, శంకరూ వచ్చారు. వాళ్ళు అన్నయ్యను పట్టుకొని బయటికి తీసుకువెళ్ళారు. తర్వాత కిశోర్ మళ్ళీ వచ్చి నన్ను బయటికి పొమ్మన్నాడు. నేను పోలేదు. అమ్మను కావలించుకుని ఏడ్చాను. ప్రమీలకూడా ఏడుస్తున్నది.

అమ్మస్థితి అక్కడికక్కడికీ దిగజారింది. మేమంతా చుట్టూ ఏడుస్తూ కూచున్నాము. మా స్నేహమయి జనని మమ్మల్ని దరిలేని దుఃఖసాగరంలో ముంచి రాత్రి రెండుగండలకు యీ లోకం వదలిపోయింది.

## కిశోర్ చెప్పినది

ఈ కొద్దిరోజులమధ్య జరిగిన ఘటనలు జరగటానికి అవకాశ మున్నదని నేను స్వప్నంలోకూడా అనుకోలేదు. ఏదో ఊహించలేని శక్తిద్వారా నే నెన్నడూ కనివిని ఎరగని కుటుంబంతో పరిచయం కలిగింది. సుకుమారుని తల్లి చనిపోయిన మరునాడు నేను లాంఛనంగానే వారింటికి వెళ్ళాను. సుకుమారుడు నన్ను లైబ్రరీగదిలో కూచోబెట్టి, బహుశా వాళ్ళ చెల్లెలికి చెప్పటానికనుకుంటాను, లోపలికి వెళ్లాడు. ఆ తర్వాత కాసేపటికి తిరిగి వచ్చి— "నీరూ దుఃఖంతో మంచంపట్టింది!" అన్నాడు. నేను అతని చెల్లెల్ని చూడటానికే వచ్చా ననేది అతని మనసులో ఎందుకు తట్టిందో నేను చెప్పలేను.

"ఆమెకోసం రాలేదు నేను. మీ రెలా ఉన్నారో చూసిపోదామని వచ్చాను," అన్నాను నేను.

"మేము ఏదోరకంగా ఉన్నాము. నీరూతోనేవచ్చింది ఇబ్బంది. నిన్నటినించీ ఒక్కచుక్క మంచినీరుకూడా త్రాగలేదు," అన్నాడు సుకుమార్.

"హఠాత్తుగా యిలాంటి ఆపద వొస్తుందని ఎవ్వరమూ అనుకోలేదు అంచేత అది తట్టుకుని మామూలుమనిషి కావటానికి కొంతకాలం పడుతుంది

సరే మీ కేమైనా సామానదీ కావలసిఉంటే చెప్పండి, నేను తెచ్చిపెడతాను.'' అన్నాను.

''మీమీద వున్న స్వతంత్రం మాకు ఇంకొకరిమీద లేదుకూడా. రేపు ఒకమాటు రండి; దీపారాధనకూ, హవిస్సానికీ మంచి నెయ్యి దొరుకుతుందేమో చూచిఉంచండి.''

నేను 'అలాగే' నని వచ్చేశాను.

నేను మర్నాడులేచి బజార్లన్నీ వెతికి మంచి ఆవు నెయ్యి సంపాయించి తీసుకువెళ్ళాను. సుకుమార్ ఆ నెయ్యి చూసి చాలా సంతోషించాడు. నేనివాళ కిశోర్‌తోపాటు నీరూదేవి గదిలోకి పోయాను. ఆమె వెల్లకిలా పడుకుని గోడవంక చూస్తోంది. మేము రావటం చూసి ఆమె ఏమీ కదల్లేదు. సుకుమారుడు నన్ను వదిలి వెళ్ళిపోయాడు. నేనూ అయిదారు నిమిషాలు కూచుని ఏమీ మాట్లాడకండానే బయటికి వచ్చేశాను. ప్రమీల అన్నది నాతో:—
''ఈ రెండు రోజులనించీ అలాగే పడుకునిఉంది. మనం ఏమన్నా చెప్పితే వినుక్కుంటుంది. నిన్నరాత్రి బలవంతాన ఒకగ్లాసు పాలు తాగింది. నిన్న సాయంత్రం అన్నయ్య వస్తే చూసి భోరున ఏడ్చింది. అన్నయ్య సముదాయించి వెళ్ళాడు.''

''ఏడవటం మంచిదే'' అని నేను వచ్చేశాను. నా గుండెలో కళుక్కుమన్నది. నేనామె కేమీ కానా? నన్ను చూసి గుర్తేపట్టలేదే! ఇదేనా నా అదృష్టం!

ఆ తర్వాత రెండుమూడు రోజులు నేను సుకుమార్ ఇంటికి వెళ్ళలేదు. మూడోనాటి సాయంత్రం శంకర్ వచ్చి నవ్వుతూ—''ఏమిరా, కిశోర్! మనిద్దరం కలిసే నడిచినా పెన్నిధి నీకు లభించింది, నాకు లేకపోయింది!'' అన్నాడు.

''ఏమిటి నాకు లభించిన పెన్నిధి?''

''మనిద్దరం కలిసి ప్రమీల ఇంటికి వెళ్ళాము. నీకు స్త్రీలాభం; నాకు మిత్రహాని!''

''మిత్రహాని ఎలా?''

''తెలియదా నీకు? నీవు రాకముందు నాకూ నీరూదేవికి చాలా స్నేహం.''

''అది ఎక్కడికి పోయింది? ఇప్పుడూ మీ రిద్దరూ బాగానే ఉంటారే?''

''ఈ స్నేహం ఇంకా ఎన్నాళ్ళుంటుందిరా—నువ్వు ఉండనిస్తావా?''

"ఉండనివ్వ కేంచేస్తాను ? నా చేతులో ఏముందీ ?"

"నువ్వామెకు కాబోయే భర్తవు."

"ఆమె నన్ను భర్తగా అంగీకరించకపోతే ?"

"ఎందుకు అంగీకరించదు ? మృత్యు సమయంలో మాతృదేవత ఆదేశం—ఎవరైనా మీరగలరా ?

"నే నంటే ఆమెకు చాలా 'ప్రెజుడిస్....' అది మరచిపోలేదు. నేను స్త్రీ జాతిని అవమానించే పాపాత్మా దుశ్శాసనుణ్ణి—జ్ఞాపక ముందా?"

"ఆఁ."

"ఆమె రాతలను చదివి నేను ఆమె, పెళ్ళి చేసుకోదని ఊహించాను అలాగే ఆమె చేసుకోవటమూ లేదు."

"కాని ఆ అభిప్రాయం మారటం ఎంతసేపూ ? షేక్స్పియర్ చెప్పనే చెప్పాడు-స్త్రీలు చంచలచిత్త లని ! సరే ఆ గోల పోనీ. ఇప్పుడు నీవు వాళ్ళ యింటికి పోతున్నావా ?"

"స్నేహం తెగిపోకుండా ఉండగలందులకా ?"

"ఆఁ. అదీకాక వాళ్ళకు ఈ ఆపదలో ఎవ్వరు తోడున్నారు? మనం పోవడం మర్యాదకాదా? రా, వెళ్ళుదాము."

"శంకర్దా! నీకూ వాళ్ళకూ చుట్టరికం ఉంది; నీవు తప్పక పోతావు. కాని, నాకు ఆలాంటిదేమీ లేదు. పైగా నేవాస్తే నీ సంభాషణలకు అడ్డుకూడా," అన్నాను నేను.

"అలాగా ?" అని శంకర్ వెళ్ళిపోయాడు.

నేను శంకర్తో వెళ్ళలేదు. కాని నామనస్సంతా శంకరూ నీరూదేవీ ఏమి మాట్లాడుకుంటారో వినాలని ఉంది. అంచేత శంకర్ తిరిగి వచ్చేటప్పుడు పట్టుకోవాలని నేను వరండాలోనే కాచుకు కూచున్నాను. ఒక గంటలో శంకర్ వచ్చాడు. నన్ను పిలిచాడుకూడా. నేను పైకి రమ్మన్నాను. "కాదురా. ఇప్పుడు అవసరంగా ఇంటికి పోవాలి. నిన్ను రేపు వాళ్ళు తప్పకుండా ఒకసారి ఇంటికి రమ్మన్నారు," అని చెప్పి త్వరగా వెళ్ళిపోయాడు.

నన్ను ఎవరు పిలిచారు ? సుకుమారుడా; నీరూదేవా ? శంకర్తో వా ళ్ళేమి మాట్లాడిఉంటారు ? తెలుసుకోవా లని నాకు కుతూహలం కలిగింది. కాని శంకరు డిలా మాట్లాడకుండా త్వరగా వెళ్ళిపోవటానికి కారణ మేమన్నా ఉందా ? ఇవే ఆలోచిస్తూ ఆరాత్రి నిద్రపోయాను.



"నటకేసరిగారు అధ్యక్షుడు వక్తలతోపాటు చప్పట్లు కొట్టడానికి ప్రేక్షకులనుకూడా తెచ్చుకుంటా డని విరోధులు ప్రచారం చేస్తున్నారు. ఇవ్వాళ శ్రీవారి ఉపన్యాసానికి చప్పట్లు కొట్టకుండా విరోధుల ప్రచారం అబద్ధ మని రుజువు చేశారు.''

---

మర్నాడు ఉదయం ఏడుగంటలకు నేను వాళ్ళ ఇంటికి వెళ్ళాను. సుకుమార్ నన్ను నీరూదేవి దగ్గరకు తీసుకపోయాడు. నీరూదేవి వాళ్ళ అమ్మ గదిలో పక్కమీద పడుకునివుంది. నన్ను చూసి లేచికూచుని, గోడ వైపుకు, ముఖం పెట్టి "చూడండి; ఆవాళ సురథబాబుగారు సాయంత్రం వచ్చి రాత్రిదాకా ఉండిపోయారు. వారికి ఏమైనా ఇవ్వవలసిఉంటుంది. ఇచ్చి రండి,'' అంది.

"అలాగే. నేను ముందు వారిని కనుక్కునివచ్చి డబ్బు తీసుకుపోతాను. ఇప్పుడు మీ వొంట్లో ఎలా ఉంది.''

నీరూ దీర్ఘంగా నిట్టూర్చి — "నే నెలా ఉంటాను ? నాకు అనుమాన మున్నట్టుగానే జరిగిపోయింది. అమ్మ ఇంత త్వరలో మమ్మల్ని వదులుతుం దని నే ననుకోలేదు,'' అని నీహారిక ఏడ్చింది.

నేను వోదారుస్తూ అన్నాను: "కేసు ఇంత ప్రమాదిస్తుం దని డాక్టర్లుకూడా అనుకోలేదు. అమ్మకు వృద్ధాప్యం కాబట్టి ఈ షాక్ తట్టుకోలేక పోయింది. ఇంతకూ ఏదీ మనచేతిలోలేదు. అంతా ఈశ్వరేచ్ఛ. మీరు విచారపడి ఆరోగ్యం చెడగొట్టుకోబోకండి.''

నా మాటలకు ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు. నేను లేచాను. నేను బయటికి రాగానే సుకుమారుడు – "కిశోర్ బాబూ, టీ తీసుకున్నారా ? టీ సిద్ధంగా ఉంది" అన్నాడు.

"నేను టీ తీసుకునే వచ్చాను. ఇప్పుడు కాలేజీకి పోవాలి. సురథబాబును కనుక్కొని రేపు వచ్చి డబ్బు తీసుకుపోతాను," అని బయటికి వచ్చేశాను.

ఆ తర్వాత సుకుమారుడు తల్లికి శ్రాద్ధం పెట్టాడు. సుకుమారుని కోరిక ప్రకారం నేను రెండురోజులముందే వాళ్ళింటికి పోయి పనిపాటులకు సహాయ పడ్డాను. శంకర్ కూడా మాకు తోడు వచ్చాడు. నీరూదేవితో మరీ అవసర మైన వ్యవహారవిషయాలు తప్ప మరేమీ మాటలు జరగలేదు. కాని నా విష యమై ఆమె అభిప్రాయ మేమిటో తెలియకపోవడంవల్ల ఎప్పుడూ తెలుసు కోవాలనే ఒక అభిలాష ఉండేది. సాహసించి నే నేమీ అడగలేకపోయాను. అదీకాక తల్లి పోయి దుఃఖంతో బాధపడుతున్నవాళ్ళను ఏమైనా అడగటం అన్యాయంగానూ అమర్యాదకరంగానూ నాకు తోచింది.

## 2

శ్రాద్ధం అయినాక దాదాపు ఇరవై రోజులకు ఒకనాటి సాయంత్రం సుకు మారుడు నా గదికి వచ్చాడు. "ఏం సుకుమార్, పనేమిటి ?" అన్నాను.

"నువ్వు మా యింటికి రావడంలేదు. సంగ తేమిటి?" అని అడిగాడు అతను.

"అవసర మేమీ లేకనే; ఉంటే మీరు పిలిచేవారుగా ?"

సుకుమార్ నవ్వి – "ఓ, ఆ డాక్టరు డబ్బు సంగతా ?....ఇప్పు డలాంటిది కాదు ; చాలా ముఖ్యమైనపని ఉంది. నీరూ ధోరణి చూస్తే ఏమీ బాగుండ లేదు. నిన్న సాయంత్రం వాళ్ళ కాలేజీనించి కొంతమంది పిల్లలు వచ్చారు. వాళ్ళు ఏదో సమితి పెడుతున్నారు – పురుషులను అణచటానికి. 'నారీ అభ్యు దయ సమితి' అనుకుంటాను దాని పేరు. నీరూను దానికి సెక్రటరీగా ఉండ మని కోరారు. ఇక నీరూ సంగతి నాకు తెలుసుగా ! ఇదివరకే చాలా వ్యాసాలు రాసింది...." అన్నాడు.

"దివాకరశర్మమీదా ?" అన్నాను నేను నవ్వుతూ.

"ఆఁ; ఆ పాపాత్ముడైన దుశ్శాసనుడిమీద. ఇప్పుడు దివాకరశర్మ ఊరు కుంటాడా ?....నువ్వు నీరూ ఆ పిచ్చిలో పడకుండాచూడు."

"నే నేమి చేయగలను ? నా మాట వినదుగా ?" [సశేషం]

అప్పు తీసుకొని వెళ్ళడమే కాని తీర్చడం అంటూ ఉండదు.

శాంతమ్మ కాపురానికి వచ్చిన తొలి రోజులలో తనకు అంచనా తెలియక నెల కని తెచ్చిన సామానుని పదిహేను రోజులలో ఖర్చుపెట్టి అప్పు కని బయలుదేరేది. అయితే రానురాను అనుభవం వచ్చిన తరువాత సరిగ్గా నెలకు ఎంత సామాను కావాలో నిర్ణయించుకుని ఆ సామానుకంటె కొంచెం ఎక్కువ (అది చుట్టాలకోసం) తానే స్వయంగా కో ఆపరేటివు స్టోర్సులో తెచ్చుకుంటుంది.

ఒక నిర్ణీత పథకం ప్రకారం జీవితం సాగాలని ఆమె అభిప్రాయం.

శాంతమ్మ భర్త జీతాలు రాగానే జేబుఖర్చుకని ఇరవై రూపాయ లుంచుకుని మిగతా రెండువందల ఎనభై రూపాయలు శాంతమ్మ చేతి కిస్తాడు. ఆమె ఎనభై రూపాయలు సేవింగ్సు బ్యాంకి అక్కౌంటులో ఆంధ్ర బ్యాంకి మహారాణి పేట బ్రాంచిలో కడుతుంది. సేవింగ్సు బ్యాంకి బాలెన్సు ఎంత ఉన్న దనేది అతిరహస్యం.

శాంతమ్మదగ్గర చేబదుళ్ళు తీసుకుంటున్నవాళ్ళే ఆమెను పిసినిగొట్టు అనీ, స్వార్థపరురా లనీ అంటారు. దానికి కారణం వాళ్ళని ఆమె బదులిచ్చిన సామాన్లు మళ్ళీ అడుగుతుంది. అన్నిసార్లు అంతమంది పట్టుకెళితే ఎట్లా జ్ఞాపకం ఉందా అని వాళ్ళ ఆశ్చర్యం దానికి శాంతమ్మ ఒక సులువైన పని చేసింది. ఒక నోటుపుస్తకం కుట్టింది. ఆ పుస్తకంమీద 'జాలి ఖరీదు' అని వ్రాసింది. దానిలో ఒక్కొక్కరికి ఒక్కొక్క పేజీచొప్పున కేటాయించింది. ఆయా పేజీలలో వాళ్ళు బదులుకని ఏ సామానుగాని డబ్బుగాని ఎప్పుడు ఎంత పట్టుకుని వెళ్లారో, తాను ఎన్ని సార్లు లేదని చెప్పివంపిందో అవన్నీ వ్రాసుకుంటుంది.

ఈ పుస్తకం పెట్టకపూర్వం తాను ఎంతమందికి ఇచ్చిందో, తాను నెల కని కొన్న సామాన్లు నెలకు ఎందుకు రావడంలేదో తెలిసేదికాదు. అందు కని ఈ పద్ధతి పెట్టింది.

ఇరుగు పొరుగు వాళ్లకి సహాయం చేయడం ధర్మమే అయినా దానికి కూడా కొన్ని పరిమితు లుంటా యని ఆమె గ్రహించి కొన్ని సూత్రాలను వ్రాసుకుంది.

1. ఎవరు ఏ వస్తువు బదు లడిగినా వీలయినంతవరకు అడిగినంతగాని అందులో కొంతగాని యివ్వవచ్చును.

2. వాళ్లు తిరిగి ఇవ్వడానికి నెల రోజులు వ్యవధి యివ్వవచ్చు.

3. డబ్బు యిస్తే వడ్డీ పుచ్చుకో కూడదు. రెండు నెలల వరకూ అడగ కూడదు.

4. డబ్బుగాని వస్తువులుగాని యిచ్చినది తిరిగి యివ్వాలని జ్ఞాపకం చేయవచ్చును.

5. పదిరోజుల కొక పర్యాయం చొప్పున మూడు పర్యాయములు జ్ఞాపకం చేయాలి. తరువాత జ్ఞాపకం చేసి కూడా ప్రయోజనం లేదు.

6. ఆరు నెలల కయినా బాకీలు తీర్చనివారికి ఇకముందు ఏమీ ఇవ్వ కూడదు. వారి పేజీ మడిచివేయాలి.

7. ఆరవ సూత్రం ప్రకారం మడత పేజీలో ఉన్నవారు ఏ వస్తువైనాగాని డబ్బుగాని అడిగితే అవి "లేవు" అని చెప్పవచ్చును. ఇక్కడ "లేవు" అనే దాని అర్థం "ఇవ్వను" అని కాబట్టి అసత్యం చెప్పిన దోషం అంటదు.

ఈ సూత్రాలను ఏర్పరచుకున్నది. కాని వాటిని ఆచరణలో పెట్టడం ప్రారంభించేసరికి ఆమె పిసినిగొట్టు; డబ్బుకి ముఖం చూసుకునేది; బొత్తిగా మర్యాద తెలియనిది; అనే కీర్తి సంపాదించుకుంది.

ఆనాడు పద్మావతమ్మకి రెండు రూపాయ లిచ్చినసంగతి "జాలిఖరీదు" పుస్తకంలో వ్రాయడానికి తీసింది. పద్మావతమ్మ పేజీ మడచి ఉంది. అంటే ఆమె ఏమి అడిగినా లేదనాలి. తన సూత్రాలకు తానే వ్యతిరేకంగా వెళ్ల వలసి వచ్చినందుకు నవ్వుకుంది.

ఇంకా ఎన్ని మడత పేజీలున్నాయో అని చూసింది. ఇంకా మూడు మడిచిన పేజీలున్నాయి. ఒకటి విశాలాక్షి గారిది. అయిదు రూపాయలూ, మొత్తం రెండు సేర్ల పప్పులూ తీసుకు వెళ్లి మూడుసార్లు అడిగినా ఇవ్వనందు వల్ల ఆరు నెలల తరువాత ఆమె పేజీ మడచవలసి వచ్చింది.

రెండవది కామేశ్వరమ్మగారిది. దఫదఫాలు తీసుకువెళ్లిన కాఫీపొడి ఆరు వందల గ్రాములు, పంచదార పావుకిలో. నగదు అప్పుడప్పుడు పట్టుకొని వెళ్లినది పదిహేను రూపాయలు. మూడుసార్లు అడిగినా ఇవ్వకపోవడం అటుంచి పైపెచ్చు అంత తీసుకోలేదనీ కాఫీపొడి ఒక గరిటుడుమాత్రమేననీ, పంచదార అసలే తీసుకొని వెళ్లలేదనీ, ఎందుచేతనంటే, ఎవరిది వాళ్లకే సరిపోకపోతే యిక బదుళ్లివ్వడాని కెక్కడ ఉంటుందనీ, నగదు యివ్వవలసింది అయిదు రూపాయలుమాత్రమే ననీ శాంతమ్మ వట్టి అబద్ధాలు ఆడుతుందనీ పెద్దగా అరుస్తూ ప్రచారం చేసినందు వల్ల ఆమె పేజీ గట్టిగా మడచవలసి వచ్చింది.

మూడవ మడత పేజీ సుందరమ్మ గారిది. ఆమె చాలా నెమ్మదిగా మాట్లాడుతుంది. డబ్బు అడిగేటప్పుడు చాలా దీనంగా ముఖం పెడుతుంది.



"నాకు మూడు కుర్చీలు కావాలి చూపించండి."
"అలాగే నండి; మోడరన్ కావాలా, కంఫర్ట్‌బుల్‌గా ఉండేవి కావాలా?

సుందరమ్మ ఎప్పుడూ పప్పులుగాని, కాఫీపొడిగాని, పంచదారగాని శాంతమ్మ దగ్గర బదులు తీసుకోలేదు. కాని ఆమె "యువ" పత్రిక తీసుకొని వెళ్ళి దాదాపు పదిహేను రోజులు తనదగ్గిరే అట్టేపెట్టుకుంటుంది. ఇక ఆంధ్ర సచిత్ర వారపత్రికలూ ప్రభలూ అవి ప్రచురించే డేటుకంటె నాలుగైదు రోజులు ముందుగానే విడుదలైనా శాంతమ్మ కొన్న వెంటనే సుందరమ్మగారు పట్టుకొనిపోయి ఒక వారం రోజు లున్న తరువాతనే శాంతమ్మకి పంపిస్తారు (రెండుసార్లు కబురంపిన తరువాత).

క్రిందటి దీపావళీ "యువ" ప్రత్యేక సంచిక శాంతమ్మ కొన్న వెంటనే సుందరమ్మ పట్టుకొని వెళ్ళింది. మరునాడు పంపించాలంటే "మా ఆయన క్యాంపుకి తీసుకువెళ్ళారు శాంతమ్మా. మరేమీ అనుకోకు; ఆయన రాగానే పంపిస్తానూ" అని వాళ్ళ వాటాలోంచి కేక వేసింది సుందరమ్మ.

అయన క్యాంపు నుండి వచ్చిన తరువాత అడిగితే "అయ్యో శాంతమ్మా, 'యువ' దీపావళి సంచిక రైల్లో పోయిందటమ్మా. మరొకటి కొని తెమ్మంటానులే" అన్నదిగాని మళ్ళీ ఆ ఊసెత్తలేదు.

ఇక డబ్బు సంగతి; ఆరు నెలల నుంచి అరవై రూపాయలు బాకీ.

ఒక పర్యాయం, "ఆయన క్యాంపులో ఉన్నారాయె. ఎలక్ట్రిసిటీ బిల్లు కట్టాలమ్మా పదిరూపాయలుంటే యిద్దూ, లేకపోతే కరెంటు ఆపేస్తారూ," అని పుచ్చుకుంది

మరొక పర్యాయం "చుట్టాలొచ్చి ఇంటిమీద పడ్డారు, ఆయనా ఊర్లో లేరు. ఒక ఇరవై ఉంటే సర్దమ్మా. సామాన్లన్నీ నిండుకున్నాయి ఆ దుకాణదారుడు ఇక అరువు ఇవ్వనన్నాడు. ఆయన రాగానే పాత పది రూపాయలూ కలిపి మొత్తం ముప్పయి రూపాయలు ఇచ్చేస్తానులే అని పుచ్చుకుంది

వేరొక పర్యాయం "మా ఆయన జీతం తీసుకుని బజారుకు వెళ్ళి వస్తుండగా దారిలో జనసమ్మర్దంలో ఎవరో ఆయన పర్సు కొట్టేశారట. ఒక ముప్పయి ఇచ్చి రక్షించండమ్మా. మీకు పుణ్యం ఉంటుంది. నెలమధ్యలో టి. ఏ బిల్సు వస్తాయి. అందాకా ఎలాగో ఆ ముప్పయితో గడుపుకుంటాము మీకు పుణ్యం ఉంటుంది ఇదివరకు ఇవ్వవలసిన ముప్పయితో పాటు ఇది అరవై రూపాయలవుతుంది పువ్వులలో పెట్టి మీ డబ్బు మీకు ఇచ్చేస్తాను అంది

సుందరమ్మ చాలా ప్రాధేయపడిన మీదట శాంతమ్మ జాలిపడి డబ్బు ఇచ్చింది. ఇంతవరకూ డబ్బు ఇవ్వలేదు పువ్వులలో పెట్టడంసంగతి అటుంచి, ఆరు నెలలు గడచాయి. పేజీ మడచింది

ఎప్పటికప్పుడే ఆమెతో కఠినంగా ఉండాలనుకుంటుంది శాంతమ్మ కాని శాంతమ్మది జాలిగుండె.

ఇంతలో సుందరమ్మ వచ్చి "శాంతమ్మగారూ, మా అబ్బాయికి నాలుగైదు రోజులనుంచీ విపరీతమైన తలనొప్పి, కడుపుబ్బరం, విరోచనాలు, జ్వరమూను. అయనేమో క్యాంపుకి వెళ్లారు" అన్నది

"అయ్యో పాపం, కే జీ. హాస్పిటల్‌కి తీసుకొని వెళ్ళకపోయా రాని" అన్నది శాంతమ్మ, వట్టి రిక్షాఖర్చు మాత్రమే అవుతుందనీ, అక్కడ జనంతోపాటు ఒకటి రెండు గంటలు శ్రమపడితే ఉచిత వైద్యం పొందవచ్చును కదా అనీ ఆమె అభిప్రాయం

"కే జీ ఆసుపత్రికి వెళ్ళితే జాయను చేయా లంటారు ఆయనేమో ఊళ్లోలేరు నేనొక్కర్తెనూ తిరగలేను కదమ్మా అందు చేత డాక్టరు వీర్రాజుగారిని తీసుకువచ్చి చూపించాను విజిటింగుఫీజు తరువాత ఇచ్చుకుంటా నని చెప్పాను ఆయన పైఫాయిడు అన్నారు ఇదిగో


ఈచీటీ వ్రాసియిచ్చారు
దీనిలో వ్రాసిన మందులు
కొని నాలుగేసి గంటల
కొక కేప్సుల్ చొప్పున
యివ్వాలనీ, టెంపరేచరు
కూడా నోట్ చేయాలనీ
చెప్పారు. అసలు సంగతే
మంటే ఆ మందులు కొన
డానికిపదిహేనురూపాయ
లైనా ఉండాలి మీరే
పుణ్యాం కట్టుకోవాలితల్లీ.

తల్లీ" అని ప్రాధేయపడుతూ అడిగింది సుందరమ్మ.

జ్వరం వస్తుంది, పోతుంది, డాక్టర్లకేం, వాళ్లు ఫీజులు పెడతారు. ఇప్పటికే సుందరమ్మ అరవై రూపాయలు తన కివ్వాలి. తాను కొంచెం బిగువుగా ఉండా లనుకుంది శాంతమ్మ.

"నా దగ్గర ఏమీ డబ్బు లేదమ్మా, ఇప్పటికే మీకు అరవై వరకూ ఇచ్చాను. ఇం కెవరి నైనా అడగకూడదాండీ, సుందరమ్మగారూ" అంది.

"మీకు అరవై రూపాయలు ఇవ్వవలసి ఉన్నమాట నిజమే ననుకోండి. జీతాలు అందగానే పాత బాకీలతో సహా మొత్తం ఇచ్చేస్తాను. ఆయన ఊళ్లో లేరు. ఇం కెవర్నడుగుదామన్నా మీకు తెలియని దేముంది. వాళ్లదగ్గర ఏమీ ఉండదు. పై పెచ్చు ఇవ్వాళ ఇరవై ఆరో తారీఖు. అంతే కాక మీ అయనకుమల్లే వాళ్ల భర్తలు వాళ్ల చేతికి డబ్బివ్వరు. ఒక వేళ ఏవరి దగ్గరనైనా డబ్బు ఉన్నప్పటికీ వాళ్లు నాకు అంటే అసలు ఇవ్వరు. కాబట్టి మీరే ఈ సహాయం చేసి పెట్టాలి. మీ దగ్గర లేకపోయినా ఎవరినైనా అడిగి, మీ వారు రాగానే ఆయనచేత నైన ప్రయత్నం చేయించి ఈ మందులు తెప్పించండి. ఇవి చేతులు కావు, కాళ్లు" అని రెండు చేతులూ పట్టుకుని శాంతమ్మను సుందరమ్మ బ్రతిమాలింది.

శాంతమ్మ మనస్సు కరిగింది. కాని మొట్టమొదట లేదన్నది కదా; అందుచేత, "నేను ప్రయత్నం చేస్తానుగాని నామీదనే ఆధారపడకండి సుందరమ్మగారూ. మీరుకూడా డబ్బు కోసం ప్రయత్నించండి." అన్నది శాంతమ్మ.

"వెళ్లొస్తానమ్మా, అబ్బాయి దగ్గర ఎవరూ లేరు. మందు సంగతి మరచిపోవద్దు శాంతమ్మగారూ" అంటూ సుందరమ్మ వెళ్ళిపోయింది.

శాంతమ్మ టైము చూసింది, రెండు గంటలయింది. మహారాణీపేట ఆంధ్రా బ్యాంకి బ్రాంచి మధ్యాహ్నం రెండు తరువాత తెరిచేఉంటుంది. సేవింగ్సు బ్యాంకి పాసు బుక్కు తీసింది శాంతమ్మ. పాసు బుక్కుతోబాటు మందు చీటీ కూడా చేతిసంచిలో పెట్టింది.

వీధితలుపు తాళం వేయడానికి తాళంచెవుల కోసం బల్లంతా వెతకడంలో "జాలిఖరీదు" నోటు పుస్తకం క్రిందబడింది. తాళంచెవులు బల్లమీదనే ఉన్నాయి.

శాంతమ్మ నవ్వుకుంది.



# నా కోరిక

"ఏం అక్కాయ్?"

ఉలిక్కిపడి చూశాను పత్రిక చదువుకుంటూన్న నేను. నవ్వుతూ కూర్చునివున్నాడు రామచంద్రం తమ్ముడు.

ముప్పాళ రంగనాయకమ్మ

"భలేవాడివే! చడీచప్పుడూ లేకుండా ఎలా వచ్చావ్ ?'

ఇప్పుడే! వీధితలుపులు దగ్గిరిగా వేసి వుంటే పిలవటం దేని కని..." తన చనువు ప్రకటించుకున్నాడు—"నువ్వేదో చదువుకుంటున్నావుగదాని..."

"ఊఁ(" పుస్తకంమూస్తూ అ న్నాను' "వారం దాటిపోలా నువ్వు కన్పించి ..?"

"అయితే నా నవల చదివేశావా ?" ఉత్సాహంగా చూశాడు—" విన్న బావ బజార్లో కన్పిస్తే అడిగాను, నువ్వు చదివిందీ లేందీ తెలీదన్నాడు మళ్ళా నీకు జ్ఞాపకం చెయ్యమని చెప్పాను."

"ఇంటికి చేరేవరకూ నీ మాట జ్ఞాపకం వుండే దెలా? నువ్విచ్చిన మర్నాడే చదివేశాను. నీకు చెప్పమని కూడా చెప్పాను ఒట్టి మతిమరుపు మనిషి." లేచివెళ్ళి డ్రాయర్లోంచి కాయితాల కట్టలు బయటికి తీసుకువచ్చాను.

అసలు సంగతేమిటంటే...ఓ రెండు మూడేళ్ళుగా రామచంద్రం తమ్ముణ్ణి, తనో బ్రహ్మాండమైన రచయితనై పోవాలనే కోరి కొకటి తినేస్తోంది. తెల్లగా సన్నగా చిన్నగా వుండే రామచంద్రం చాలా గడుసువాడే మరి. అయితే మాత్రం...? ఆ ఫలానా కోరికకు లొంగి ఓ పాతిక కథలవరకూ రాశారు. రెండు తక్కువ డజను ఆర్టికల్స్ రాశాడు. అరడజనుకి ఒకటి ఎక్కువే స్కెచ్ రాశాడు. నాలుగైదు...నాలుగేకాబోలు.. నోవెల్స్ రాశాడు. ఓ సెటైర్కూడా రాయా లనుకొంటున్నాడు.

పది పేజీల్లో ముగిసిపోతే అదో స్కెచ్! పాతిక పేజీలైతే షార్ట్ స్టోరీ! మరీ పెద్దదైతే నోవెల్! కాకపోతే నవలిక! కొన్ని కొన్ని...అన్నీ ఎలాగూ రావుగా?...పత్రికల్లోకూడా వచ్చాయి.

కాని...చిత్రమే?—"మీ ఫలానా... చదివాను. చదువుతూ చదువుతూ నన్ను నేను మర్చిపోయాను. మీ రచన నా హృదయాన్ని వూపింది మీకూ...ఎడిటర్కీ..." అంటూ ఒక్క కార్డుముక్క కూడా తన హృదయపూర్వక అభినందనాలు సమర్పించలేదు. ఒక్క పాఠకుడు కూడా "ఓహో! మీరా!" అనేలా రామచంద్రాన్ని గుర్తుపెట్టుకోలేదు "కొత్తగా ఈ పాఠకులు ఎటు గాలి మళ్ళితే అటే పోతుంటా రక్కాయ్" అంటాడు తమ్ముడు చాలాసార్లు.

"అక్షరాలా నిజం," అంటూ ముందే ఒప్పేసుకుంటాను. ఎలాగైనా ఈ పాఠక జనాన్ని మంత్రముగ్ధుల్నిచేసి బంధించి పారెయ్యాలని చాలకాలంగా ఆలోచిస్తూనే వున్నాడు రామచంద్రం – పరవ్యసానమే ఈ మహోజ్వల నవలా సృష్టి!... దుర్మార్గుల తంత్రాలతో...మాంత్రికుల మంత్రాలతో...నాయకీ నాయకుల త్యాగాలతో ... మహోపన్యాసాలతో.. మాటల ఈటెలతో...దుఃఖ సముద్రా



లతో...అక్షరాల అట్టహాసాలతో...వగైరా వగైరా లతో...చివరి కది...?

నేను కాయితాలు తిరగవేస్తోంటే పరీక్ష ఫలితాలు వినబోయే విద్యార్థిలా నా మొహంలోకే చూస్తూ కూర్చున్నాడు తమ్ముడు-అదేమీ కనిపెట్టనట్టు నవ్వుతూ అన్నాను-" నీ నవల చదివాను...ఏం చెప్పమంటావ్ ?" రుమాలుతో నుదురు ఒత్తుకొంటూ ఏదో చెప్పబోయినవాణ్ణి వారిస్తూ నేనే అన్నాను-'నేనేం చెప్పినా కష్టపెట్టుకో ననీ...నిరాశపడి కృంగిపోననీ...చివరికి ఆత్మహత్యకోసం ఆలోచించ ననీ...సరేనా ?" నవ్వేశాను వాతావరణాన్ని సాధ్యమైనంత తేలికచేస్తూ.

"సరే ! సరే ! చెప్పెయ్ అక్కాయ్ ! నీ వుద్దేశ్యాలు ఖచ్చితంగా చెప్పెయ్ ! అయితే నా నవల నచ్చనే లేదుకదూ ?"

"ఎందుకు నచ్చలేదు ? నీ నవల చదువుతోంటే ఎంతత్వరంతట ముందుకు పోతామా అన్నంత ఆతృతా, ఉత్కంఠా కలిగి చచ్చా ననుకో."

తమ్ముడి మొహం కాస్త వన్నె మారింది- "వెటకారం చేస్తున్నావు "

"అదిగో, అదే వద్దన్నాను. నేను చెప్పిం దేమిటి? నీకు అర్థమైం దేమిటి?"

నేను చెప్పిం దేమిటో రామచంద్రానికి అర్థం కాక పోలేదు. ఆలోచించాడు ఓ క్షణం-"బోర్ కొడుతోం దనేగా నీ వుద్దేశ్యం ? అయితే అక్కాయ్ ! ఓ పని

చేస్తాను మొదటివాక్యం వుంచి రెండోది మూడోదీ కొట్టేస్తాను నాలుగో వాక్యం వుంచి ఐదూ...ఆరూ...కొట్టేస్తాను. ఏడు వుంచి..."ఫక్కుమని నవ్వేశాడు-

"అప్పుడు చూడు. ఏం తెంపో! ఎంత సస్పెన్సూ."

"ఊఁ తర్వాత?" అన్నాడు నవ్వ లేక

బాగానేవుంది అనుకున్నాను— ముందు ప్లాట్ విషయానికి వద్దాం తల్లి దండ్రులేని అన్న చెల్లెళ్ళిద్దరూ రెండు లక్షల రూపాయలు బ్యాంకులో వేసుకు న్నారు. అన్నగారు గుమాస్తా వుద్యోగం చేస్తోంటే చెల్లాయి కుంపటిమీ యిమీద వండి పెడుతోంది— ఇద్దరూ ఒకర్ని ఒకరు సహృదయాలతో అపారంగా ప్రేమించుకొంటూ అతి సామాన్యమైన జీవితం గడుపుతున్నారు— దీని కేమైనా అర్థం వుంటుం దంటావా?"

"నువ్విలా అడుగుతా వని నాకు ముందే తెలుసు అయితే పూర్వం రాజ కుమారులు సింహాసనం ఎక్కేముందు దేశాటనం చేస్తూ సామాన్యమైన జీవితం అనుభవిస్తూ కష్టసుఖాలు తెలుసుకునే వారు. దానికి నువ్వేం చెప్తావ్?"

"అందుకని నీ హీరో జీవితాన్ని చవిచూస్తున్నా డన్నమాట"

"అంతేకాదు. 'ఉద్యోగం పురుష లక్షణం', ఎంతడబ్బు వున్నా నా హీరో పురుషుడుగానే బ్రతకాలి"

"గుమాస్తాగిరీ ఏం ఖర్మ? ఏదైనా బిజినెస్..."

"ఎందుకా గోల? నష్టం వస్తే ..? అసలే పసివాడు! అనుభవంలేనివాడు"

"పోనీ ఆఫీసర్గా పనిచేస్తున్నా డని..."

"వద్దు అక్కాయ్. గుమాస్తాగానే వుండనీ! వెరీ ఆనెస్ట్ఫెలో! గబగబా ప్రమోషన్లు ఇప్పించేద్దాం అలా ఆఫీస రైతే క్రెడిట్ కదూ?"

"ఊఁ, బావుంది అయితే వాళ్ళకి రెండులక్షలరూపాయలూ వుండాలని అంటావా? తగ్గిస్తే...?"

"దారుణం! తల్లీ తండ్రీ లేనే లేరు గదా? ఆ మాత్రం బ్యాంకు ఎకౌంట్ లేక పోతే..."

"పసివెధవలకి అంతడబ్బు చూపిస్తే పాడుచేసుకోరూ? ఓ ఏడాది తిరగొచ్చే సరికి..."

ఓ క్షణం ఆలోచించాడు— "గుడ్ ఐడియా! డబ్బంతా ఫిక్సెడ్ డిపాజిట్గా వేసేస్తే. ?"

నాకు ఒళ్ళు మండింది- "ఎవరి పేర్న?"

"అవు ననుకో," నీరసంగా ఒప్పేసు కున్నాడు— "మరి?"

"బాగా పదివేల వరకూ తగ్గించెయ్."

"అన్యాయం! అన్యాయం అక్కాయ్! వాళ్ళ తల్లితండ్రు లిద్దరూ చచ్చిపోతూ అంతడబ్బూ వాళ్ళ కిచ్చారు."

తమ్ముడి గోల విన్పించు కోలేదు నేను–"వాళ్ళ కారుకూడా అమ్మేయ్!"

తృళ్ళిపడ్డాడు – "కారుకూడానా?... ఏం? ఎందుకని? అసలే 'లత' గులాబీ రెక్కలాంటిది మనస్సు బావుండనప్పుడల్లా పైరెలా వెళ్తుంది? అన్నట్టు డ్రైవింగ్ కూడా నేర్చుకుందే!"

మళ్ళా అన్నాను – "వాళ్ళకి మేడ కూడా వద్దు"

అదిరిపడ్డాడు. అయోమయంగా చూశాడు – "తాతలు కట్టిన మేడ వాళ్ళకుంది వద్దంటే ఎలా? వీల్లేదు"

రామచంద్రం ఇబ్బంది నాకు తెలుసు - ఆ మేడగురించి చాలా వర్ణించాడు. మేడనిండా గాజుగిన్నెల సెట్లు వ్రేలాడుతూంటా యని; చాలా విచిత్రాలు రాశాడు– వెనక గదుల్లోకి కొరివి దయ్యాలు వస్తూపోతూ వుంటా యని... ఇంకా ఎన్నని...!

నేను ఖచ్చితంగా అన్నాను– "మీ ఆవిడ కట్నం తెస్తుంది. మేడ కట్టుకుని కారుకూడా కొనుక్కుందువు గాని నీ పరదా లన్నీ వాళ్ళమీద రుద్దకు – ఇక మాట్లాడకు." మళ్ళామాట్లాడే సాహసం లేక వూరుకున్నాడు.

"అయితే నాకు తెలీ కడుగుతానూ! నీ నవల్లో అన్నా చెల్లెలూ – మేనమామా - పెళ్ళికొడుకూ – పోస్టు జవానూ – నౌఖరు వెంకన్నా - అంతా రచయిత లేనా?" అని అడిగాను

"ఛ! వాళ్ళెవరూ కారు;" త నొక్కడే రచయిత నన్నంత ధీమాగా చూశాడు "ఏం? ఇప్పు డేమైంది?"

"మరి వాళ్ళంతా పెద్దపెద్ద మాటలూ ఆవీ వుపయోగించి బారెడేసి వాక్యాలతో కంఠతా పట్టి అప్పజెబుతోన్నట్టు కవిత్వపు ధోరణిలో మాట్లాడుతారేం?"

"అహా!... అదికాదు... వాళ్లు... హీరో..." మాటలకోసం తడుము కొంటూ తికమక పడ్డాడు నేనే అన్నాను "అ మేనమామ ముఖ్యమంత్రిలా ప్రతీ చాప్టర్‌కి అంతేసి వుపన్యాసం ఇస్తాడేం?"

రామచంద్రం మొహంలో కొత్త ఆశ చిగిర్చినట్టు కన్పించింది – అస లా రంగనాథంగారు ముఖ్యమంత్రి కావాల్సినవాడే కదటయ్యా! డబ్బులేక ఎలక్షనులో నిలబడలేదు–నిలబడక ఆయన్ని ఎవరూ గుర్తించలేదని తాలూకాఫీసులో పనిచేసుకుంటున్నాడు అయితే మాత్రం అయనలో దాగివున్న టాలెంట్ ఏమైపోతుంది?"

"అందుకని?" నువ్వు చెప్పేది బాగా లేదన్నట్టు చూశాను– "ఎంత టాలెంట్ వుంటేమాత్రం లెక్చెర్లిచ్చే హోదా ఎన్. జి వో. కెక్కడిదయ్యా? బాగా తగ్గించెయ్ ఏడెనిమిది పంక్తులికి."

నచ్చలేదు రామచంద్రానికి. నాకై నేనే ముందుకు నడిచాను మాటలతో – "నీ

, గ్రహించిన కొన్ని
..వ్తాను. కథా గమనం కోసం
..లాలు (టెన్సెస్) వాడే విషయంలో నువ్వు చాలా నిర్లక్ష్యం చేశావు–ఇక్కడ చదువుతాను విను – "లత మనస్సు చాల సంతోషంగా వుంది. గోపాల్‌ని ఎంత తొందరగా కలుసుకుంటానా అని కలలు కంటుంది. స్వయంగా కార్ డ్రైవ్ చేసుకుంటూ బయల్దేరింది. ఓ ఫ్రెండ్ కనిపిస్తే నున్నటి బుగ్గల మీద సొట్టలుపడేలా నవ్వుతూ విష్ చేస్తోంది. చివరికి థియేటర్ వేపుగా కారుని పరుగెత్తించింది." ఎలా వుందీ పేరా? భూత భవిష్యత్ వర్తమాన కాలాలు మూడూ ఒకే భావాన్ని వ్యక్తం చెయ్యటానికి ఉపయోగించావు ఇక్కడ క్రియలకన్నిటికీ అన్వయం కుదిరిందా?" తననే చెప్పమన్నట్టు చూశాను.

"లేదనుకుంటాను." అనుమానంగా చూశాడు.

"అనుకోవటం ఏమిటి? లోపం ఏమిటో గ్రహించు."

"నీ రచన నడిచిందంతా వుత్తమ పురుషలో. నేనంటూ ఓ పాత్రే బయల్దేరి కథంతా చెప్తోంది – 'ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. మనస్సంతా పరి పరి విధాల పరుగులెడుతోంది. తన కెందుకీ ఆలోచనలు? ఎందు కింత వ్యధ తనకు?' –ఆ వాక్యాలు రెండూ చదివి దీనంగా చూశాను–"తమ్ముడూ!"

"ఏమిటక్కాయ్! నువ్వు మరీను. అందులో ఏం తప్పువుంది?" బిక్క మొహం వేశాడు.

"ఇంత చిన్న విషయం తెలీకుండా నువ్వు రచన కుపక్రమించావంటే నీ సాహసానికి సంతోషించి తర్వాత పాఠకుల దౌర్భాగ్యానికి దీర్ఘంగా నిట్టూరుస్తాను. ఏమంటావ్? ..అదిగో! అలా కోపంగా చూడకు. నేనంటూ మాట్లాడే పాత్రే 'తను' శబ్దం వుపయోగించు కోవటం ఎలా సమంజసమో చెప్పు."

తమ్ముడు చాలపౌరుషంగా అన్నాడు– "ఎంతో పెద్ద పెద్ద వాళ్ళు కూడా ఒక్కచోట ఇలాగే రాశారు. కావాలంటే ఋజూ చేస్తాను. ఏమి టనుకున్నావో!

"శాంతించు. నీకు ఆలోచించటం చేతకానంతకాలం అందరూ గొప్ప వాళ్ళే!– అవకతవకగా పడే అడుగు జాడల్లో బయల్దేరి బోల్తాపడకు – ఇలా విను"– "ఆరాత్రి నాకు నిద్రపట్టలేదు. మనస్సు పరిపరి విధాల పరుగులెడుతోంది. నా కెందుకీ ఆలోచనలు? ఎందు కింత వ్యధ నాకు?" అని సరిదిద్దుకో."

తమ్ముడిమొహం విప్పారింది – "నిజమే అక్కాయ్! ఇప్పుడు బాగా అర్థమైంది." అన్నాడు సంబరంగా.

రామచంద్రాన్ని ఎంతోసేపు సంబర పడనివ్వకుండా ఓ కాయితం చేతి కిస్తూ అన్నాను – "ఈ శ్లోకానికి అర్థ మేమిటో చెప్పు నాకు సంస్కృతం రాదుగా?

శ్లోకం వదిలేసి పైనా కిందా చదివి . వూరుకున్నాను. మ రేం చెయ్యను ?"

"నేను మాత్రం ఏం చెయ్య నక్కాయ్?" నసుగుతోన్నట్టన్నాడు

"ఆదేమిటి ? నిన్ను చదివి చెప్ప మంటోంటే..."

"నాకూ రా దక్కాయ్ !" సిగ్గు సిగ్గుగా చెప్పేశాడు –

"మరి ?"

"దైవభక్తి భావంతో నిండివున్న ఓశ్లోకం కావాలని అడిగితే నాఫ్రెండ్ ఒకడు ఇది ఇచ్చాడు. కోట్ చేసేశాను ఇలాంటివే మరికొన్నికూడా..."

"అఫ్రెండ్‌కి మరోఫ్రెండ్ వున్నా డేమో ?..."

"లేదక్కాయ్ ! వాడు వాళ్ళ మేనత్త దగ్గిర కొంచెం సంస్కృతం నేర్చు కున్నాడు. సందర్భం కుదురుతుందనే చెప్పా డక్కాయ్!" ధీమాగా చూశాడు

"అవును మంచిపని చేశావు ఒట్టిగా శ్లోకా లేవీ లేకుండా నవల రాస్తే వెల్తిగా వుంటుంది. అదీగాక రేపు సేల్సు కూడా బావుంటాయి. ఈ నవల కొంటే వేరే 'గీత' అక్కర్లేదు అన్నట్టు పబ్లిషర్‌కూడా పేజీలు పెరిగినకొద్దీ రాయల్టీ ఎక్కు విస్తాడుకదూ ?"

నామాటలు వింటోంటే రామచంద్రం వదనారవిందం గర్వంతో ఎరుపెక్కి పోయింది "ఎంత తెలివైనపని చేశానో చూశావా ?" అన్నట్టు చూశాడు

"ఎందుకైనా మంచిది. సంస్కృతం తెలిసి ఎడిట రెవరో వాకబుచేసి మరీ పంపించు "

"అదేం?" నుదురు చిట్లించాడు.

"ఎందుకేనా మంచి దన్నానుగా?"

నిజం చెప్తోందా? అన్నట్టు అను మానంగా చూశాడు నాకేసి.

"అయితే తమ్ముడూ! శిరీషకుసుమం ఎక్కడుంది? మీ దొడ్లోనా?" _మరో కొయితం తిరిగేస్తూ అన్నాను.

"అమ్మో! మా దొడ్లోనే... అబ్బే! లేదు "

"మరి? మీ మామయ్యగారి పెర ట్లోనా?"

"ఉహూ! లేదుగా!"

"అసలాపువ్వు ఎలా ఉంటుంది? నే చూ శ్లేమలే "

"నేనూ చూ శ్లే దక్కాయ్! చాలా బావుంటాయట కదూ?"

"లతా గోపాల్ పచ్చికలో కూర్చుని ముచ్చట్లాడుకొంటూంటే చిరుగాలి విసు రుకే శిరీష కుసుమాల పన్నీటిజల్లు పడి..." సమంజసమేనా? అన్నట్టు చూశాను.

"ఆ పువ్వుల తీగలకు పక్కగా పచ్చికలో వాళ్ళిద్దరూ కూర్చునివున్నారని అనుకోకూడదూ?"

"అనుకోవాలి శిరీషపుష్పంకొండంత బావుంటుందని అనుకోవాలి, చిరుగాలి విసురుకే ప్రక్కనున్న ప్రేమికులమీదికి

ఎగిరిపడుతుం దని అనుకోవాలి తీగల నిండా విరగబూసి పరిమళాలతో మత్తెక్కిస్తుం దని అనుకోవాలి. అన్నిటినీ మించి నీ కథానాయిక లత చెంపల్లోని సున్నితత్వంముందు సిగ్గు పడుతుం దనీ అనుకోవాలి. పాఠకుడి మేధకు నువ్వు చాలా విలువ యిచ్చావ్ తమ్ముడూ!"

దారుణమైన మౌనం ఓ క్షణం!

"అదంతా తప్పంటావా అక్కాయ్?"

"అపువ్వవిషయం నాకేమీ తెలీదుగా? తెలీని సంగతి తప్పో ఒప్పో ఎలా చెప్పను?"

"నిజమే అక్కాయ్! పరిచయం లేకుండా అనుభూతి చెందకుండా రాస్తే టెక్నికల్‌గా లోపాలు వుంటాయేమో! అవునుకదూ?"

నవ్వేశాను— "సరే! ఈ ఆఖరి చాప్టర్‌లో సంభాషణలు చూడు." చదవటం ప్రారంభించాను

"మామయ్యా! నన్ను క్షమించు గోపాల్ నా హృదయేశ్వరుడు. అంతే కాదు జీవితేశ్వరుడు కూడా కాగలడు. గోపాల్‌ని నేను ఎన్నటికీ మరువలేను "

"లతా, ఆపు నీ అధిక ప్రసంగం. నన్నే నువ్వు ధిక్కరించగలవా? గోపాల్ గర్భ దరిద్రుడు."

"మామయ్యా! నిన్నేకాదు, భగవంతుని కూడా ఎదిరించ గలను నా గోపాల్ దరిద్రుడే కావచ్చు, ఉత్తముడు! పురుషోత్తముడు. అన్నయ్యా! నా కన్నీరు చూస్తూ నువ్వింత రాయిలా ఎందుకు నిలబడ్డావు? నా గోపాల్‌నుంచి నన్ను వేరు చేస్తావా? పువ్వునుంచి తావి వేరౌతుందా? చంద్రుడినుంచి వెన్నెల వేరౌతుందా? ఆ దురదృష్టపు ఘడియ వస్తే నేను సంతోషంగా మరణిస్తాను.''

"చెల్లీ! అంత మాటనకు."

"అన్నయ్యా!"

"చెల్లీ"—చదవటం ఆపేసి విరగబడి నవ్వాను. "తమ్ముడూ! ఎంత చిత్రంగా వుం దీ సంభాషణ, డ్రామా వెయ్యాలంటే సరిపోతుం దంటావా?"

"చాల్లేదుకదూ?" పొరపాటే అన్నట్టు చూశాడు. ఆశ్చర్యంగా నే నేదో చెప్పబోతే విన్పించుకోకుండా— "అది చాలా భారమైన ఘట్టం! ఇష్టంలేని పెళ్లి కూతురూ – తన స్వార్థంకోసం బలవంతంగా పెళ్ళి నిర్ణయించబోయే మేనమామా—ఎవ్వరికీ చెప్పలేక యిద్దరిమధ్యా నలిగి .నలిగిపోయే అన్నగారూ . వాళ్లు ముగ్గురూ ఆవేశాలతో మాట్లాడుకోవాలంటే అదేం అల్లాటప్పా సీక్వెన్సా?" వీరావేశంతో విటూరుగా కూర్చున్నాడు.

నేను తాపీగా వెనక్కి వాలి బుగ్గన వేలు వేసుకున్నాను – "అయితే ఆ సీక్వెన్స్ సంస్కృతంలో రా య లే క పోయావా ?"

అయోమాయంగా చూశాడు

"అదేమిటి, అలా చూస్తావ్ ? మరీ విపరీతంగా బ్రహ్మాండంగా వుండాల్సిన



ఘట్టాలు సంస్కృతంలోనూ — ఏమంత ఫర్వాలే దనిపించి సర్వసామాన్యంగా వుండే సన్నివేశాలు తెలుగులోనూ — మత్తు మత్తుగా, ప్రేమ ప్రేమగా వుండాల్సినవి హిందిలోనూ రాస్తే...? ఏం? ఎందుకు బావుండదు? కొత్త ప్రయోగం కదూ?"

"పోనీవే అక్కాయ్! నీ కేం నచ్చ లేదని సూటిగా చెప్పరాదూ?" మొహం ముడుచుకున్నాడు.

నవ్వొచ్చింది నాకు — "సరేలే ముందు నా అనుమానా లన్నీ తీర్చుకో నీ! అయితే ఆఖర్న చెల్లెలుచచ్చిపోవటం దేనికి?"

మళ్ళా తమ్ముడి మొహం కలకల్లా డింది — "లత ఎందుకు చచ్చిపోవా లంటావా? చచ్చిపోక యిష్టంలేని పెళ్ళి చేసుకుంటుందా? ప్రియుడికి దూరమై... జీవితం భారమై..."

"సరే! సరే! యిష్టంలేని పెళ్ళి చేసుకోనంటే సరిపోలా?"

"ఏలా అనగలదు ? అన్నా ఎవరు వింటారు ? స్త్రీకి స్వతంత్రం లేదుగా ?"

"ఓహో ! నువ్వు యివ్వవు కాబోలు "

"కాదక్కాయ్ ! స్త్రీ సుఖం కోసం ఎన్ని చట్టాలు పాసౌతోన్నా అవి ఆచరణలో ఎంత మాత్రం నిజం కావటం లేదు. వాళ్ళ మేనమామ..."

"మధ్య వా డెవడయ్యా ? అన్న వున్నాడుగా ?"

"ఉన్నాసరే ! లత చచ్చి పోవాలక్కాయ్ !"

"చెల్లెల్ని అన్నగారు అపారంగా ప్రేమిస్తాడుగా ?"

"ప్రేమించినా సరే. చచ్చి పోవాలక్కాయ్ !"

"తర్వాత దుఃఖభారంతో అన్నకూడా చచ్చిపోతే బావుంటుంది కదూ?" చక్కటి సలహా యిచ్చాను

"అవును బావుంటుంది "

"పశ్చాత్తాపంతో మేనమామా, మనో వేదనతో గోపాల్‌కూడా చచ్చిపోతే .?"

"బ్రహ్మాండంగా వుంటుంది... కాని..."

"ఊఁ ... కానీ ... ?"

"అంత దారుణమైన విషాదాన్ని మన తెలుగు పాఠకులు..."

"భరించలే రంటావా ? లేకపోయినా అలవాటు చేసుకుంటారుగా? మనవాళ్ళ సైకాలజీ అర్థం చేసుకోవూ మరి ?"

"నిజంగా అందర్నీ చంపేద్దా మని నేనూ అనుకున్నాను గానీ..."

"అభ్యంతర మేముంది ? నీ చేతిలో పని నిజం చెప్పు. ట్రాజడీ రైటరైపోవాలని లేదూ నీకు?"

ఆశ వెల్లడించుకోలేని బిడియం, తమ్ముడి మొహం చూస్తుంటే నా కెంతో జాలివేసింది. "ట్రాజడీ కావా లంటే పాత్రల నన్నిటినీ చంప నక్కర్లేదు తమ్ముడూ ?"

"చావకుండా ట్రాజడీ ...?" విస్తుపోయాడు.

"హీరోని హారైజన్‌లోకి పంపించేసి హీరోయిన్‌తో భారంగా నిట్టూర్పించు."

"అంతేనా ?"

"ప్రస్తుతానికి అంతే."

"అలా చేస్తే అర్థం ఏమిటి ?"

"అదేదో పాఠకులు ఆలోచించుకుంటారు లేద్దూ !" తమ్ముడికి నచ్చీ నచ్చ నట్టుగా వున్నా మరేమీ అనలేదు

"ఓ డ్రీమ్ సీక్వెన్స్ కూడా చేరిస్తే రేపు పిక్చరైజేషన్‌కి సావకాశాలు వుండేవి, ఆలోచించావా ?"

"అదేమిటి ? నే నేం పిక్చర్‌కోసం ఈ నవల రాశానా ?" తమ్ముడికి చాలా కోపం వచ్చింది తనని నే నేదో అవమానం చేసినట్టే చూశాడు.

"ఛ! ఎందుకంత కోపం? మనం చేసే పనికోసం ముందు చూపు చూస్తే నష్టం ఏమిటి?"




"పెళ్ళప్పుడు నీకు ముక్కు_తాడు పడిందిరా అంటే నమ్మలే!"

"నీ వుద్దేశ్యం నాకు తెలుసుగానీ— నా నవలకన్నా గొప్పపిక్చ రేం రావటం లేదు అంతవరకూ చెప్పగలను." సవాల్ చెస్తోన్నట్టే అన్నాడు.

"ఈ విషయం మొట్టమొదటే చెప్తే నేను మరో దృష్టితో చదివేదాన్నిగా? ఫర్వాలేదు. పిక్చర్ కావచ్చు." చిత్రంగా మాయమై పోయింది తమ్ముడి కోపం; ముసి ముసిగా నవ్వుతూ కన్పించాడు. గమనించనట్టు వూరుకున్నాను— "ఇలా చూడు! చిన్న సందేహం! కాస్త ఈ వాక్యానికి అర్థం చెబుదూ! — "సృష్టిరహస్యాన్ని భేదించటమే మానవుడి ధ్యేయం!"— దీని అర్థ మేమిటో బొత్తిగా నాకు కొరుకుడు పడటంలేదు. అసలు సృష్టి కో రహస్యం వుందంటావా?"

"భలేదానివే! సృష్టికి రహస్యం లేక పోవటం ఏమిటి? తప్పకుండావుంది."

"ఏమిటో అది?"

"తెలిసిపోతే అది రహస్యం ఎలా అవుతుంది?"

"ఓహ్! అయితే దాన్ని మానవు డెందుకు భేదించాలి?"

"ఎందు కేమిటి? తెలుసుకుందుకు."

"తెలుసుకుని?"

"తెల్సుకుని... తెల్సుకుని... వూరికే తెలుసుకుందుకు"

నాకు కాస్త చిరాకు వేసింది — "సృష్టికో రహస్యం వుందో లేదో తెలీదు. ఉంటే అదేమిటో తెలీదు. దా న్నెందుకు వెదకాలో తెలీదు. ఎందుకు తమ్ముడూ

ఈ యాత నంతా ? నీకే అర్థం గాని పచ్చివేదాంతం రాసి...''

"అయితే సృష్టిలో ఏదో రహస్యం వుందని మహా మహా వాళ్ళు చెప్తోంటే అస లేమీ లేనే లేదంటావా నువ్వు ?" విసురుగా అన్నాడు పందెం కాస్తున్నట్టు.

"సృష్టి కో రహస్య మంటూ వుంటే అది ఎవరికీ తెలియనిది కాదే. సుశీల ఆనంద్ని క్రీ గంట చూసి సిగ్గుపడి పోవటంలో సృష్టి రహస్యం వుంది ఉయ్యాల నుంచి జారిపడ్డ చిట్టితండ్రి గోరెడు దెబ్బ తగలకుండా కేరింతాలు కొట్టటంలో సృష్టి రహస్యం వుంది. శ్మశానంలో ఏర్పడ్డ వైరాగ్యాన్ని మైలస్నానంతోపాటే మర్చిపోవటంలో సృష్టి రహస్యం వుంది. మొన్న ను వ్వెక్కబోయిన బస్సు మిస్సయి తర్వాత జరిగిన యాక్సిడెంట్ కి చిక్కకుండా ఇప్పు డిలా బ్రతికి వుండటంలో సృష్టి రహస్యం వుంది."

"అక్కాయ్!" ఉత్సాహంగా చూశాడు.

"సృష్టి నశించిపోకుండా తగిన రక్షణలతో అభివృద్ధి చెందుతూనే వుంటుంది కదూ ? అదే సృష్టిరహస్యం.''

"అది ఎప్పటి కప్పుడు వెల్లడౌతూనే వుంటుందిగా ? ఇవ్వాళ మానవుడు కొత్తగా బయల్దేరి ఛేదించాల్సింది ఏముంది ?"

"అది కాదక్కాయ్ ! మనం వుత్తమోత్తమమైన మనిషి జన్మ ఎత్తాం కదా ? మనం చెయ్యాల్సిన ఘనకార్యం ఏదైనా వుండద్దూ ?"

''తప్పకుండాను. ప్రతీ మనిషీ ఒక ఘనకార్యం చెయ్యాలన్న ధ్యేయం చాలా గొప్పది – పుట్టినందుకు జీవించాలి జీవించా లంటే తిండి తినాలి. తినా లంటే శ్రమించాలి... శ్రమించా లంటే... ఇలా చెప్పుకుపోతే మనిషికి మనోవికాసం – మానసోల్లాసమ్ ఎంతైనా అవసర మని అర్థమౌతుంది. ఆ రెండు ప్రయోజనాలకోసమే సాహిత్యం అది సృష్టించాలని ఆరాటపడే నువ్వు ధన్యుడివి తమ్ముడూ !"

రామచంద్రం తదేకంగా చూస్తూ కూర్చున్నాడు

తమ్ముడి మొహంలోకి చూస్తూ అన్నాను— "కాని... సాహిత్యాని కో పవిత్రమైన స్థానం, అపారమైన విలువా వున్నాయన్న సంగతిమాత్రం మర్చిపోకు అది గుర్తువున్నంతకాలం నీ కలం సజీవమైన సాహిత్యాన్నే సృష్టిస్తుంది. చౌకబారు రాతలు రాయనే రాయదు ''

రెండు నిముషాల మౌనం! రామచంద్రం దిగులుగా అన్నాడు... "నేను చక్కటి కథలు రాయా లని ఎంత ఆశ పడుతున్నానో నీకు తెలీ దక్కాయ్! ఎంత ప్రయత్నించినా... ఊహు' రాయలేక పోతున్నాను. లాభంలేదు. నా కేమీ



యు ప

రాదు." కోసి వుంచిన తోటకూర కాడలా వాడిపోయాడు.

"ఛః అదే పొరపాటు. నా కేమీ రాదనుకోవటంకన్నా నా కెంతో వచ్చను కోవటంలోనే ప్రయోజనం వుంది - కథలు రాయాలనే నీ కోరిక హర్షించ దగ్గదే కాని కాయితంమీద కలంపెట్టి రాసేదంతా సాహిత్యం అనిపించుకోదు— ఓ వంద సంవత్సరాలు పోయాక మన మంతా చచ్చిపోయాక రానున్న తరాలవాళ్ళు నీ పుస్తకం చదువుతారు నువ్వు రాసిన ఈ పుస్తకమే జరిగిపోయిన చరిత్రను వెల్లడించే సాధన మౌతుంది. ఇప్పటి సంఘనియమాలనీ— ఆచార వ్యవహారాలనీ - మంచి చెడ్డలనీ - మొత్తంగా ఇరవయ్యోశతాబ్దంలో మనిషి బ్రతికిన తీరుతెన్నుల్నీ తెలుసుకోవటానికి ఆధార మౌతుంది. మనం జీవించిన విధానాన్ని గురించి వాళ్ళు నేర్చుకోవలసిం దేమైనా వుంటే నేర్చుకుంటారు విస్మరించవల సినదాన్ని విస్మరిస్తారు—నీ పుస్తకంలో.. నీరాతలలో చరిత్ర దాగివుంటుందంటే... నీ కలాన్ని ఎంత బాధ్యతాయుతంగా నడిపించాలో ఆలోచించావా?" కళ్ళు విశాలం చేసి విస్మయంగా చూశాడు.

"వ్యక్తిగతంగా నీ మీద నా కేమీ కోపం లేదు. కాని...రచయితగా నీ కున్న బాధ్యతను విస్మరించి...రచన కున్న పవిత్రతను కూడా పోగొట్టే విధంగా ఇన్ని అతిశయాలతో...ఇన్ని అసందర్భాలతో...ఇన్ని అసత్యాలతో.. ఇలాంటి పుస్తకాన్ని రాసి ప్రచురించా లని మోజుపడే నీ సాహసాన్ని క్షమించలేను- తాత్కాలికంగా పాఠకుణ్ణి ఆకట్టుకొనేం దుకు వూహాలోకాలలో విహరింపజేసే తమాషాలు సృష్టించి—ఆవేశంలో ముంచెత్తే అశ్లీల సంభాషణలు చిత్రించి— వేడి వేడి పెసరట్లలా పుస్తకాలు అమ్ముకోవా లని ఆశించటం... ఛః ఎంత సంస్కారంలేని పని!" నా వేదనంతా వెల్లడించాను.

"అక్కాయ్! నిజంగా నే నంత దురాశ పడే రాశా ననుకుంటున్నావా?'' దీనంగా అడిగాడు తమ్ముడు

"కాకపోవచ్చు. ఆలా దురాశ పడి రాసినవాళ్ళ రాతల తాలూకు ప్రభావం మాత్రం నీ మీద చాలా వుంది అది నీ ఈ రచనలో ప్రతిబింబించింది కూడాను. నీ సాహిత్యం పది కాలాలపాటు సజీవంగా నిలిచివుండా లన్న ధ్యేయాన్ని ఏర్పర్చుకుంటే నువ్వు ఏ ఇతర ప్రభావానికీ లొంగిపోవు - నీ స్వాతంత్ర్యం నీది. నీ శైలి నీది. నీ ప్రత్యేకత నీది - మొత్తంగా నీ రచనలో 'ఒరిజినాలిటీ' వుండాలి, అవునా?"

"నిజం అక్కాయ్! దాని కోసమే నేను ప్రయత్నిస్తున్నాను." - ఒక్క క్షణం నిశ్శబ్దంగా గడిచింది - రామచంద్రం ఎప్పటిలా నవ్వుతూ అన్నాడు- మొత్తంగా నా నవల ఖూనీ చేశావ్.''

"కాదు తమ్ముడూ! సాన పట్టాను."

"అయితే యిప్పుడు నన్నేం చెయ్య మంటావు "

"చెప్పానుగా? అర్థం కానట్టు మాట్లాడుతావేం?"

"అయితే ఓ డజను మేజర్ ఆపరేషన్లు అరడజను మైనర్ ఆపరేషన్లు. చెయ్యమంటావ్..." ఫక్కు మంటూ నవ్వాడు— "అప్పుడు...?"

నేనూ నవ్వాను ... "వైద్యం చేస్తే జబ్బు నయం కాదూ?" ... కాయితాల కట్టలు అందించాను.

"సరే! నే పోతా సక్కాయ్!" అంటూ లేచాడు

"నే చెప్పిం దేమీ అపార్థం చేసు కోవుగా?" నేనూ లేచి తమ్ముడి వెనక నడుస్తూ అన్నాను.

"భలేదానివే! నే రాసిందంతా నీ చేతుల్లో ఎందుకు పెట్టాను?'' వీధి గుమ్మం దగ్గిర ఆగి వెనక్కి చూస్తూ అన్నాడు ... "బావగాని కిళ్ళీకొట్టుముందు బాతాఖానీ కొడ్తూ కన్పిస్తే తొందరగా రమ్మన్నా నని చెప్పనా?"

"ఏం అక్కర్లేదు నా పత్రి కింకా పూర్తి కాలేదు "

"వెళ్తా నక్కాయ్. గుడ్‌నైట్!"

నవ్వుతూ—సైకి లెక్కి హుషార్‌గా పోతున్న తమ్ముణ్ణి చూస్తూ నిలబడ్డాను.

రామచంద్రం ఓ మంచి రచయిత కావాలి

అదే నా కోరికలలో ఒకటి



# అతడి సాహసం

యం. యస్. మూర్తి

రామకృష్ణ లంచిహోం ప్రొప్రయిటరుకు ఎవడో కుర్రవాడు ఒక కవరు ఉత్తరం తెచ్చియిచ్చాడు. దాన్ని విప్పి ఆయన చదువుకున్నాడు. అందులో యిలా వుంది :—

'ఉభయ కుశలోపరి.

'మహాశయా, మీరు నన్ను ఎరగరు. కాని, నేను రోజూ మీ హోటల్లోనే టిఫిన్ తింటూంటాను. కొన్ని సంవత్సరాలుగా మిమ్మల్ని, మీ హోటల్ని సందర్శించని రోజంటూ లేదు, నా జీవితంలో—

'ఈ ఉత్తరం మీరు చూచుకునే వేళకి సరిగ్గా మీ హోటల్లో ఒక టేబిల్‌కింద ఒక తాటాకుబుట్ట వుంటుంది - అది నేను మీ హోటల్లో బుద్ధిపూర్వకంగా విడిచి వచ్చాను. ఈ ఉత్తరంద్వారా ఆ సమాచారాన్ని మీకు తెలియజేస్తున్నా.

'ఆ తాటాకు బుట్టలో ఏముందో మీరు గ్రహించగలరా ? వొద్దు, మీ తరఫున నేనే గ్రహించి చెబుతా—

'హడిలిపోకండి - అందులో వున్నవి బాంబులుకావు - మూడు బ్రతికి వున్న పిల్లి పిల్లలు—

'ఇంకా మీకు అర్థం కాలేదనుకుంటా - నేనొక సామాన్య గృహస్తును - వృత్తి స్కూలుమేస్టరీ - జీతం యాభై రాళ్ళు - నా ఇంట్లోనే పిల్లల్ని పెట్టింది ఒక పిల్లి. ఇంకెక్కడా చోటు లేనట్టుగా——

'ఆ పిల్లల్ని విడిపించుకునే సామర్థ్యం నాకులేదు - పోషించే సామర్థ్యం అంత కన్నాలేదు. ఈ రేపనింగు రోజుల్లో - వీటిని ఏ వీధిలోనన్నా విడుస్తే, అవి పసికందులు - ఏ కుక్కో వాటిని చంపేస్తుంది - ఆ పాపం నాకు చుట్టుకుంటుంది-

'గట్టిగా ఆలోచించి, వాటిని గాలి తగిలే బుట్టలో పెట్టి, పొద్దున్న టిఫినుకు వచ్చినప్పుడు మీ హోటల్లో వుంచేసి వచ్చాను. మీరు వాటినిమిత్తమై ఏ విధమైన ఖర్చు, శ్రమ పడనక్కర్లేదు. వాటిని మీహోటల్లో వుండనిస్తే, బల్లల కింద దూరి వాటి బ్రతుకుదెరువు అవే చూసుకుంటాయి—

'నేను చేయలేని పాపాన్ని మీరు చేయరనీ, నేను చేయలేని పుణ్యాన్ని మీరు చేస్తారనీ భావిస్తూ శలవు తీసుకుంటాను.'

ఫోన్ మ్రోగింది.

బద్ధకంగా పడుకున్న శ్యామలరావు విసుక్కుంటూ లేచి ఫోన్ ఎత్తాడు.

'ఏమండోయి! ఏం చేస్తున్నారు!' సన్నని మధురస్వరం చెవిలో కితకితలు పెట్టింది.



# దయ్యం దేశాత్ర

పోలుక్యాచి సాంబశివరావు

శ్యామలరావు బద్ధకం మాయమై పోయింది. కళ్ళు పెద్దవి చేసి ఒక చిన్న నవ్వు నవ్వుకున్నాడు.

'ఎన్నాళ్ళకు ?' ఏమిటి విశేషాలు ?

'గుర్తు పట్టారా ?'

'గుర్తు పట్టకేం ? విమల !'

ఫక్కున నవ్వు ... టెలిఫోనులో సముద్ర తరంగాలు తీరాన్ని కొట్టినట్లు ఆమెనవ్వు చెవికి చెప్ప లేనంత తాకిడి – చెవి గింగురుమంది. ఆ నవ్వు జ్ఞప్తికి వచ్చింది. ఆమె మాత్రమే అలా నవ్వ కలదు – ఆమె పేరు–తెల్లకొంగ. మాట సర్దుకున్నాడు శ్యామలరావు.

'మమ్మల్ని మరపింప జేసిన ఆ విమల ఎవరండీ ?'

'ఎవ రేమిటి – ఒక ఆడమనిషి.' నవ్వేశాడు శ్యామలరావు.

'మీ యింటి మీదకు దండయాత్ర చేయ్యా లని వుంది – రావచ్చా ?'

'ఓ తప్పకుండా !'

'సైన్యసమేతంగా వస్తున్నా.'

'ఎవ రా సైన్యం ?'

'వచ్చేక చూసుకోండి! – వస్తున్నా–టా టా!' ఆమె ఫోన్ పెట్టేసింది ... శ్యామలరావు ఒక్క నిమిషం ఆవ లించాడు. పోస్టుమేన్ కిటికీలోంచి వుత్తరాలు లోనికి విసిరేడు. ఒక్కొక్క వుత్తరం చూసుకున్నాడు శ్యామలరావు ... ఒక వుత్తరం చెల్లెలు వద్దనుంచి–ఒంట్లో బాగుండ లేదని, అత్తగారు తనతోనే



వుంటోందని.చాకిరి పెరిగి చిక్కి శల్య మైపోతున్నానని.

'అత్తగారికి దెయ్యాలు. దేవతలు పూనతారుట _ ఎలావుందో పాపం! ముసలావిడ !" అటు పుల్ల యిటు పెట్టకుండా హాయిగా జీవితం గడిపే ఆవిడను స్మరించుకున్నాడు శ్యామలరావు.

కిటికిలోంచి బాణంలా ఒక కాగితం మీద పడింది. ఆ చుట్ట చుట్టిన కాగితం విప్పాడు.

'మీ వైఖరి నాకు నచ్చలేదు-ఎన్నాళ్లు ఇలాగ ?'

ఆ దస్తూరీ ఆతనికి పరిచయమే-ఒక మందస్మితం చేశాడు శ్యామలరావు.

తలుపులు బిగించి, స్నానం చేసి, సిగరెట్టు పీలుస్తూ వార్తాపత్రిక తిరగవేశాడు. నామాలలంక కోనేరుప్రక్కనే ఒక బాలయోగి క్రొత్తగా బయలుదేరాడట- ఒకమ్మాయి ఆత్మహత్య చేసుకుంది_ ఆలమూరులో అమ్మవారి జాతరలో కాలు జారి పదిమంది నాగులు చెరువులో పడి చచ్చిపోయారుట ___

గడియారం చూశాడు శ్యామలరావు_ ఆరు గంటలు-సాయంత్రం కిటికీలోంచి వీథిలోకి చూశాడు. ఆకాశం సంధ్యారాగంలో అందంగా వుంది _ ఒక ప్రక్కనుంచి కారు మేఘాలు పరుగెత్తుకు వస్తున్నాయి. ఆ అందం మింగేయాలని.

చల్లటిగాలి వీస్తోంది.

రేడియో తిప్పాడు శ్యామరావు.

'మేరే దిల్ టూట్ గయా' పాట శ్రావ్యంగా, ధారంగా సాగుతోంది.

తలుపు - ధన్ ధన్ చప్పుడు-

లేచివెళ్ళి తలుపు తీశాడు.

ముగ్గురు ఆడవాళ్ళు ప్రత్యక్షం.

'మీ అమూల్యమైన కాలం మే మేమీ హరించటం లేదుగదా !

'లేదు - ముసిముసినవ్వుతో లోపలికి ఆహ్వానించాడు ఆమెను.

ముగ్గురూ వచ్చి కుర్చీల్లో కూర్చున్నారు.

'జ్ఞాపకం వున్నానా?'

'ఊఁ'

'ఎవరు నేను ?' సూటిగా చూసింది ఆమె-అదో పిచ్చిచూపు.

'అదే-తెల్లకొంగ.'

ఆమె, శ్యామలరావు ఫక్కున నవ్వుకున్నారు. తక్కిన ఆడవాళ్ళిద్దరూ మర్యాదగ నవ్వారు.

"ఈమె మా అక్క, కమల-ఈమె మా పక్కింటి అమ్మాయి, సంజీవి."

ఇద్దరికీ నమస్కారం పెట్టాడు శ్యామలరావు.

శ్యామలరావు ఇంటర్మీడియేట్ చదువుకునే రోజుల్లో ఆదే పరిచయం కలిగింది. తనకంటె ఆమె ఒక క్లాసు జూనియర్. ఎప్పుడూ తెల్లనిచీర, తెల్లని రవిక, తెల్లని మల్లెపూలు పెట్టుకుని ఆరడుగుల పొడుగుతో సన్నగా రివటగా రోజూ కాలేజీలో ఆమె దర్శనమివ్వడం

వల్ల. కొంచెం కుర్రాళ్ళు ఆమెకు 'తెల్ల కొంగ' అని పేరు పెట్టారు. ఎవరైనా ఆమెను అలా పిలిస్తే ఆమెకు ఉడుకు మోత్తనం వచ్చేది. కాని శ్యామలరావంటే ఆమెకు అభిమానం ఏర్పడింది. ప్రిన్సిపాలుగారి అబ్బాయి కావడంవల్ల చనువు పెరిగాక అతను పిలిచినా ఏమనేదికాదు.

ఇద్దరూ పుస్తకాల పురుగు లవడంచే లైబ్రరీలో పెరిగిన వారి చదువు స్నేహంగా మారింది. శ్యామలరావు ఆమెను తల్లికి పరిచయం చేశాడు. అప్పుడప్పుడు వచ్చిపోయేది ఆత నింటి కామె. ఇంటరు పూర్తికాగానే కాశ్మీరులో నున్న అక్కయ్యగారింటికి వెళ్ళి ఆర్నెల్లకు తిరిగివచ్చింది. మరో అర్నెల్లు తమదగ్గర వుంచుకోవా లని అక్కయ్యను వెంటబెట్టుకు వచ్చింది.

'కాశ్మీరులో ఏ సరస్సుల్లో విహరించి వచ్చారు, తెల్లకొంగగారూ ! అన్నాడు శ్యామలరావు.

'ఇదిగో, మావాళ్ళ ముందు నన్నలా పిలవకండి!'

'ఏం?'

'వాళ్ళకు లోకువైపోనూ !'

శ్యామలరావుకు సామభూతి కలిగింది.

'శకుంతలగారూ !' అన్నాడు.

'హమ్మయ్య' నవ్వింది ఆమె.

బయట గాలి విజృంభించింది. దుమ్ము దూమారం రేగింది. పరుగు పందాల్లో మేఘాలు ఆకాశంలో పరుగిడుతున్నాయి.

'రాకరాక మీరు రావడం — గాలి దుమారం రేగడం' అన్నాడు శ్యామలరావు.

'గాలిదుమారంలోనే ఏదైనా అదృష్టం కొట్టుకురావచ్చు' కమల మాట కలిపింది.

'చూద్దాం, ఏ మదృష్ట మొస్తుందో.' శ్యామలరావు పెదిమ విరిచాడు.

'మీ అమ్మా నాన్నా ఎరీ?'

'వూరెళ్ళారు.'

'ఏ వూరు?'

'కాశ్మీరుమాత్రం కాదు.'

శకుంతల నవ్వింది.

'అయితే ఒంటరి భాగోతం అన్న మాట.' శకుంతల వెక్కిరించింది.

'ఎందుకు? మీరున్నారుగా.' ముగ్గురి వైపు చూశాడు శ్యామలరావు.

గాలి పెరిగింది—ద్వారబంధాల తెరలు గాలికి రెపరెప కొట్టుకుంటున్నాయి— టేబులుమీది అద్దం క్రింద పడి ముక్కలయింది — గోడమీది ఫొటోలు ఊగుతున్నాయి.

'ఇంత పెద్ద బంగళాలో — నువ్వొక్కడవు; భయంలేదూ?'

'మొగాడికి భయమేమిటి? ఆడవాళ్ళకు కానీ.'

'కాస్సేపు అడదానిగా మారి కాస్త అతిధిసత్కారం చేయరాదూ !' శకుంతల మాటలకు కొంచెం ఉలిక్కిపడ్డాడు శ్యామలరావు. అరగంటయి వచ్చినా అతిధులకు ఏమీ యివ్వలేదని బాధపడ్డాడు.

'ఉండండి – కాఫీ తెస్తా.'

'మీరే చేస్తారా – ఎవరైనా చేసి వుంచేరా?'

'లేదండి – నేనే చేసితెస్తా కాఫీ!

'ఉండండి – నేనూ వస్తా – సాయం చేస్తా!'

శకుంతల, శ్యామలరావు వంటింట్లోకి వెళ్ళారు.

కమల, సంజీవి కలిసి నవ్వుకున్నారు.

'ఏపిలుపండులా ఎర్రటిముఖం యీ యనది' అంది సంజీవి.

'కోసుకుతింటావా ఏమిటి – ఫలహారంగా?' నవ్వింది కమల.

'అక్కయ్యోయి! నీకు ఆపిలుపండు యిష్టంకదూ?' అంటూ పండు పుచ్చుకుని వచ్చింది వారి గదిలోకి.

శకుంతల చేతిలో ఎర్రటిపండు చూసింది సంజీవి.

'నిజంగా ఆయన ముఖం చేత్తో పట్టుకు వచ్చా వనుకున్నా!'

కమల వెక్కిరించింది.

'ఫో, మీరు మరీనూ!'

ఆపిల్ పండు లాక్కుని కమల కొరికింది.

జార్లవేసిన గదితలుపులు భళ్ళున ఊడి తెరుచుకున్నాయి. పెద్ద గాలి తరంగం యింట్లోకి వచ్చింది. టేబులు మీద వార్తాపత్రికలు గాలిలో ఎగిరి పోయాయి. గదిలో అలంకరణ కున్న పూలవాజులు కిందపడి పగిలిపోయాయి. ముగ్గురమ్మాయిలు తబ్బిబ్బు పడ్డారు, ఆ చప్పుళ్ళు వింటూ. శ్యామలరావు నాల్గు గ్లాసుల కాఫీ లోనికి తెచ్చాడు.

ఈ లోపుగా, సంజీవి, కమలా, గాలి ఎదురుఊపుతో కుస్తీపట్టి, గదితలుపులు బంధించారు.

'శ్రమపడ్డారు: కాఫీ తాగండి.' అందించాడు శ్యామలరావు.

'మీ యింట్లో అన్నీ పగిలిపోయాయండి!'

'రాకరాక మీరు వస్తే.ఏమౌతుంది!' నవ్వేడు శ్యామలరావు.

'నా రంగు కాఫీకాని నాకు నచ్చదండీ' అంది కమల.

ఆమెరంగు చామనచాయ.

'నాకు పంచదార ఎక్కువ కావాలండీ' అంది సంజీవి మధురంగా.

'నాకూ...' అని చప్పరించింది శకుంతల.

'నీకు గ్లాసు అడుగున కాస్త కాఫీ చాలు—ముక్కుతో పీల్చుకోడానికి' కమల హేళనచేసింది చెల్లెలిని.

'చూడండి – మా అక్కమాత్రం తెల్ల కొంగ కాదూ!' అంది శకుంతల మూతి ముడుచుకుని.

'కాదు ఎర్రకొంగ – ఎర్రచీర కట్టు కుందిగా!' సర్దింది సంజీవి.

బయట – ఉరుములు – మెరుపులు.

కుర్చీలో కూర్చుని కాఫీ తాగుతోంది శకుంతల.

టప్పుమని కాఫీకప్పులో ఏదో రాలింది.

ఉలిక్కిపడి నుంచుంది శకుంతల.

కప్పులోపడిన జంతువును చెమ్చాతో ఎత్తింది - బల్లి - కెవ్వున అరిచింది శకుంతల.

'ఆ కాఫీ పారెయ్యవే !' కమల గబుక్కున కప్పు లాగింది. అదిజారింది - క్రిందపడి పగిలింది.

'ఇంట్లో అన్నీ బద్దలుకొడుతున్నారేమిటి ?' సంజీవి కోప్పడింది.

శకుంతల కిచ్చిన కాఫీ చెడినందుకు బాధపడ్డాడు శ్యామలరావు.

శకుంతల ఎలా నిలుచుందో - అలా వుండిపోయింది.

కాస్సేపు - ఆమెకళ్ళు పెద్దవై పరధ్యాన్నంగా గోడమీద ప్రాకింది దృష్టి... ఏదో నీడ కదిలింది, పొడుగ్గా - కమల ఆమె దగ్గరకు వచ్చింది - మరోనీడ కదిలింది ప్రక్కనే.

'ఎవరి వా నీడలు?' శకుంతల బెదిరింది.

'మనవేనే !' అంది కమల బుజం నిమురుతూ.

'అంత పొడుగ్గా.'

'మనం పొడుగ్గా లేం?' ఫక్కున నవ్వింది కమల. సంజీవి శ్రుతికల్పింది. శ్యామలరావు మందస్మితం చేశాడు.

విద్యుద్దీపాలు హఠాత్తుగా ఆరిపోయాయి.




'ఎక్కడవాళ్ళు అక్కడ కూర్చోండి' అన్నాడు శ్యామలరావు.

ఎవరికుర్చీల్లో వాళ్ళు వాలారు. శకుంతల మంచంమీద కొరిగింది.

కాస్సేపు నిశ్శబ్దం -

వీథిలో కుక్కలు మొరుగుతున్నాయి.

బయటి గాలివాన తుపానులా వుంది.

కిటికీతలుపులు టపటప కొట్టుకుంటున్నాయి.

'నాకు భయంగా వుంది అక్కా' అంది శకుంతల.

'ఏడిసేవు - కాస్సేపట్లో లైట్లు వస్తాయిలే! ఊరుకో!'

'ఇటువంటి చీకట్లలో దెయ్యాలు వస్తా యంటారు' అంది సంజీవి.

'బాబోయి, ఆమాట అనకే!' బ్రతిమాలింది శకుంతల.

'దెయ్యమంటే దానికి చాలాభయమే' కమల ఊతపదం.

'దెయ్యాలుగురించి చాలా కథలు తెలుసు నాకు.' శ్యామలరావు యీల వేశాడు.

'ఒకథ చెప్పుదూ.' సంజీవి అడిగింది.

'నేను విననూ - చెప్పొద్దు!' శకుంతల అరిచింది.

'చెప్పండి ఫర్వాలేదు -' కమల మౌనంగా అంగీకారం చెప్పింది.

'మావూళ్ళో గవరయ్యగారు కాలవ వొడ్డున ఓ రోజురాత్రి వెడుతుంటే - ఒక పెళ్ళివారు ఎదురయ్యారు- ఆయన్ని కూడా తమతో రమ్మని ఆతిధ్య మిచ్చారు. సుఖంగా భోజనం చేసి పడుకుని మర్నాడు లేచి చూస్తే - పెళ్ళివారులేరు - బాజాలు లేవు - గోదావరి దుబ్బుగడ్డిలో రాళ్ళమీద పడిఉన్నాడు -'

'బాగుంది - సుమీ!' ఆశ్చర్య పోయారు కమల, సంజీవి. విద్యుద్దీపాలు వెలిగాయి.

'హమ్మయ్య, నాకు కొంచెం భయం తగ్గిందిరా' శకుంతల నిట్టూర్పువిడిచింది.

పైనుంచి 'ధభీ' మని ఒక మొక్కల కుండీ రాలింది. అందరూ ఆశ్చర్య పోయారు.

కమల చోద్యంగా చూసింది - సంజీవి కుండీ దగ్గరకు వెళ్ళి పరిశీలించింది - శకుంతల బిత్తరపోయి చూసింది - ఆ చిన్నకుండి ఎక్కడనుంచి వచ్చి ఎలా రాలినట్లు? అందులో మొక్క గులాబి...ముళ్ళతో...కమల ఆమొక్క తడిమిచూసింది...కరుగ్గా..గుచ్చుకుంది.

'శకుంతలా, ఎలా వచ్చిందే-ఆకుండీ లోపలికి.' శకుంతల తీవ్రంగా అరిచింది.

శ్యామలరావు బిత్తరపోయి చూస్తున్నాడు.

'యిటువంటి గాలిదూమారం - వానల్లో...దెయ్యాలు..వస్తాయంటారా?' సంజీవి అందుకుంది.

'నిజంగా' శకుంతల మంచం మీద కూలింది.

పగిలినకుండీ కమల యింకా పరీక్షిస్తోంది. కుండీ పగలగా మట్టిముద్ద కర్రతో కదిపింది కమల ... అందులోంచి ఏలుగుపాము...సాగింది.

'అమ్మయ్య!' సంజీవి గాభరాపడి దూరంగా పోయింది. శ్యామలరావు ఒక్కమాట మాట్లాడలేదు.

ఆ కుండీ, మొక్క మట్టీ అన్నీ మౌనంగాతీసి- బయటకు విసిరేశాడు.

'ఏం శ్యామలరావుగారూ' యీ కుండీ ఎలా యింట్లో రాలినట్లు?' తను ప్రశ్నించింది

'అదే నాకు అర్థం కావటంలేదు.'

ఒక నిమిషం నిశ్శబ్దం.

బయట ఉరుములు – మెరుపులు

నక్కల కూతలు ..వాన హోరున కురుస్తోంది దీనిలో విద్యుద్దీపాలు ఓసు కులమధ్య తారల్లా మసక మసకగా మెరుస్తున్నాయి

'ఈ వానలో యింటి కేం వెడతారు' భోజనాలు ఏర్పాట్లు యిక్కడే చేసుకుంటే బాగుంటుందేమో ' శ్యామలరావు మాటకు ఊకొట్టింది శకుంతల

'నేను వండిపెట్టనా?' లేచాడు శ్యామలరావు

'బాగుంది, అతిధులచేత వండిస్తారా? ఏం మర్యాద?' పకపక నవ్వింది

'ఏం, ఛయం పోయిందా?' సంజీవి నవ్వింది.

'ఊ, అస్తమానూ వాటి గొడవేనా? కేక వేసింది.

శ్యామలరావు వంటింట్లోకి నడిచాడు.

'పాపం, ఆయనకు ఎందుకు శ్రమ... నేను చేస్తాగా వంట.' లేచింది కమల

'నేనూ చేస్తాగా ' కమల వెంబడించింది శకుంతలను

'మీ రిద్దరేనా చే సే ది...నే నేం తక్కువ?' సంజీవి వారితో నడిచింది

నల్గురూ వంటింట్లో పాకశాసన యోధుల్లా నిలబడ్డారు. వంటింట్లోని తూము లోంచి నీళ్ళు పైకి చిమ్ముతున్నాయి. వంటింట్లో చిన్న గొట్టం పొడుగ్గా వుంది...

'ఏం వండుదాం?' ప్రశ్నించింది కమల.

'బుట్టచూడండి–కూర లేమున్నాయో! సంజీవి బుట్ట మేకునుంచి దింపింది.

'ఇందులో దొండకాయలు. బంగాళాదుంపలు ఉన్నాయి...' కమల పరిశీలించింది

'ఇంతే ఈ వానరాత్రి నాకు వంకాయ వేపడం అంటే యిష్టం ' శకుంతల కాళ్ళు ముడుచుకుని పెద్దా పేరక్కలా కూర్చుంది

'అంతేలే...నీకు యిష్టమైన పదార్థాలు యీ అర్ధరాత్రి ఏ దెయ్యమైనా తెచ్చియివ్వాలి.' కమల కసిరింది.

'ఇదుగో ఆమాటే అనొద్దన్నా.' అరిచింది శకుంతల.

శ్యామలరావు యీ సందడిలో మౌనంగా పొయ్యి అంటించేశాడు. చేతులు బొగ్గులమసి పూసుకున్నాయి.

'నీళ్ళు పొయ్యనా?' చెంబుతో శకుంతల శ్యామలరావుదగ్గర చేరింది.

'చెంబు ఎందుకు – బయట చూరునుంచి బ్రహ్మాండమైన వాన కురుస్తోంటే ఆ వానలో చెయ్యి కడుక్కోవాలని

వుంది...' బయటికి పోయాడు శ్యామల రావు.

కమల, సంజీవి అలుగడ్డలు తరిగారు, వేపడానికి. 'రసం' చెయ్యాలని ఏర్పాట్లు చేశారు...

'ఏమర్రా, ఇది సొంతయిల్లు అను కుని, గుల్లచేయకండి!' శకుంతల హెచ్చ రించింది...

'అమ్మాయిగారు యీ యిల్లు అప్పుడే సొంతమైనట్టు అనుకుంటున్నారే...' సంజీవి హేళన చేసింది.

'భర్త లేనప్పుడు ఇంతపెద్ద యింట్లో ఒక్కర్తే వుంటే ఏమన్నా దెయ్యాలు పట్టుకుంటే...' కమల శకుంతల నేడ్పించా లని...

'ఇదిగో కమలా...ఓ దెయ్యంకథ చెప్పవూ?'

'నిజంగా...చెప్పనా?'

'చెప్పు...'

'శకుంతలకు...'

'ఫర్వాలేదు...బయట గదిలో శ్యామలరావుతో కబుర్లు చెప్పుకు కూర్చో మను...మరీ భయమేస్తే కాబోయే ఆర్త త్రాణ పరాయణుగా...అయన్ను... గట్టిగా...కౌగలిం...కుని...'

కమల, సంజీవి నవ్వుకున్నారు.

శకుంతల బయటగదిలోకి పోయింది.

శ్యామలరావు చెయ్యి కడుక్కొని వచ్చాడు.

'ఏమిటి ఏదో కథ చెబుతున్నారు?'

'ఊ'

'చెప్పండి...నేనూ వింటా ...

కమల మొదలెట్టింది...మా నాన్న గారి ఊళ్ళో మా యింటి కెదురుగా ఒక పెద్ద కాంపౌండు యిల్లు. అందులో ఒక మేష్టారు కాపురం వుండేవారుట...వారి పెద్దమ్మాయి వితంతువు జీవితంలో తప్పుచేసి గర్భం తెచ్చుకుని, నల్గురూ అనే మాటలు పడలేక బాధపడి – ఆత్మ హత్య చేసుకుందిట...'

శ్యామలరావు, సంజీవి ఆతృతగా వింటున్నారు.

శకుంతల కోపంగా గడపదగ్గర నిల్చుని వింటోంది

'ఆ అమ్మాయి తర్వాత దెయ్యమై...ఆ యింటి యజమాని కోడలును పట్టుకుని– గర్భంతో వుండగా నల్గురు పిల్లల్ని చంపేసింది... ఓరాత్రి నెలలు నిండాక, వచ్చి పెద్దబరువుగా కోడలుమీద వాల డం – కోడలు కేకలు అరుపులు... ఓ గంట బాధ పడ్డాక... తగ్గడం... తర్వాత ప్రసవంలో చచ్చినపిల్ల పుట్టడం పరిపాటయింది... ఆ దెయ్యాన్ని ఎవరైనా కేక వేస్తే... భీభత్సం... రాళ్ళు రువ్వడం–ఇంట్లో సామాన్లు కది పేయడం... మంచాలు జరగడం... యిదీ వరస. ఓ రోజు భార్యా భర్తా కూర్చుని గదిలో మాట్లాడుకుంటూం డగా... ఓ పెద్ద ఆడదాని కేక 'కెవ్వు మని' బయటనుంచి విన్పించింది.'

'బాబోయ్! నాకు భయంగావుంది... ఆపవే కథ.' శకుంతల బ్రతిమాలింది.

వంటింటి చిమ్నీలోంచి పెద్ద ఆడదాని కెవ్వుకేక వినిపించింది అందరికీ

కమల, సంజీవి ఆశ్చర్యపోయారు.

శకుంతల భయపడిపోయింది.

మరోసారి... పెద్దకేక—స్త్రీకంఠం

కమల, సంజీవి లేచి నిల్చుకున్నారు. ఎక్కడినుంచి ఆ కేక?

కమల శ్యామలరావువైపు చూసింది

శ్యామలరావు వంటింటి తలుపు తీశాడు... బయట... గుబురు చెట్లల్లో వానచినుకుల టపటప శబ్దాలు వినవస్తున్నాయి. ఈదురుగాలి... మళ్ళీ అదే కేక... స్త్రీ కేక...

శకుంతల, కమల, సంజీవి ఒకరి దగ్గరి కొకరు వచ్చి భయంగా కౌగలించుకున్నారు.

'ఎవరూ లేరు బయట' అన్నాడు శ్యామలరావు ముఖం దించుకుని.

వంటింటి చిమ్నీలోంచి దడదడ రాళ్ళు పడి క్రిందకు జారాయి

'ఇది నిజంగా దెయ్యమే!... కమలా!' శకుంతల కమలను గట్టిగా కౌగలించుకుని... కళ్ల మార్చి అదోలా వెర్రిగా చూపు పెట్టింది...

కమలను తీసుకువెళ్ళి మంచంమీద పడుకోబెట్టింది...

అన్నం కుంపటిమీదనుంచి పొంగి పొర్లింది.

ఆలుగడ్డ మాడువాసన ప్రారంభిం చించి...

కంగారుగా సంజీవి వాటిని స చేసింది...

బయట కుంభవృష్టి వాన...

శ్యామలరావు ఆరాళ్లు అన్నీ ఏరాడు

'అవి నిజంగా రాళ్ళేనా?' అడిగింది సంజీవి

'అవును, దెయ్యాలు వేస్తే... అవి రాళ్ళలా కనిపిస్తాయి... అంతే!' కమల పరిశీలించింది వాటిని

శ్యామలరావు దోసిలిలో ఉన్నవి నిజంగా రాళ్ళు... కంకరరాళ్ళు... వానలో తడిసిన రాళ్ళు... శ్యామలరావు బయట కాంపౌండులోకి విసిరేశాడు...

లోపలికి వచ్చి శకుంతల దగ్గర కూర్చున్నాడు

'ఆ స్త్రీ కేక—ఎవరో వీధిలో కావచ్చు' అన్నాడు శ్యామలరావు

'కాదండి... ఆ కేక చెవిలో అరిచినట్టుగా వుందే!' అంది సంజీవి.

'అయినా వీధిలో యీ వానలో ఎవరు తిరుగుతారు? ఏ స్త్రీ అలా కేక పెడుతుంది?' అనుమానంగా కసిరింది కమల.

'అయితే యీ యింట్లో, నిజంగా దెయ్యా లున్నాయా?' సంజీవి బిక్కముఖం పెట్టింది...

'ఉండవచ్చు...' కమల నిర్ధారణ చేసింది.

'లేవండి!... యిన్నాళ్ళూ మేముండ టం లేదూ ?' శ్యామలరావు కొంచెం నమ్రతగా ఉద్ఘాటించాడు

'భయస్థులు వుంటే... వున్న దెయ్యాలు బయటికి వస్తాయి...' కమల మాటకు తాళం వేసింది సంజీవి శకుం తల మంచంమీద — లేచి కూర్చుంది.

'అక్కా '

'ఏమే ?'

'యింటికి పోదామే '

'ఇంట్లోమాత్రం దెయ్యాలు లేవూ . అక్కడకూడా అలా వెర్రిచూపు చూస్తా వుగా ఒక్కొక్కసారి!' కమల కోప్పడింది

'నిజంగా!' అడిగాడు శ్యామలరావు

'అవునండీ, ఒక్కొక్కసారి దాని చూపు చూసి దెయ్యం పట్టిం దని యింట్లో పిల్లలుకూడా భయపడతారు !'

'దానికే దెయ్యాలు కనిపిస్తాయి . మీకు కనిపించవు !'

శ్యామలరావు ఏదో ఆలోచనలో పడ్డాడు.

సంజీవి వంట పూర్తి చేసింది.

కమల టేబుల్సుమీద భోజనసామాగ్రి సర్దింది.

'రా ; శకుంతలా, భోంచేసి యింటికి పోదాం...'

శకుంతల మెల్లిగా అడుగులు వేసు కుంటూ వచ్చింది

కిటికీలోంచి బయటికి చూసింది. యింకా వానహోరు వినిపిస్తూనేవుంది .

శకుంతల భయం తగ్గించుకుంది

అందరూ భోజనాల కూర్చున్నారు

దెయ్యాలసంగతి మరిచి భోజనాలు, రుచులు గురించి చర్చ సాగించారు...

'అబ్బనాకు వంకాయవేపుడు లేదర్రా ఈవేళ' అంది శకుంతల...

'పాపం . ఏం కోరికలే . అటువంటి కోరికలు తీర్చడానికి...ఏదీ...యింకా నీకు సమయంలేదు ' కమల వెటకా రానికి అందరూ గొల్లుమన్నారు ...

శకుంతల, శ్యామలరావును చూసి సిగ్గుపడింది

హఠాత్తుగా పైనుంచి ఒక నీటి వంకాయి శకుంతల శిరం మీదకు వచ్చి రాలింది

శకుంతల త్రుళ్ళింది

'నీటివంకాయి' సంజీవి ఆశ్చర్యంతో చూసింది.

'యీ వంకాయి ఎక్కడిదీ ' కమల దిగ్భ్రాంతి చెందింది...

'దెయ్యం . ' ఏడ్చింది శకుంతల...

'నిజంగా దెయ్యాలున్నాయి ... పోదాం...రావే...' కమల, సంజీవి భోజనం సగంలో లేచిపోయారు... చెయ్యి కడుక్కున్నారు

'ఆగండి...యీ యింట్లో దెయ్యా ల్లేవు...మీరు భయపడుతున్నారు... అంతే,' అన్నాడు శ్యామలరావు అను నయిస్తూ.




"కొంచెం అలాగే ఉండు. వెధవది మూవీ కెమేరాఅన్నా కాదు."

'లేకపోతే...యివేమిటి...కేకలు — రాళ్ళు...కుందేలు వంకాయలు... చిత్రం... పదవే పోదాం...'

'ఈ వానలో ఎక్కడికి వెడతారు... కొంచెం ఆగండి...' శ్యామలరావు కమలను బ్రతిమాలాడు...

శకుంతల స్పృహతప్పి క్రింద వాలి పోయింది.

'అమ్మోయి — అదిగో దెయ్యం...' అరిచింది. ఆమెలో వెర్రిచూపు...

కమల భయపడింది...

ఎట్లాగా యింటికి పోయేది...

గబుక్కున ఒక ఆలోచన...

'ఏమండీ, ఓటాక్సీ పిలిపించరూ...'

కమల మాటకు శ్యామలరావు ఏ మనలేకపోయేడు...

'భోజనాలు పూర్తిచేసి..' అన్నాడు.

'అక్కర్లేదు...' మూతిముడుచుకుంది కమల.

సంజీవి చెదిరిపోయి నిల్చుంది.

శ్యామలరావు ఫోను చేశాడు.

పదినిమిషాల్లో టాక్సీ వచ్చింది.

శకుంతలకు స్పృహలేదు.

ఎత్తి తీసుకువెళ్ళి కారులో కూర్చోపెట్టారామెను. శ్యామలరావు ఆమె యింటిదాకా వెళ్ళి వాళ్ళ ముగ్గురినీ దిగబెట్టి తిరిగివచ్చాడు...వాన వెలిసింది...

వాతావరణం చల్లగా వుంది...

శ్యామలరావు యింటికి రాగానే ముఖం కోపంతో ఉద్రేకమైపోయింది. ఏవో ఆలోచనలతో నిద్రపట్టక రాత్రిగడిపాడు.

తెల్లవారింది...

వీధి వరండాలో నిల్చున్నాడు.

ప్రక్కింటి అమ్మాయి రుస రుసగ తనకేసి చూసి, లోనికి పోయింది.

శ్యామలరావు ఓ నిట్టూర్పు విడిచాడు.

సాయంత్రం శకుంతల యింటికి వెళ్ళాడు.

శకుంతల తేరుకుంది ... ఆతను రాగానే మంచమీదే లేచి కూర్చుంది...

నవ్వింది.

శ్యామలరావు నవ్వాడు.

కమల, సంజీవి పక్కన నుంచున్నారు.

'మీ రా యింట్లో ఎలా వుంటున్నా రండీ!... దెయ్యాలబాధతో...'

'ఏమీలేదు...మీరు భ్రమపడ్డారంతే!'

'మరి అవి అన్నీ ఏమిటి?' కమలకు యింకా అర్థంకాలేదు. శ్యామలరావుకు ఏం చెప్పాలో అర్థంకాలేదు...కాస్సేపు కూర్చుని శ్యామలరావు వెళ్ళిపోయాడు..

రాత్రి తొమ్మిదిన్నరకు యింటి కొచ్చాడు.

ప్రక్కింటి అమ్మాయి వరండాలో నిల్చుంది...

తలవంచుకుని ముందుకు వచ్చేశాడు శ్యామలరావు మాట్లాడకుండా...

కాస్సేపున్నాక ఒకక్షణం ఆగి 'సత్యం' అని మెల్లిగా పిల్చాడు.

'నేను రాను' అని సైగ చేసింది.

పక్కింట్లో అలికిడి లేదు.

'మీవాళ్ళు—'

'సినిమాకు వెళ్ళారు!.

'ఇలా రా.'

'ఎందుకు? ... ఎన్నాళ్ళకు తమరి మధురవాక్కు?'

నవ్వాడు శ్యామలరావు.

'ఆవతలవాళ్ళు ఛస్తున్నా రనిగూడా మీ కక్కరలేదు?'

కసిరింది ప్రక్కింటి అమ్మాయి.

'క్షమించు.' నవ్వాడు శ్యామలరావు.

ఆమె ముఖంలో మార్పు....వదనం వికసించింది...

మరుక్షణంలో యిద్దరూ... ఇంట్లో గదిలో - దగ్గరగా...

'ఏమిటి నిన్నరాత్రి?'

'అవును...రెండు నెలలనుంచీ నాతో మాట్లాడలేదు ... పైగా ... ఎవరెవరో అమ్మాయిలు ... యింట్లో నాకు అసూయకదూ...'

'అందుకని?'...

'ఏం చేయాలో తోచక...మీమాటలన్నీ మేడమీదకు వెంటిలేటరులోంచి వినిపిస్తున్నాయి....ఇంట్లో ముసలమ్మ ఒకర్తె నిద్రపోతోంది....మిమ్మల్ని దడిపించా లని...'

'అంతంత అరుపులా? పాపం ఆ అమ్మాయి నిజంగా మతి చెడగొట్టుకుంది.' శ్యామలరావు ఆమెబుగ్గ నిమిరాడు.




''పనిలోపని ఎందుకైనా మంచిదని నా కన్సల్టెంటునికూడా తీసుకొచ్చా!"

ప్రక్కింటి అమ్మాయి పరవశంతో అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసింది.

ఆ మోటు పల్లెటూరి పిల్ల, కుంటి అమ్మాయి, పెరుగుగడ్డ లాటి ప్రేమ వర్షిస్తుంది. నలుగురిలో, సమయాసమయాలలో, విచక్షణలేక, ఏదో విచిత్రంగా తనముందు ప్రవర్తిస్తుంది. అది సహించ లేదు శ్యామలరావు. ఈరోజు సాయంత్రం తను ఇంటికి రాగానే తలుపుచాటునుండి 'భోంయ్' మంటూ మీద పడింది ఆ దృశ్యం తల్లి గమనించీ గమనించనట్లు ఊరుకుంది...... అప్పటి నుంచీ కోపంతో శ్యామలరావు మాట్లాడలేదు... ఆ విరహం, కోపం, అసూయ ఆమెను ఆరాత్రి అలా తిక్కగా మార్చేయి. అసలే నాగరికత తెలియని విచిత్రమైన తిక్క పిల్ల ... శ్యామలరావుకు ఆమె అంటే ప్రేమకన్న సానుభూతి ఎక్కువ... ఆ అమ్మాయి హఠాత్తుగా 'కెవ్వన' పెద్దకేక పెట్టింది. శ్యామలరావు ఆశ్చర్యపోయాడు.

'ఇలాగే అరిచేకదా నిన్న రాత్రి.' నవ్వింది ఆ పిల్ల.

శ్యామలరావు జాలిగా ఆమె వైపు చూసి నవ్వాడు.

'దడుసుకున్నారా?' పక్కుననవ్వింది ఆమె.

'కొంచెం' అన్నాడు శ్యామలరావు.

'ఆ...అలాగా' అంటూ అమాంతంగా అతన్ని గట్టిగా కావిలించుకుని ఉక్కిరిబిక్కిరి చేసింది...

'ఇంకెప్పుడూ అలా రాత్రి చేసినట్లు చేయకు...తప్పు.'

'మీరు మాటాడుతూ వుండాలి.'

'అలాగే...'

ప్రక్కింటి తలుపు చప్పుడయ్యింది. ఆమె ఒక నిమిషం బిత్తరపోయి ... మెల్లిగా తలుపు తెరిచి అదృశ్యమయ్యింది ... వెడుతూ మళ్ళీ ... ఏదో సంజ్ఞ చేసింది.

'ఉ...' నవ్వాడు శ్యామలరావు.

'పాపం, ఏం అమాయకత!' నిట్టూర్పు విడిచాడు.

నిన్న సాయంత్రం ఇంట్లోకి వస్తూ అంది శకుంతల— 'ఎవరో ఒకావిడ గుమ్మం మెట్లవద్ద నా కేసి భయంకరంగా చూసింది.'

'ఏమీ' అన్నాడు శ్యామలరావు అప్పుడు

ఇంట్లోకి వచ్చి దుస్తులు మార్చుకుని వాలుకుర్చీలో ఒరిగాడు...హోరుమనే వానలో ఆమె మేడమీద తడుస్తూ చేసిన విచిత్ర చేష్టలు...పాపం? ఆమె మనసు!! నిట్టూర్పు విడిచాడు శ్యామలరావు. శకుంతల దృష్టిలో మెదిలింది... ఆమె పిచ్చి చూపు... ఒక్కొక్కసారి తిక్కచూపు. మరోసారి మధుర దృక్కు ... నిజంగా ఆమెకు దెయ్యం పడుతుందా?... శకుంతల ప్రక్కింటి అమ్మాయి — ఒక్కసారి దయ్యంలా... మరోసారి దేవతలా... ఆ విచిత్ర ప్రదర్శనలూ, ఆ అపూర్వ అందాలు—అంతా అదో కలలా...

ద్వారం కర్టెనుమీద తల్లి కుట్టిన తెల్లకొంగ చేపను ముక్కుతో పట్టుకుని ఒంటికాలిమీద నిలబడింది... శ్యామలరావు నవ్వుకున్నాడు.






[ప్రతి ఇంటిముందూ విషవృక్షబీజం నాటి ఉంటుంది. అరిషడ్వర్గంయొక్క ప్రాబల్యమే దానికి దోహదం. రాగద్వేషాలలో చిక్కుకోననివా రెవరూ ఉండరు. చిత్తసంయమనం లేకపోవటం ఈ విషవృక్షానికి బలం చేకూర్చుతుంది. అది బాగా విస్తరించి, దానికాండం బలపడ్డాక దానికి నాశం ఉండదు. దాని కాంతి నేత్రానందకరంగా ఉంటుంది. దాని రంగురంగుల ఆకులూ, పూలూ దూరంనుంచి చూస్తే చాలా ఆకర్షవంతంగా ఉంటాయి. కాని దాని ఫలం తిన్నవారు నాశనమవుతారు. క్షేత్రాన్ని బట్టి విషవృక్షఫలాలలో తేడా లుంటాయి; కొన్ని రోగం కలిగిస్తాయి, మరికొన్ని శోకం కలిగిస్తాయి, ఇంకా కొన్ని ఇతర ఫలితాల నిస్తాయి.]

నగేంద్రనాధదత్తు అనేకమైన తొందరపను లుండి పడవమీద కలకత్తాకు ప్రయాణ మయాడు. జ్యేష్ఠమాసం కావటంచేత గాడ్పు చాలా తీవ్రంగా ఉంది. "జాగ్రత్త, గాలి సాగితే పడవను ఒడ్డున పట్టించి, మీరు దిగెయ్యండి. గంగలో మాత్రం ఉండవద్దు," అని అతని భార్య సూర్యముఖి అతను బయలుదేరేటప్పు డననే అన్నది. నగేన్ సరే నన్నాడు. అనకపోతే ఆమె ప్రయాణం కానివ్వదు.

నగేన్ అమిత ఐశ్వర్య సంపన్నుడైన జమీందారు. నివాసస్థానం గోవిందపురం. అతని వయసు ముప్పయి మించదు. అతను తన సొంత పడవలోనే ప్రయాణం చేస్తున్నాడు.

ప్రయాణం రెండు రోజులపాటు నిర్విఘ్నంగా సాగింది. మూడోనాడు ఆకా శాన మబ్బులు కమ్మాయి. పడవ సరంగు రహమత్ ముల్లా నమాజు చేసు కుంటూండగా నగేన్, "పడవను ఒడ్డుకు పట్టు," అన్నాడు. రహమత్ నమాజు పూర్తి చేసి పడవను ఒడ్డుకు చేర్చాడు.

ప్రచండమైన గాలి సాగింది. గంగ అల్లకల్లోల మయింది. కళాసులు తెరచాప దించి కూర్చున్నారు. సేవకులు ఎక్కడెక్కడి సామాను తీసి దాచారు. నగేన్ పడవ దిగి కిటికీలు మూసేశాడు. సూర్యముఖి మాట ఇచ్చిన ప్రకారం పడవ దిగి పోదామంటే కళాసులు నవ్వుతారేమో నని నగేన్ సంకోచిస్తుండగా, రహమత్ అతనితో, "బాబూ, పడవ దిగెయ్యండి, ఎందుకైనా మంచిది. పగ్గం చాలా పాతది; గాలి బలానికి నిలుస్తుందో, నిలవదో," అన్నాడు.

నగేన్ పడవ దిగి, బురదలో పడి నడువసాగాడు. గంగాతీరాన తల దాచుకునే చోటేమీ లేదు. కొంత దూరాన గ్రామం ఒకటి ఉన్నది. గాలి కొంచెం తగ్గింది గాని ఆకాశాన మబ్బు విడలేదు. మళ్ళీ వాన కురిసే లక్షణా లున్నాయి. చీకటి పడుతున్నది. మెరుపులు మెరుస్తున్నాయి. దారి అంతటా నీరూ, రొచ్చూనూ. చెట్లమీదినుంచి పడే నీటిబొట్లకు తడుస్తూ, జారుడు దారిలో పడుతూ లేస్తూ అతను ఎదురుగా కనిపించే ఇంటికేసి నడిచాడు.

ఆ దొక పాడుబడ్డ ఇల్లు; వాకిలి తెరిచే ఉన్నది. తన నౌకరును వాకిలివద్ద ఉండమని నగేన్ ఇంట్లో ప్రవేశించాడు.

ఆ ఇల్లు ఒకప్పుడు సంపదతో కళకళ లాడినదే, కాని ఇప్పుడు క్షీణదశలో ఉన్నది. ఇల్లంతటా ఎలుకలూ, బల్లులూ, పురుగులూ తిరుగుతున్నాయి. ఎక్కడ

చూసినా బూజు వేళ్లాడుతున్నది; గోడలు ఘుసిపారిఉన్నాయి. ఒక గదిలో మాత్రమే దీపం వెలుగుతున్నది. ఆ గదిలో పొయ్యీ, కొద్ది వంట పాత్రలూ ఉన్నాయి.

ఆ గదిలోనే వృద్ధుడు చావు బ్రతుకుల మధ్య ఉన్నాడు. ఒకపక్కగా ఇటుక రాతి పైన పెట్టిన ప్రమిదలో దీపం వెలుగుతున్నది. వృద్ధుడి ఆయవులాగే ఆ ప్రమిదలోని తైలంకూడా అయిపోయింది.

వృద్ధుడి మంచం పక్కన ఏ దీపంకన్నకూడా వెలిగిపోతూ పదమూడేళ్ళ కుందనందిని కూర్చుని ఉన్నది. నగేన్ ఆ గదిలోకి తొంగిచూడటం ఆ ఇద్దరూ గమనించినట్టు లేదు. అవసానదశలో ఉన్న వృద్ధుడు ఆ పిల్లతో అస్పష్టంగా ఏదో అంటున్నాడు

గొప్పగా బతికిన ఈ సంసారం లక్ష్మీకటాక్షం తొలగగానే, దాస దాసీలను బంధుబలాన్నీ కొల్పోయింది. కుంద తల్లి ముందుగ వెళ్ళిపోయింది. తరవాత ఆమె కొడుకు పోయాడు, ఆ వృద్ధుడూ, ఆ కుమార్తే మిగిలారు. వృద్ధుడు అంధు డయాడు ఆమె లేకుండా ఆయనకు ఒక్క క్షణం జరగదు అందుచేత ఆయన ఆమె పెళ్ళి గురించి ఆలోచించలేదు. ఆయనే ఇప్పుడు కుంద గతి ఏమవుతుందో ఆలోచించకుండా వెళ్ళిపోతున్నాడు.

నగేన్ చూస్తుండగానే వృద్ధుడు ప్రాణాలు వదిలాడు. కుంద తన తండ్రి శవాన్ని తన ఒల్లో పెట్టుకుని కూర్చున్నది, తైలం అయిపోయిన దీపం రెండుమూడుసార్లు భగ్గున వెలిగి ఆరిపోయింది.

నగేన్ చప్పుడు చెయ్యకుండా బయటికి వెళ్లిపోయాడు. బయట వాన కురుస్తున్న చప్పు డవుతున్నది గాలికి ఇంటి కిటికీల రెక్కలు టప టపా కొట్టుకుంటున్నాయి.

తండ్రి చనిపోయా డని కుందకు తెలియదు "నాన్నా" అని పిలిచింది. జవాబు రాకాపోయేసరికి, నిద్ర పోతున్నా డనుకున్నది. ఆమె విసన కర్రతో శవానికి విసురుతూ, రాత్రింబగళ్లు జాగారాలు చేసిఉన్న కారణంచేత, ఆ కటిక నేలపైనే నడుము వాల్చి తలకింద చెయ్యి పెట్టుకుని పడుకుని నిద్రపోయింది. ఆమె కొక కల వచ్చింది–

వెన్నెల దేదీప్యమానంగా ఉన్నదిట. ఆకాశంలో కుందకు కనిపించిన చంద్రుడు ఒక స్త్రీ రూపం ధరించిఉన్నది. ఆ దేవతామూర్తి కిందికి దిగివచ్చే సరికి కుంద తన తల్లిని గుర్తించింది. ఆమె కుందను తన ఒడిలో కూర్చోబెట్టుకుని, "చాలా కాష్టాలు పడ్డావు, తల్లీ; ఇంకా పడతావు. ఈ జీవితం వదిలేసి నా వెంట అక్కడికి రా!" అంటు నక్షత్రాలను చూపిందట. "అంత దూరం నేను రాలేనమ్మా!" అని

కుంద అన్నదిట. తల్లి ఒక నిట్టూర్పు విడిచి, "ఆ కనిపించేవా ళ్లిద్దరినీ చూడు. వారిద్దరూ నీ పాలిటి విషసర్పాలు. వారికి దూరంగా తప్పుకో!" అన్నది ఆమె చూపించినవైపు చూస్తే, దేవతాసమాను డైన ఒక కాంతమూర్తీ, ఒక అందమైన స్త్రీ కనిపించారు. అంతలో కల కరిగిపోయింది.

*　　　*　　　*

నగేంద్రుడు ఆ రాత్రికిరాత్రే గ్రామంలో నలుగురినీ పోగుచేసి, వారికి తాను చూసిన చావుగురించి చెప్పి, కొంత డబ్బిచ్చి, చచ్చిపోయిన వృద్ధుడి దహన సంస్కారాలకు ఏర్పాటు చేశాడు. కుందనందిని వెంట ఉండటానికి పొరుగింటి స్త్రీ ఒకామె వచ్చింది. తీరా తనతండ్రిని దహనానికి తీసుకుపోయిన తరవాత కుందకు తన తండ్రి మరణం అర్థమై పెద్దపెట్టున ఏడవసాగింది

తెల్లవారాక పొరుగింటావిడ ఇంటిపనులు చేసికోవటానికి వెళ్ళిపోయి, తన కుమార్తె చంపకను కుందకు తోడుగా పంపింది. ఆ యిద్దరూ ఒక యీడువాళ్ళు, స్నేహితురాళ్లు. చంపక స్మశాన వైరాగ్యం ఎంత బోధించినా కుందతల కెక్కలేదు ఆమె అంత దుఃఖంలోనూ మధ్య మధ్య ఆకాశంకేసి చూస్తూండటం గమనించి చంపక, "మాటమాటికీ ఆకాశంకేసి చూస్తా వెందుకు?" అని అడిగింది.

"రాత్రి కలలో మా అమ్మ ఆకాశంనుంచి దిగవచ్చి నన్ను తనవెంట రమ్మంచే వెళ్ళానుకాను. పొరపాటు చేశాను. ఆవిడ ఇప్పుడు మళ్ళీ వస్తుందేమో, పోదామని చూస్తున్నాను," అన్నది కుంద.

ఆమె చంపకకు తాను కలలో చూసిన అందమైన స్త్రీ పురుషులను గురించికూడా చెప్పి, ఆ మనుషులను తా నెన్నడూ చూడ లేదనీ, అంత అందమైన మనుషులు తన కెన్నడూ కనిపించలేదనీ అన్నది

ఈలోపల నగేన్ ఊళ్ళోవాళ్ళను పిలిపించి, "చచ్చిపోయిన వృద్ధుడి కూతురు ఏమయేటట్టు? ఆమె ఎవరివద్ద ఉంటుంది? ఆమె కెవరన్నా ఉన్నారా?" అని అడి గాడు. ఆమె కెవరూ లేరని ఊరివా ళ్ళన్నారు.

"మీలో ఎవ రైనా ఆపిల్లను చేరదీసి పెళ్ళి చేస్తారా? ఆమె పోషణకూ, వివాహానికీ అయ్యే ఖర్చు నేను యిచ్చుకుంటాను," అని నగేన్ అన్నాడు.

నగేన్ ఈ మాట అన్నాడే గాని డబ్బు పైకి తీయలేదు. తీసినట్టయితే ఆమెను పోషిస్తా మని ఎవరుపడితే వారు ముందుకు వచ్చి, నగేన్ తన దారిన తాను వెళ్ళి పోగానే కుందను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టేవారు; లేదా ఇంటి నౌకరుగా వాడు



కునేవారు అలా జరుగుతుందనే నగేన్ డబ్బు పైకి తీయలేదు. అందుకే ఎవరూ అతని మాటకు జవాబు చెప్పనూలేదు

ఒక గ్రామస్తుడు మాత్రం, "బాబూ, కలకత్తాలో శ్యాంబజారులో ఈ పిల్ల మేనత్త పెనిమిటి వినోదఘోష్ ఉన్నాడు మిరు కలకత్తా పోతున్నారు గనక,

ఈ పిల్లను మా వెంట తీసుకుపోయి అక్కడ వప్పగించేస్తే మీరే ఆమెను రక్షించినట్టవుతుంది," అన్నాడు.

నగేన్‌కు కూడా ఇలా చెయ్యటమే సర్వోత్తమంగా కనబడింది. అతను కుందను పిలిపించాడు. చంపక ఆమెను వెంటపెట్టుకుని వచ్చింది కుంద నగేన్‌ను అంత దూరాన చూస్తూనే కొయ్యబారిపోయి, కళ్లు పెద్దవి చేసి వెర్రిగా చూస్తూ, చంపకతో, "ఆయనే ! మా అమ్మ రాత్రి కలలో నాకు చూపించినది ఈయన్నే !" అన్నది.

నగేన్ ఆ పిల్లలను సమీపించి కుందతో తాను చెయ్యదలచిన దంతా చెప్పాడు కుంద ఏమీ జవాబు చెప్పక అత్యాశ్చర్యంతో అతని కేసే చూస్తూ ఉండిపోయింది.

నగేన్ ఆమెను తన వెంట కలకత్తాకు తీసుకుపోయి విచారించగా శ్యాంబజారులో వినోదఘోషనేవా డెవడూ లేడు. వినోదదాసనేవా డొక డున్నాడు గాని, అతను తన బంధువు కాడని కుంద అన్నది. కుంద భారం నగేన్‌పైనే ఉండిపోయింది.

నగేన్ చెల్లెలు కమలమణి కలకత్తాలోనే ఉంటున్నది. ఆమె భర్త పేరు శ్రీశ చంద్రమిత్రుడు శ్రీశుడు ప్లండర్ ఫేర్లీ అనే గొప్ప వర్తకసంస్థలో గుమస్తాగా ఉంటున్నాడు, గొప్ప ధనికుడు నగేన్ కుందను కమలమణి ఇంటికి తీసుకుపోయి, ఆమెకు కుందనుగురించి అంతా చెప్పాడు

కమలమణికి పద్దెనిమిదోఏడు. ఆమె నగేన్ పోలికగానే ఉంటుంది ఆమెకు అందానికి తోడు బాగా చదువుకూడా ఉన్నది. కమలమణికీ, సూర్యముఖికీ చదువు చెప్పటాని కని నగేన్‌తండ్రి మిస్‌టెంపిల్ అనే ఐరోపీయ స్త్రీని ఏర్పాటు చేశాడు కమలమణి అత్తవారు స్వగ్రామంలో ఉండేవారు. కలకత్తాలో శ్రీశుడి ఇంటికి కమలమణే యజమానురాలు.

కమలమణి కుందను స్వయంగా స్నానం చేయించి, తల దువ్వి, బట్టలూ, నగలూ కట్టబెట్టింది.

నగేన్ కుందనుగురించి తన భార్య సూర్యముఖికి ఉత్తరం రాశాడు. అతను దూరదేశంలో ఉన్న ఒక మిత్రుడికికూడా ఉత్తరం రాస్తూ కుందనందిని సౌందర్యం తనను బలంగా ఆకర్షించినట్టు వ్యక్తం చేశాడు.

సూర్యమణినుంచి జవాబు వచ్చింది. ఆమె తన భర్తను కలకత్తాలో ఎక్కువ కాలం ఉండవద్దనీ, వచ్చేటప్పుడు కుందనందినిని తీసుకువస్తే తారాచరణుడి కామెను పెళ్లి చేద్దా మనుకుంటున్నా ననీ, కమలమణికికూడా ఉత్తరం రాస్తున్నా ననీ ఉత్తరంలో రాసింది,

సూర్యముఖి పుట్టింటివారిదీ కోన్నగర మనే గ్రామం. ఆమె తండ్రి గొప్పఇంటి వాడు. కలకత్తాలో ఒక గొప్పవర్తకసంఘానికి కోశాధికారిగా కూడా పనిచేశాడు ఆయినకు సూర్యముఖితప్ప వేరుసంతానం లేదు. సూర్యముఖి చిన్నతనంలో శ్రీమతి అనే విధవరాలు ఇంటి పను లన్నీ చేస్తూ, సూర్యముఖికి పెట్టుపోతలు చేసింది. ఆ శ్రీమతి కొడుకే తారాచరణుడు. అతనిదీ సూర్యముఖిదీ ఒకే వయసు. ఇద్దరూ బాల్యస్నేహంవల్ల అన్నా చెల్లెళ్ళలాగా ఉండేవారు.

శ్రీమతి అందకత్తె కావటం ఆమెకు చేటు తెచ్చింది. ఆ గ్రామంలోనే ఉండే అనినీతిపరుడైన ఒక ధనికుడి వెంట ఆమె లేచిపోయింది. ఆమె ఏమైనదీ తెలియరాలేదు. ఆమె విడిచిపెట్టిపోయిన తారాచరణుడు సూర్యముఖి తండ్రిఇంటనే పెరిగాడు. అతన్ని సూర్యముఖి తండ్రి సొంతకొడుకులాగా చూసుకున్నాడు; నీచ మైన పనులు చెప్పేవాడుకాడు

సూర్యముఖి పెళ్లి చేసుకొని కాపరానికి వెళ్లిన కొంతకాలానికి ఆమె తండ్రి మరణించాడు. జీతం లేకుండా మిషనరీ పాఠశాలలో ఇంగ్లీషు చదువుకుంటున్న తారాచరణుడికి ఉద్యోగం చెయ్యటానికి తగినంత ఇంగ్లీషు రాదు అందుచేత అతను సూర్యముఖి వెంట ఆమె అత్తగారింటికి వచ్చేశాడు సూర్యముఖి నగేన్‌తో చెప్పి వాళ్ల గ్రామంలో బడి ఏర్పాటు చేయించి, అందులో తారాచరణుణ్ణి ఉపాధ్యాయుడుగా పెట్టించింది

ఆ రోజుల్లో ఉపాధ్యాయు డంటే అత్యంతగౌరవనీయుడు అందుచేత తారా చరణుణ్ణి అందరూ ఒక చిన్న దేవుడల్లే చూసేవారు దేవీపురం జమిందారైన దేవేంద్రబాబు స్థాపించిన బ్రహ్మసమాజంలో తారాచరణుడుకూడా చేరి, "బాబు" లలో ఒక దయాడు విగ్రహారాధన, బాల్యవివాహాలు, పూర్వాచారాలు మొదలైన వాటిని ఖండిస్తూనూ, స్త్రీ పునర్వివాహాలూ, స్త్రీ విద్యా, స్త్రీ స్వాతంత్ర్యమూ మొద లైనవాటిని బలపరుస్తూనూ పెద్ద పెద్ద ఉపన్యాసాలు వారం వారం చదివేవా డతను అతని ఉపన్యాసాలను వార్తాపత్రికలనుంచి ఎత్తిరాసేవాడు, ఒక్కొక్కప్పుడు పండితులచేత రాయించుకునేవాడు కూడా.

మామూలుగా మాట్లాడేటప్పుడు కూడా అతను స్త్రీల విషయంలో చాలా ఉదారంగా మాట్లాడేవాడు. ఎందుకంటే అతనికి సొంత స్త్రీ లెవరూ లేరు అతనికి పెళ్ళిఅయినా కాలేదు. అతని తల్లి ఎవరితోనో లేచిపోయిం దని తెలిసి ఘరనా కుంటుబాలవా రెవరూ అతనికి పిల్ల నిచ్చారుకారు. పరువు మర్యాదలు అంతగా లేనివా రెవరాన్నా పిల్ల నిస్తామన్నా, అలాటి సంబంధాలను సూర్యముఖి పడగొట్టింది.

ఆ పరిస్థితిలో కుంద చక్కని దని తన భర్త రాసిన మాటలు చదువుకుని సూర్య ముఖి ఆ పిల్లను తారాచరణుడికి చేసుకోవా లని నిశ్చయించుకున్నది.

*          *          *

నగేన్ కుందను గోవిందపురానికి తీసుకువచ్చాడు. అతని ఇంటిని చూసి ఆమె దిగ్భ్రమచెందింది. అది ఒక ఇల్లు కాదు. ముందు మూడు మహాలులూ, వెనక మూడు మహాలులూ ఉన్నాయి. ఒక్కొక్క మహాలూ ఒక్కొక్క గ్రామ మంత ఉన్నది. లోపలికి వెళ్ళటానికి ఎర్రమట్టితో వేసిన రోడ్లున్నాయి, పచ్చిక బయ ళ్లున్నాయి అదొక పెద్ద దివాణం. అందులో కచ్చేరీలూ, పూజామందిరమూ, దేవాలయమూ, అర్చకులఇల్లూ, పాకశాలా, సరస్సూ, ఉద్యానమూ, ఎన్నో ఉన్నాయి. అంతాటా రకరకాల మనుషు లుండి ఏవేవోపనులు చూసుకుంటున్నారు. ఈ దివాణంలోనే నగేన్ కుటుంబం ఉండే గృహం కూడా ఉన్నది.

కుందనందిని పల్లకీలో ఎక్కి తిన్నగా అంతఃపురం చేరుకుని, సూర్యముఖి వద్దకు వెళ్ళి ఆమెకు నామస్కారం చేసింది. ఆమె నగేంద్రుణ్ణి చూసి తాను కలలో చూసిన మనిషే నని పోల్చుకున్నది. అందుచేత మొదట ఆమెకు అతనంటే భయం వేసింది గాని, అతని మంచితనమూ, కరుణ స్వభావమూ. చూసినకొద్దీ ఆమెకు భయం తగ్గింది.

నగేన్ భార్య తాను కలలో చూసిన స్త్రీ అయిఉంటుం దని కుంద ఊహించు కున్నది. కాని ఆ ఊహ నిజం కాలేదు. కలలో కనిపించిన స్త్రీ కన్న కూడా సూర్యముఖి చాలా అందగత్తె. అదీగాక ఈమె శరీర వర్ణం బంగారం లాంటిది; కలలో కనిపించిన స్త్రీ నల్లనిది. ఆ ఇద్దరికీ ఎందులోనూ పోలిక లేదు. కలలో కనిపించిన మనిషి ఇరవై ఏళ్ళది; సూర్యముఖి వయసు ఇరవై ఆరేళ్ళు. కుందకు సగం దిగులు తీరిపోయింది.

సూర్యముఖి కుందతో కాస్సేపు కబుర్లు చెప్పి, తన ముఖ్య పరిచారికను పిలిచి, "ఈమెను తారాచరణుడికి చేసుకోబోతున్నాను. నా కాబోయే ఆడబిడ్డను ఎలా చూడాలో అలా చూడు," అని చెప్పింది.

ఆ పరిచారిక కుందను తన వెంట మరొక ఇంటికి తీసుకుపోసాగింది. ఆ మనిషిని చూడగానే కుందకు గుండె ఆగిపోయిన ట్టయింది

ఆమె కలలో చూసిన స్త్రీ ఈ పరిచారికే!

కుంద భయంతో కొట్టుకుంటూ, "ఎవరు నీవు?" అని అడిగింది.

"నా పేరు హీర," అన్నది పరిచారిక.

*          *          *




తరవాత కొద్దిరోజులకే కుందనందినికీ, తారాచరణుడికీ వివాహం జరిగింది తారాచరణుడు చెప్పుకోదగిన గొప్ప గుణాలు గాని, కనీసం అందచందాలు గాని లేని వాడు భార్య రూపవతి కావటం అతనికి పెద్ద చిక్కయిపోయింది. అతను దేవేంద్రబాబు ఇంట స్త్రీలను ఉద్ధరించటం గురించీ, నలుగురిలోకి తీసుకురావటం గురించీ ఉపన్యాసాలు దంచటమేగాక, సమయం వచ్చినప్పుడు తాను చెప్పే దంతా ఆచరణలో చేసి చూపిస్తాననికూడా అని ఉన్నాడు

ఇప్పు డతనికి పెళ్ళి అయింది అతని భార్య అందగత్తె అని అంతటా పొక్కింది. అందరూ అతన్ని పట్టుకుని, "నీ శపథా లేమయా యని' నీ భార్యను దాచిపెట్టావేం? ఛాందసులతో నువు కూడా చేరిపోయావా?" అని అతన్ని పొడుచుకుతిన్నారు. అతను వారికి తన భార్యను చూపిస్తానని అన్నాడే గాని, సూర్యముఖికి తెలిస్తే ఆమె తిట్టుతుం దని భయపడి ఒక ఏడాది పాటు తాత్సారం చేశాడు. తరవాత ఇంటి మరమ్మతులు ప్రారంభించి కుందను కొంతకాలం నగేంద్రుడి ఇంటికి పంపేశాడు. ఆ మరమ్మతులు పూర్తి కాగానే ఆమె స్వగృహానికి తిరిగి వచ్చింది.

తరవాత దేవేంద్రుడు ఒకనాడు కొంతమంది మిత్రులతో తారాచరణుడి ఇంటికి వచ్చి, "తారాచరణుడు వట్టి కోతలరాయుడు," అని వెటకారం చేశాడు.

తప్పించుకునే దారిలేక తారాచరణుడు అతి కష్టంమీద కుందను ఒప్పించి, మంచి దుస్తులు ధరింపజేసి, దేవేంద్రుడితో మాట్లాడటానికి తీసుకువచ్చాడు.

ఆమె మాట్లాడకపోగా, మేలి ముసుగైనా తీయకుండా క్షణంపాటు నిలబడి, ఏడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది. దేవేంద్రు డామె అందం చూసి ఆశ్చర్యపడ్డాడు. తరవాత కొన్నాళ్ళకు దేవేంద్రుడు తన ఇంటో ఏదో అక్కర జరిగితే, ఒకపిల్లను పంపించి కుందను పసుపుకుంకానికి ఆహ్వానించాడు. కుంద వెళ్ళలేదు.

ఇంకో సందర్భంలో, కుందతో మాట్లాడా లని దేవేంద్రుడు తారాచరణుడి ఇంటికి వెళ్ళాడు. ఈ సంగతి తెలిసి సూర్యముఖి తారాచరణుణ్ణి నానా చివాట్లూ పెట్టింది. ఆ తరవాత దేవేంద్రు డటుకేసి వెళ్ళలేదు.

పెళ్ళి అయిన మూడేళ్ళకు తారాచరణుడు జ్వరం తగిలి చనిపోయాడు. కుంద వితంతువై నగేంద్రుడి ఇంటికి వెళ్ళింది, తారాచరణుడి ఇల్లు అమ్మేసి, ఆ డబ్బుతో సూర్యముఖి కుంద పేర ప్రభుత్వపు బాండ్లు కొన్నది.

*   *   *

కొంతకాలం గడిచింది.

ఒకనాటి మధ్యాన్నంవేళ దివాణానికి చెందిన స్త్రీజన మంతా పాతగృహంలో చేరి, కబుర్లు చెప్పుకోవటమూ, తమ సొంతపనులు చూసుకోవటమూ మొదలైన పనులలో నిమగ్నులై ఉన్నారు. కుందనందినికూడా ఆ సమయంలో అక్కడే ఉండి ఒక పిల్లవాడికి అక్షరాలు నేర్పుతున్నది.

అప్పు డక్కడికి ఒక వైష్ణవి పాడుతూ వచ్చింది. ఆమె ఆడవాళ్ళ కోరికపై ఏవేవో పాటలు పాడింది. కుందకూడా ఏవోపాటలు అడిగి పాడించుకున్నది. చివరకా వైష్ణవి పాడటం ముగించి, కుందను తాగటానికి నీళ్ళు పొయ్యమన్నది. ఆమె దూరంగా వెళ్ళి కుంద తెచ్చిన నీరు దోసిట్లో పోసుకుంటూ కుందతో రహస్యంగా, "మీ అత్తగారు వచ్చి మా ఇంట్లో ఉన్నది. మిమ్మల్ని చూడా లని తహతహ లాడుతున్నది. ఇక్కడికి వచ్చి మీ యజమానురాలి ఎదట పడటానికి మొహం చెల్లటంలేదుట. మీరే వచ్చి ఆమెను చూడగూడదూ?" అన్నది.

కుంద మొదట రానని చెప్పింది? వైష్ణవి మరీమరీ అడిగిన మీదట, తన యజమానురాలికి చెప్పకుండా రా వీలు లేదన్నది.

ఆమ్మో, మీ యజమానురాలికి తెలిస్తే ఆమెను దేశందాటి పంపేస్తుంది! అందు చేత యుక్తిగా చెప్పి ఒప్పించాలి. జాగ్రత్త, నేను మళ్ళీ వచ్చి మిమ్మల్ని తీసుకు పోతాను," అన్నది వైష్ణవి.




అందుకూ కుంద ఒప్పుకోలేదు

వైష్ణవి ముఖమూ, చేతులూ కడుక్కొని మళ్ళీ పాడుతూండగా సూర్యముఖి వచ్చింది. పాట విని ఆనందించి, బహుమాన మిచ్చి వైష్ణవిని పంపేసింది.

అక్కడినుంచి బయలుదేరిన వైష్ణవి తిన్నగా దేవీపురం చేరి అక్కడ ఒక ఏకాంతగృహంలో ప్రవేశించి, కట్టుకున్న బట్టలూ, నెత్తిమీది టోపా, ముఖాన తిలకమూ తీసేసి – దేవేంద్రబాబుగా మారిపోయింది।

దేవేంద్రుడు ఇరవైఅయిదేళ్ళ ప్రాయం గల అందగాడు. అతనూ, నగేంద్రుడూ ఒక కుదుటివాళ్ళే, కాని కొన్ని తరాలుగా రెండిళ్ళవారి మధ్యా కలహం ఉంటూ వస్తున్నది. వారి మధ్య మాటలుకూడా లేవు. ఉభయకుటుంబాల మధ్యా వ్యాజ్యాలు నడిచాయి. ఒక వ్యాజ్యంలో నగేంద్రుడి తాతగారు గెలవగా దేవుంద్రుడి కుటుంబం ఆర్థికంగా పెద్ద దెబ్బతిన్నది.

క్షీణించిపోతున్న ఐశ్వర్యాన్ని కాస్త బలపరచటానికి దేవేంద్రుడితండ్రి తన కొడుక్కు హరిపురం జిల్లాలోని గణేశు డనే జమీందారు ఏకైక సంతానమైన హైమవతిని చేసుకున్నాడు. హైమవతికి ఉండవలసిన లక్షణా లన్నీ ఉన్నాయి – ఆమె కురూపి, వక్రబుద్ధి గలది; ఈర్ష్యాపరురాలు; అహంభావం గలది

హైమవతిని పెళ్లాడేవరకూ దేవేంద్రుడు విప్పులాటివాడు, నియమాలు గలవాడు, విద్యాభిమాని. కాని ఈ పెళ్ళితో అతని సద్గుణా లన్నీ బుగ్గిపా లయాయి. తన భార్య వల్ల ఇంట్లో సుఖమనేది ఉండదని అతనికి తెలిసిపోయింది. కురూపి అయిన హైమవతి అతని సౌందర్యపిపాసను తృప్తిపరచలేకపోగా, అస్తమానమూ అప్రియ ప్రసంగాలు చేస్తూ దాంపత్యప్రసంగంమీద గల కాంక్షనుకూడా విరిచేసింది. ఇంట ఉండి హైమవతి నోట వెలువడే విషజ్వాలలాంటి మాటలను సహించడంకూడా అతనికి అసాధ్య మయింది.

ఒకనా డామె తన భర్తతో నోటికివచ్చినట్టు మాట్లాడేసింది. అంతవరకూ సహనం వహించిన దేవేంద్రు డిక సహించలేక ఆమెను జుట్టు పట్టుకుని ఈడ్చి చావగొట్టాడు. ఆనాడే అతను తాను విడిగా ఉండటానికి ఉద్యానంలో ఒకయిల్లు కట్టమని ఉత్తరు విచ్చి కలకత్తా వెళ్ళిపోయాడు.

అప్పటికే తండ్రి గతించటంచేత అతన్ని అడిగేవా రెవరూ లేరు. కలకత్తాలో అతను తీరని తనకోరిక లన్నీ తీరగలందులకు అడ్డమైన పనులూ చేశాడు. తన అంత రాత్మ పెట్టే ఘోష వినిపించకుండా త్రాగుడు ప్రారంభించాడు. అటుతరవాత అతనికి పాపభీతి అన్నది లేకుండాపోయింది. పైపెచ్చు దుష్కార్యాలు చెయ్యటంలో అతనికి అమితాసక్తి కూడా ఏర్పడింది. ఆతను కలకత్తాలోని పెద్దపెద్దబాబుల స్నేహం మరిగి, వారినుంచి అవలక్షణా లన్నీ నేర్చుకుని, స్వగ్రామానికి తిరిగివచ్చి కొత్తగా కట్టిన తోటఇంట ప్రవేశించి భోగలాలసుడై జీవించసాగాడు.

కలకత్తానుంచి అతను కొత్తగా తెచ్చిన దేమంటే సంఘసంస్కరణ. దేవీపురంలో అతను బ్రహ్మసమాజం స్థాపించాడు. తారాచరణుడిలాటివాళ్ళు చాలా మంది అందులో చేరి, ఉపన్యాసాలు దంచేశారు. దేవేంద్రుడు స్త్రీ పాఠశాలకూడా పెట్టటానికి యత్నించాడు గాని అది కొనసాగలేదు. వితంతువులకు పెళ్ళిళ్ళు చేయించటం, ఆడవాళ్ళను ఘోషాలోనుంచి బయటికి రప్పించటం — వీటికోసం అతను కృషి చేసేవాడు. రెండవకృషి ఫలించటం అతనికీ అక్కరకు వచ్చింది.

దేవేంద్రుడు వైష్ణవివేషం తీసేసి మామూలు దుస్తులు ధరించి ఒకగదిలో కూర్చోగానే నౌక రొకడు హుక్కా తెచ్చి అతనిముందు పెట్టాడు. తరవాత సారా, నంజుళ్ళూ వచ్చాయి. వాద్యగాళ్ళు వచ్చి సితారా, తబలా మొదలైన వాటితో సంగీతం వినిపించారు.

దేవేంద్రుడి పినతండ్రికొడుకు. సురేంద్రుడు వచ్చి అతని పక్కనే కూర్చు న్నాడు. అతనిదీ దేవేంద్రుడి వయస్సే. అతనికి దేవేంద్రు డంటే ఎంతో అభిమానం కూడా. అతను దేవేంద్రుడితో తాగుడు మానమని ఎంతోదూరం చెప్పిచూశాడు.

"నా భార్య చచ్చిం దన్న వార్త వినిగాని తాగుడు మానను." అని జవాబు చెప్పాడు దేవేంద్రుడు.

## అంకురం

సూర్యముఖి తన భర్త అయిన నగేంద్రుడిలో కొన్ని వింతలక్షణాలు గమనిం చింది. ఆ లక్షణాలను బట్టి కుందనందిని అతన్ని బలంగా ఆకర్షిస్తున్నట్టు ఆమె గ్రహించింది. కాని ఆమాట అని అతన్ని నిందించటానికి లేదు. అతను తన ప్రేమను నిగ్రహించుకోవటానికే యత్నిస్తున్నాడు. ఆమె కనిపించినప్పుడు ముఖం పక్కకు తిప్పుకుంటాడు. ఆమెపేరు తన నోటితో అనడు. ఒక్కొక్కప్పుడు అకారణంగా ఆమెను చివాట్లు పెడతాడు... ఆ కోపం కుందపైనకాదు, తనపైననే! ...అతను దేనికోసమో చూస్తున్నట్టూ, ఆలకిస్తున్నట్టూ కనిపిస్తాడు. అది కుంద కోస మని సూర్యముఖి సులువుగానే గ్రహించింది. ఎవరన్నా కుంద అనాథత్వాన్ని గురించీ, వైధవ్యం గురించీ జాలిగా మాట్లాడితే అతని కళ్ళలో నీరు దిగుతుంది.

సూర్యముఖి కొంతకాలంక్రితం కుముద అనే కొత్త దాసిని పెట్టింది. దానిపేరు ఒకప్పుడు సరిగా ఉచ్చరించిన నగేన్ ఇప్పుడు "కుందా" అని, నాలుక కొరుక్కుం టున్నాడు! అతను సూర్యముఖిని ఎప్పటికన్నా హెచ్చు ఆదరంతో చూస్తున్నాడు. కాని అది ప్రేమకాదు. తాను సూర్యముఖికి చేస్తున్న అపరాధానికి పరిహారం! ఈ సంగతికూడా సూర్యముఖి గ్రహించింది. గ్రహించీ, బాధపడి, ఈ విషయా లన్నీ తన ఆడబిడ్డ అయిన కమలమణికి ఉత్తరంలో రాసింది; "కుందను తీసుకు పోతావా? ఆ పిల్ల ఉన్నంతకాలమూ నాకు సుఖంలేదు," అన్నది.

కమలమణి చురుకుగా జవాబు రాసింది :

"నువు పిచ్చిదానివి; లేకపోతే నీ భర్తను శంకించవు. అతన్ని విశ్వసించలేక పోతే ఏ బావిలోనో దూకటం మంచిది."

కమలమణి చెప్పినట్లే చేద్దామనీ, తన భర్త మనసును శంకించరా దనీ, అతని శరీరంలోనే జబ్బుండవచ్చు ననీ అనుకున్నది— కాని పిచ్చిదానిలాగా ఉండకపోవటం ఆమెకు సాధ్యం కాలేదు.

ఆమె దివాణంలో ఉన్న ఔషధశాలనుంచి వైద్యుణ్ణి పిలిపించి, తెరమరుగు నుంచి దాసీదానిచేత తన భర్తకు ఔషధం ఇవ్వటం లేదే మని అడిగింది.

ఆయనకు జబ్బుగా ఉన్నదని విని, ఆశ్చర్యపడి, ఆమాట తనకు తెలియ దనీ, ఏంజబ్బో విచారించి మందిస్తా ననీ వైద్యు డన్నాడు.

యజమాని నడగవద్దనీ, ఏదో ఒక ఔషధ మివ్వమనీ ఆమె అన్నది

"ఇదేం చిక్కుత్సరా, బాబూ?" అనుకుంటూ వైద్యు డేదో మిక్శ్చ రిచ్చాడు. సూర్యముఖి ఆ మందుసీసాను పట్టుకుపోయి నగేన్ కిచ్చింది అతను దాన్ని చూసి, అటుగా పోతున్న పిల్లిమీద గిరాటు వేశాడు పిల్లి పారిపోయింది. సీసా పగిలి పోయింది

"మీరు మందు తీసుకోరు. జ బ్బేమిటో చెప్పరు", అన్న దామె భర్తతో

"నా కేం జబ్బు?" అన్నా డతను.

"మీ శరీరం చూడండి, ఎలా చిక్కిపోయిందో," అంటూ ఆమె అద్దం తెచ్చి అతని కిచ్చింది అత నా అద్దాన్ని ఊడ్చి నేలకేసి కొట్టి ముక్కలు ముక్కలు చేశాడు.

సూర్యముఖి కంట తడి పెట్టుకున్నది. నగేన్ కోపంగా ఆమెకేసి చూసి అవతలి గదిలోకి పోయి అక్కడ ఉన్న నౌకరును అకారణంగా కొట్టాడు.

ఆ దెబ్బ తనకు తగిలినట్టే సూర్యముఖి భావించుకున్నది.

నగేన్‌లో ఇంకా యీర్పులు రాసాగాయి. ఒకరాత్రి అతను భోజనానికి చాలా ఆలస్యంగా వచ్చాడు - తాగి వచ్చాడు. అదివర కతని కీ దుర్వ్యసనం లేదు. అది చూసి సూర్యముఖి ప్రాణం కొట్టుకుపోయింది.

అదిమొదలు అతను రోజూ తాగసాగాడు. ఒకనాడు సూర్యముఖి, తనకోస మైనా తాగుడు మానుకోమని ప్రాధేయపడింది

"తాగితే తప్పేం?" అని అత నడిగాడు

"తప్పు లేదంటే ఇక నే నేమనగలను నాకోసమైనా మానెయ్యండి, మిమ్మల్ని వేడుకుంటున్నాను," అన్నది

"నేను తాగుబోతును! ఇష్టమైతే సహించు, లేకుంటే మానెయ్యి." అన్నా డతను.

"ఆస్థానం పాడవుతున్నది. ఇంకా పాడవుతుంది రాబడి సరిగా ఉండటం లేదు" అని దివాను సూర్యముఖికి కబురుచేశాడు. కారణ మేమంటే, యజమానికి శ్రద్ధ లేదని తెలిసి ఉద్యోగులు దివాను మాట వినకుండా ఎవరి ఇష్టంవచ్చినట్టు వారు ప్రవర్తిస్తున్నా రని జవాబు వచ్చింది.



''ఆస్థానం పోతుందన్న విచారం యజమానికే ఉండాలి గాని, మన మేం చెయ్య గలం?'' అన్నది సూర్యముఖి.

ఒకనాడు అనేక వందలమంది రైతులు వచ్చి, "బాబూ! న్యాయాధికారీ, గుమాస్తా మమ్మల్ని బతకనివ్వటంలేదు మాదగ్గిర ఒక కాసైనా నిల్వనివ్వటంలేదు. తమరే ఇట్లా శిక్షిస్తే మేమెవరికి మొరపెట్టుకునేట్టు?'' అని చెప్పుకున్నారు.

''వీళ్ళందరినీ వెళ్ళగొట్టండి,'' అని నగేన్ ఆజ్ఞాపించాడు

ఇతనే ఒకప్పుడు ఒక గుమాస్తా ఒక రైతును కొట్టి ఒకరూపాయి లంచం పుచ్చుకుంటే, ఆ గుమాస్తా జీతంలోనుంచి పదిరూపాయలు విరగగోసి ఆ రైతు కిప్పించాడు

అతనిలో కలిగిన మార్పు దూరాన ఉన్న మిత్రులకుకూడా తెలియవచ్చింది నీ కేమి టొచ్చిం దని వాళ్ళు రాస్తే—

"నామీద ఆగ్రహించకండి. నే నధఃపాతాళానికి పోతున్నాను." అని అతను జవాబు రాశాడు

''కమలమణీ, ఒక్కసారి రా. నాకు నీవుతప్ప ఇంకెవరూ లేరు. ఎలాగయినా ఒక్కసారి వచ్చివెళ్ళు.'' అని సూర్యముఖి తన ఆడబిడ్డ కొరకు ఆక్రందనలేఖ రాసింది

సూర్యముఖి మనసు పూర్తిగా చెడిపోయిందని గ్రహించి కమలమణి, తన కొడుకు సతీశుడితోసహా కలకత్తానుంచి గోవిందపురంలో తన పుట్టింటికివచ్చేసింది ఆమె తన భర్త అయిన శ్రీశుణ్ణికూడా రమ్మన్నది గాని, పని తొందర ఉండటం చేత అతను రాలేకపోయాడు

కమలమణి రాకతో నగేంద్రుడి ఇంటి కొరకు కొత్త వెలుగు వచ్చినట్టయింది ఆమెను చూడగానే సూర్యముఖి ముఖం అశ్రువులు రాల్చటం మాని వికాసం పొందింది.

నగేంద్రుడి ముఖంమటుకు ఏమంత వికసించలేదు. అతను చెల్లెల్ని చూసి, "ఎప్పుడు రావటం?'' అనిమాత్రం అన్నాడు; తన మేనల్లుడితో కొంతసేపు ఆడుకున్నాడు.

కమలమణి తన వదినెగారి మాసిన తల దువ్వి, పూలు పెట్టి, సరసాలాడింది. కుందను ప్రేమగా పలకరించింది; "ఏమే, కుందీ! నందీ! కులాసాగా ఉన్నావా?'' అన్నది.

''ఉన్నాను" అన్నది కుంద.

"పొడిగా 'ఉన్నాను' అనకపోతే నన్ను 'అక్కా' అని పిలవగూడదూ?" అన్నది కమలమణి

"సరే నక్కా," అన్నది కుంద.

కుంద కలకత్తాలో కమలమణి ఇంట ఉన్నప్పుడామెతో ఎక్కువగా మాట్లాడలేదు, వరసపెట్టి పిలవనూలేదు. కాని ఇద్దరిమధ్యా మంచి అన్యోన్యం ఏర్పడింది. అది మధ్యకాలంలో చెరిగిపోయింది గాని ఇప్పుడు మళ్ళా చిగుర్చింది.

కొన్నిరోజులు గడిచాయి. "ఇంక నేను మా వూరి కెళ్ళిపోవాలి," అన్నది కమలమణి.

సూర్యముఖి, ''అప్పుడే వెళ్ళిపోవట మేమిటి? రెండురోజు లున్నాక పోవచ్చులే " అన్నది

"నీపని పూర్తిచెయ్యకుండా పోనులే," అన్నది కమలమణి.

కమలమణి వెళ్ళిపోతా ననగానే కుంద తన గదిలోకి వెళ్ళి, ఎవరికీ తెలియకుండా కన్నీరు కార్చసాగింది కమలమణి పిల్లిలాగా అక్కడికి వెళ్ళి, కుంద ఏడుస్తుండటం చూసి, ఆమె పక్కన చేరి, "ఎందుకే ఏడుస్తున్నావూ?" అన్నది.

"నువు వెళ్ళిపోతున్నావుగా ?" అన్నది కుంద

"నేను వెళ్ళితే నీ కేడు పెందుకూ ?"

"నీకు నే నంటే ఇష్టంగద !"

"నిన్ను చూస్తే ఇం కెవరికీ ఇష్టంలేదా?... మీ యజమానురాలికి నీమీద ప్రేమ లేదా ?...మా అన్నకు ప్రేమలేదా ?"

ఈ ప్రశ్నలకు కుంద సమాధాన మివ్వలేదు.

"నే నంటే అంత ఇష్టమైతే నాతోబాటు రాగూడదూ ? వస్తావా?" అని కమలమణి అడిగింది.

"రాలేను."

"కుందా. నాతో నిజం చెప్పెయ్యి," అన్నది కమలమణి

"ఏమని ?"

"నే నడిగినది చెప్పు. నేను నీకు అక్కను. నాదగ్గిర దాపరికం వద్దు. నే నెవరికీ చెప్పను," అన్నది కమలమణి.

"ఏమి టది ? అడుగు !" అన్నది కుంద.

"నువు మా అన్నని ప్రేమిస్తున్నావుకదూ ?"

కుంద మాట్లాడలేదు.

కమలమణి కుందను దగ్గిరికి తీసుకుని, "తెలిసింది. నువు లోలోపల చచ్చిపోతు న్నావు చచ్చిపోతే పో, కాని నీమూలాన అనేకమంది చస్తారుగద !" అన్నది

కుంద తలఎత్తి కమలమణికేసి తేరిపార చూసింది

"ఓసి దౌర్భాగ్యురాలా, నువ్వొకతెవే ప్రేమతో చచ్చిపోతున్నా ననుకుంటు న్నావా? మాఅన్న నిన్ను ప్రేమిస్తున్నా దని నువు గ్రహించలేదా?" అని కమలమణి అడిగింది.

కుంద ఆమె వక్షానికి ముఖం చేర్చి మరింతగా ఏడ్చింది.

"కుందా, నాతో బయలుదేరుతావా ?.. లేకపోతే సర్వనాశన మవుతుంది బంగా రంలాంటి సంసారం బద్దలైపోతుంది," అన్నది కమలమణి.

కుంద లేచికూర్చుని, కళ్ళు తుడుచుకుంటూ, "బయలుదేరుతాను," అన్నది.

అదే సమయంలో బయట వైష్ణవి వచ్చి పాడసాగింది ఆ పాటను వింటున్న సూర్యముఖి కమలమణిని కేక పెట్టింది కమలమణి కుందతోసహా బయటికి వచ్చింది.

కాస్సేపు పాట విని కమలమణి, "మీరు కావలిస్తే వినండి," అంటూ లేచి లోపలికి వెళ్ళిపోయింది. తరవాత సూర్యముఖికూడా పాట అంతగా పట్టక లేచి

పోయింది. మిగిలిన స్త్రీలలోకూడా కొందరు వెళ్ళిపోయారు. కుందకు వైష్ణవి పాడే దేమీ అర్థంకాలేదు, కాని ఆమె అక్కడే ఉండిపోయింది.

వైష్ణవి పాట ముగించగానే కుంద తప్ప మిగిలినవా ళ్ళంతా వెళ్ళిపోయారు. వైష్ణవి మాత్రం వెళ్ళిపోక కుందతో ఏదో సంభాషణ పెట్టుకున్నది. కుంద ఆ మాటలను పరధ్యాన్నంగా విన్నది.

వాళ్ళిద్దరూ మాట్లాడుకోవటం దూరంనుంచి సూర్యముఖి గమనించి, కమలమణిని పిలిచి ఆమెక్కూడా చూపించింది.

"మాట్లాడుకుంటే మాట్లాడుకోనీ. వైష్ణవి ఆడదేగదా ?"

"ఆడదో, మగాడో మనం చూశామా ?" అన్నది సూర్యముఖి.

"అలా అంటా వేమిటి ?" అన్నది కమలమణి.

"ఇప్పుడే దీని అంతు తెలుసుకుంటాను కుంద ఎంత చెడ్డది !'' అని సూర్య ముఖి హీరను పిలిచింది హీర వచ్చి ఏమి టని అడిగింది,

"ఆ వైష్ణవిని ఎరుగుదువా ?" అన్నది సూర్యముఖి

"నే నీ ప్రాంతాలు దాటి వెళ్ళినదాన్ని కాను నా కేం తెలుస్తుంది?" అన్నది హీర.

"సరే, అది వైష్ణవి అవునో కాదో, దాని ఇల్లెక్కడో, కుందతో అది చేసే రహస్యాలోచన ఏమిటో అంతా తెలుసుకురా, నీకు కొత్త బనారసుచీరె ఇస్తాను "

హీర సరే నన్నది.

"జాగ్రత్తసుమా. ఈ సంగతి వైష్ణవికిగాని, ఇంకోరికిగాని తెలీగూడదు."

ఇంతలో కమలమణి తిరిగివచ్చి, సూర్యముఖి హీరాతో అన్న విషయం తెలుసుకుని సంతోషించి, "చాతనైతే ముళ్ళకర్రతో ఆ వైష్ణవిని నాలుగు కొట్టి తీసుకురా," అన్నది.

"మీరు ఏం చెయ్యమన్నా చేస్తాను, కాని నాకు బనారసుచీరె చాలదు," అన్నది హీర

"దాని కొక మొగుణ్ణి చూసి పెళ్ళికూడా చెయ్యి," అన్నది కమలమణి పరి హాసంగా

"దాని కేం ? నీ పెళ్ళి కమల చేస్తుందిలే," అన్నది సూర్యముఖి హీరతో.

హీర ఇరవై ఏళ్ళది, అందమైనది. ఈమె బాలవితంతు వని అందరూ అంటారు. కాని ఈమెభర్త ఎవరో ఎవరికీ తెలియదు. ఈమెమాత్రం పుసిస్త్రీలాగే వేషం వేసుకుంటుంది. ఈమె సత్ప్రవర్తనగురించి ఎవరూ అనుమానంగా చెప్పరు, కాని హీర అల్లరిమనిషి. ఒంటరిగా ఉన్నప్పుడు పాడుకుంటూ ఉంటుంది పరిచారకుల మధ్య కీచులాటలు పెడుతుంది. చీకట్లో వంటలవాళ్ళను భయపెడుతుంది. నిద్ర



పొయ్యేవాళ్ళకు సున్నంబొట్లూ, సిరాబొట్లూ పెడుతుంది అత్తరూ, పన్నీరూ మొదలైనవి చిక్కితే చేతివాటు వెయ్యకుండా ఉండదు.

నగేంద్రుడి తండ్రిహయాంలో హీర అమ్మమ్మను పచారికగా తెచ్చారు ఆమె బ్రాహ్మణస్త్రీయే. ఈ దివాణంలో పనివాళ్ళకు గౌరవమర్యాద లుంటాయి గనక గౌరవ కుటుంబాలకు చెందిన జరుగుబాటు తక్కువైనస్త్రీలుకూడా పనివాళ్ళుగా వస్తూండేవారు. తన మనమరాలు ఈడేరగానే ఆ ముసలిది పని మానుకుని గోవిందపురంలోనే ఒక చిన్న ఇల్లు కట్టుకుని అందులో నివసించింది హీర ఇక్కడే పనిచేస్తూ వచ్చింది.

* * * *

కుంద తెల్లవారుజాము చీకట్లో తోటపక్కన ఉన్న కొలను మెట్లమీద కూర్చుని, తన దుస్థితికి వగవసాగింది. తల్లి పోయింది, తండ్రి పోయాడు. అన్న పోయాడు, తనకు చావు రాలేదు. జీవితంలో తనకు దుఃఖమే గాని సుఖంలేదు.

ఆమె నగేంద్రుణ్ణి ప్రేమించింది. కాని అతను తనను ప్రేమిస్తున్నాడని కమలమణి చెప్పేనదాకా ఆమెకు తెలీదు తెలిసినా అది నమ్మశక్యంగా లేదు అతను తనలో

ఏమి చూసి ప్రేమిస్తాడు ? రూపమా ? సూర్యముఖి తనకంటె చాలా అందమైనది. పనికత్తెలలో తనకన్న అందమైనవా ళ్ళున్నారు - వామా, రమణీ, చంద్రముఖీ, ముక్తకేశినీ, హీరా...గుణం చూసి ప్రేమించాదా? తనలో ఉన్న గుణ మేమిటి? .

తాను కలకత్తాకు వెళ్ళలేదు - వెళితే నగేన్‌ను చూసేభాగ్యం కూడా ఉండదు; అంతకన్న చావు నయం. కాని ఉంటే, తనకు సహాయపడినవాళ్ళు నాశన మవుతారు. అందుచేత తాను కలకత్తాకు వెళ్ళితీరాలి కాని ఎలా వెళ్ళటం ?

కుందకు తనతల్లి కలలో కానిపించి, నక్షత్రాలవద్దకు రమ్మని పిలవటం జ్ఞాపకం వచ్చింది. చచ్చిపోయినవాళ్ళు నక్షత్రా లవుతారుట తన తల్లి అదేసలహా ఇచ్చింది, ఆ సలహాప్రకారం చచ్చిపోతే అన్నిచిక్కులూ విడిపోతాయి

పిరికిదైన కుంద లేచి నీళ్ళకేసి ఒక్కొక్క మెట్టే దిగసాగింది. భయంతో ఆమె కంపించిపోతున్నది. కాని మనోనిశ్చయం దృఢంగానే ఉంది

అంతలోనే ఆమె వీపుమీద ఎవరో చెయ్యి వేసి, "కుందా" అని పిలిచారు. ఆమె వెనక్కు తిరిగి నగేంద్రుణ్ణిచూసింది. ఆమె తలపెట్టిన ఆత్మహత్య మరి కొనసాగలేదు.

"కుందా, నువు కలకత్తాకు నిజంగా పోతున్నావా?" అని నగేన్ అడిగాడు. కుంద జవాబు చెప్పక ఏడ్చింది

"కుందా, విను నేను అతికష్టంమీద ప్రాణాలు బిగబట్టుకుని ఉన్నాను. నాలోపల జరిగే సంక్షోభం నన్ను పీల్చి పిప్పి చేసేస్తున్నది చాలా దిగజారిపోయాను. తాగు బోతును కూడా అయాను. ఇక ఈ సంక్షోభాన్ని భరించలేను. నిన్ను విడవలేను. అంతటా బహిరంగంగా విధవావివాహాలు జరుగుతున్నాయి నువొప్పుకుంటే నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను." అన్నాడు నగేన్.

"వద్దు " అన్నది కుంద.

"విధవా వివాహం తప్పనా ?"

"వద్దు "

"ఆలోచించుకో. మళ్ళా పునిస్త్రీ వవుతావు నాపైన నీకు ప్రేమ ఉందా, లేదా ?"

"వద్దు."

అతను ఎన్నివిధాల అడిగినా ఆమె "వద్దు" అనే అన్నది.

* * * *

దేవేంద్రబాబుఇంటికివెళ్ళి, వైష్ణవివేషం తీసేసి, స్వస్వరూపంధరించి, హుక్కా, ఎక్షాబ్రాందీ దగ్గిరపెట్టుకుని సేవిస్తూ ఆనందడోలికలు ఊగుతూండగా సురేంద్రుడు వచ్చి, కుశలప్రశ్న చేసి, "ఎక్కడికి వెళ్ళొచ్చావు ?" అని అడిగాడు.



"అప్పుడే ఇది నీదాకా వచ్చిందీ ?" అని దేవేంద్రు డడిగాడు.

"నీ కేమన్నా భ్రాంతా ? నువు రహస్యంగా చేస్తున్నా వనుకునే ప్రతిపనీ చాటింపు వేసినట్టుగా తెలుస్తూనే ఉంది," అన్నాడు సురేంద్రుడు.

"తెలిస్తే తెలియనీ ! ఏ పనిగానీ రహస్యంగా చెయ్యవలసిన గతేం పట్టింది నాకు ?"

"అలా అనటం గొప్ప అనుకుంటున్నావు కామాలు. మనిషికి కొంచెం సిగ్గన్నది ఉండాలి. నీకు సిగ్గుంటే వైష్ణవివేషం వేసుకుని ఊరిమీద తిరుగుతావా ?"

"వైష్ణవి అంటే ఎలాంటి వైష్ణవి ! అందంగా ఉన్నాను కాదూ ?"

"నే నా పాడుముఖం చూడలేదు. చూస్తే కమ్చీతో కొట్టిఉందును !"

సురేంద్రుడు దేవేంద్రుడి చేతిలోని బ్రాందీగ్లాసు లాగేసి, "నీ కింకా ఒళ్ళుతెలిసి ఉండగానే రెండుమాట లడుగుతాను. ఆ తరవాత కావలిస్తే తప్పతాగుతావు గాని... ఎవరిని నాశనం చెయ్యా లని వైష్ణవివేషం వేశావు ?" అన్నాడు.

"మేస్టరు తారాచరణుడి అప్సరసలాటి అమ్మాయిని పెళ్లాంగా సంపాదించాడు, జ్ఞాపకం ఉందా ? ఆ అప్సరస ఇప్పుడు విధవరాలు. రాక్షసిముండాకొడుకు నగేంద్రుడింట వంటచేసి పొట్ట నింపుకుంటోంది. ఆమెను చూడటానికి వెళ్ళాను."

"చూడు, దేవేంద్రబాబూ నువుచేసిన పాపాలు చాలవా ? ఇంకాకొత్తవి ఎందుకు చేస్తావు ? ఇలా అత్యాచారాలు చేస్తే నీతో నేను స్నేహం చెయ్యగూడదు."

"నా మీద ఆగ్రహించకు. నా మనసు నా ఆధీనంలో లేదు. ఈ అమ్మాయిని మొదట చూసినప్పటినుంచీ నాలో తీవ్రమైన జ్వరం రేగుతున్నది. ఆమె జాడ తెలుసుకోవటానికి ఎంతో ప్రయత్నించాను. లాభం లేకపోయింది. చివరకీ వైష్ణవీ వేషంలో ఆమెను చూడగలిగాను. ఆమె ఏమో మహా పతివ్రత అన్నట్లు మాట్లాడకు."

సురేంద్రుడీ మాటలతో ఏమీ తృప్తిపడక, "ఇంక నేను నీ ముఖం చూడను." అని ఆగ్రహించి వెళ్ళిపోయాడు.

తన కున్న ఒక్క ఆప్తుడూ వెళ్ళిపోయినందుకు దేవేంద్రుడు కొంచెం విచారించి, చివరకు, "ఈ ప్రపంచంలో ఎవరి కెవరు ? నాకు నేనే !" అని వేదాంతం చెప్పుకుని, తాగుడులో మైమరచి పాటలు పాడుతూ, ఆనందించసాగాడు.

ఇంతలో కిటికీవద్ద ఏదో చప్పుడయింది "ఎవరది ? దొంగలా ?" అని దేవేంద్రుడు కేక పెట్టాడు. జవాబు లేదు. అతను లేచివెళ్ళి, ఒకస్త్రీ పరిగెత్తి పోతూండటం చూసి, వెంట తరిమి పట్టుకుని, చీకటిలో ఆమె ముఖాన్ని సరిగా పోల్చలేక, "దేవీ, భక్ష్య భోజ్య పానీయాలు నైవేద్యం పెడతాను. స్వీకరించి వెళ్ళు," అంటూ ఆమెను లోపలికి తెచ్చి కూర్చోబెట్టి, ఒక గ్లాసులో బ్రాండీ పోసి ఆమె కందించాడు.

ఆమె ఆ గ్లాసును కింద పారేసింది.

దేవేంద్రుడు దీపం తెచ్చి ఆమెను చూసి, "ఎవరు నీవు ? నిన్నెక్కడో చూసినట్టుంది !" అన్నాడు.

"నా పేరు హీర."

"హుర్రా ! త్రీ ఛీర్స్ ఫర్ హీరా !" అని కేక పెట్టి అతను తూలుతూ హీర ముందు సాష్టాంగనమస్కారం చేశాడు; దండకం కూడా చదివాడు.

హీర అంతకు పూర్వమే వైష్ణవిని వెంబడించి వచ్చి, వైష్ణవీ, దేవేంద్రబాబూ ఒకరేనని తెలుసుకునిపోయింది. కాని దేవేంద్రుడు ఎందుకోసమై మారువేషంతో నగేంద్రుడి ఇంటికి వచ్చాడో తెలుసుకుందా మని ఆమె సాహసించి మళ్ళీ వచ్చి,




కిటికీ దగ్గిర నిలబడి, లోపల సురేంద్రుడికీ, దేవేంద్రుడికీ జరిగిన సంభాషణ అంతా విన్నది.

హీర తాను మాత్రం తాగక దేవేంద్రుణ్ణి తాగనిచ్చి, అతనికి పూర్తిగా స్పృహ లేకుండా పోయినాక చల్లగా జారుకుని ఇంటికి వెళ్లింది

మర్నాడు ఉదయం ఆమె సూర్యముఖితో తాను తెలుసుకున్న దంతా చెప్పింది–కుందనందిని నిర్దోషి అన్న ఒక్క విషయం తప్ప. అది ఆమె కావాలనే చెప్పలేదు; అందుకు కారణ మేమిటో మనకు తరవాత తెలుస్తుంది.

సూర్యముఖికి కోపావేశంలో కళ్ళు ఎర్రగా అయాయి, కణతలు అదిరాయి. ఆమె కుందను పిలిపించి, "వైషవి ఎవరో మాకు తెలిసిపోయింది. అతను నీ రంకు మొగుడు ఇంతటిదాని వనుకోలేదు నీవంటివాళ్ళ కిక్కడ చోటులేదు. వెంటనే వెళ్ళిపో. లేకపోతే హీరచేత గెంటించేస్తాను!" అన్నది.

ఆ మాటలు వింటూనే కుంద నిలువునా కంపించి కుప్పగా కూలిపోయింది. కమలమణి ఆమెను లేవదీసి ఆమె పడకగదికి తీసుకుపోయి, "కుందా, నీ యజమానురా లేమంటే నేం? నే నందులో ఒక్కముక్కకూడా నమ్మను," అంటూ ఊరడించింది.

రాత్రి చీకట్లో కుంద తన పడకగదినుంచి కట్టుబట్టలతో బయటికి వచ్చి, సూర్యముఖి ఇల్లు దాటి నడవ నారంభించింది. ఆమె నగేంద్రుడు పడుకుని ఉన్న ఇంటిదాక

వచ్చి, కిటికీలోనుంచి వెలువడే అతని గది వెలుతురు చూసి, సమీపంగా ఉన్న రెండు పనసచెట్లలో ఒకదాని మొదట కూర్చుని ఆ వెలుతురు కేసి చూడసాగింది.

ఆకాశాన్ని మేఘా లావరిస్తున్నాయి. గాలి వీస్తున్నది ఉన్నట్టుండి నగేంద్రుడు నిద్ర లేచి కిటికీతలుపు మూసేశాడు కుందను ఆకర్షించిన ఆకాస్తవెలుగు పోయింది.

కుంద అక్కడినుంచి లేచి దొరికిన దోవను పట్టుకుని పోసాగింది. "కుందా, ఎక్కడికి పోతున్నావు?" అని అడుగుతున్నట్లుగా మేఘాలు గర్జించాయి; మెరుపులు మెరిశాయి; గాలి రొద చేసింది, వాన సాగింది

మెరుపుల కాంతిలో కుంద దారిపక్కన ఒక చిన్న మట్టిగోడల ఇల్లు చూసి, దాని వాకిలి తలుపులకు చేరబడి కూర్చున్నది ఆమె అలా కూర్చోవటంలో తలుపుల చప్పు డయింది. ఇంట్లోవాళ్ళు గాలికి చప్పుడయిం దనుకున్నారు కాని అంతలోనే కుక్క మొరిగింది.

ఇంట్లోవాళ్ళు తలుపులు తెరచిచూస్తే వాకిట ఎవరో కూర్చుని కనబడింది

ఇంటిమనిషి, "ఎవరమ్మా నువు ?" అని అడిగింది

"వానగా ఉంటే కూర్చున్నాను," అన్నది కుంద.

ఇంటిమనిషి ఆమె కంఠం గుర్తించి, "నువా ? లోపలికి రా," అన్నది.

కుంద లోపలికి వెళ్ళి దీపం వెలుగులో హీరను గుర్తించింది

"అవమానం భరించలేక వచ్చావా ? సరేలే నీ కేమీ భయంలేదు. నేను నీ మాట ఎవరితోనూ చెప్పనులే. రెండురోజులపాటు ఇక్కడే ఉండు," అన్నది హీర.

హీర ఇంట హీరా, ఆమె అమ్మమ్మా మాత్రమే ఉన్నారు. వారు చెరొక గది లోనూ పడుకునేవారు. హీర కుందకు తన గదిలోనే పక్క ఏర్పాటు చేసి పడుకో బెట్టింది. కుంద పడుకున్నదేగాని నిద్రపోలేదు.

మర్నాడు హీర పనికి పోయేటప్పుడు కుంద కోరికపై ఆమెను గురించి ముస లావిడకు తెలియకుండా ఏర్పాటు చేసింది. మూడు జాములకు ముసలిది స్నానానికి వెళ్ళినప్పుడు హీర వచ్చి, కుందచేత స్నానం చేయించి, భోజనం పెట్టి, మళ్ళీ ఆమెను గదిలో ఉంచి, తాళం వేసి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి వాళ్ళిద్దరూ గదిలో పడుకుని ఉన్న సమయంలో హీరకోసం మాలతి అనే మనిషి వచ్చింది. ఈ మాలతి ముప్పై ఏళ్లు దాటిన మనిషి. మహా రసికురాలు. దేవేంద్రుడి ఇంటి పొరుగుననే ఉంటుంది. అతని దాసి కాకపోయినా కొన్నికొన్ని సందర్భాలలో అతనికి దుర్ఘటమైనపనులు చేసిపెడుతుంది.

హీర మాలతిని చూసి, "నే బతికుండాగానే వచ్చావేం, తల్లీ?" అన్నది.



మాలతి రహస్యంగా, "నిన్ను పిలుచుకురమ్మని దేవేంద్రబాబు పంపించాడు," అన్నది

"ఏమాత్రం ముట్టిందో!" అన్నది హీర.

"ముట్టాలిసిందే—బూడిద!" నీ బుద్ధినిబట్టి నువ్వలా అనుకుంటావు. పోదాం పద!"

హీర కుందవద్దకు వచ్చి, "బాబుగా రింటినుంచి కబు రొచ్చింది; వెళ్లాలి. ఎందుకోసమో మరి?" అన్నది. ఆమె దీపం ఆర్పి, చీకట్లోనే వస్త్రాలంకరణ చేసుకుని బయలుదేరింది ఆమె ఒక్కతే లోపలికి వచ్చేసమయానికి దేవేంద్రుడు "పూజ" లో పూర్తిగా నిమగ్నుడై ఉన్నాడు అతని కింకా నిషా పూర్తిగా ఎక్కలేదు.

"హీరా, కిందటిసారి నువొచ్చినప్పుడు తాగి ఉండటంచేత నువ్వేమన్నదీ నాకు తెలియలేదు. ఆనాడెందు కొచ్చావో అడిగి తెలుసుకుందామని నిన్ను పిలిపించాను," అన్నాడతను

"నేనుకూడా తమ దర్శనానికే వచ్చాను," అన్నది హీర.

"నువు చాలా తెలివిగలదానివి. నీవంటి దాసి ఉండటం నగేన్ అదృష్టం వైష్టవి వేషం ఎందుకు వేశానో కనుక్కోవటానికి వచ్చావు. అంతా తెలుసు కున్నావు అందుకు బహుమానం పొందేఉంటావు నాపనికూడా చేసిపెట్టావంటే నీకు తగిన బాహుమాన మిస్తాను," అంటూ దేవేంద్రుడు కుందను తనకు ఇప్పిస్తే హీరకు ఎంతో డబ్బిస్తా నన్నాడు

హీర మండిపడి "నేను దాసీనిగనక ఈమాట అనగలిగారు మీ మాటకు నేను సమాధానం చెప్పలేను మా యజమాని నగేంద్రుడుగారు చెబుతారు దానికి తగ్గ వారు వారే," అంటూ వెళ్లిపోయింది

దేవేంద్రుడు నిరుత్సాహి అయిపోయి, తరవాత రెండుసీసాల బ్రాందీ తాగేసి, మనస్సు కాస్త కుదటపడగా, రాగాలాపనచేసి పాడ నారంభించాడు.

## పుష్పం

నగేంద్రుడి ఇల్లు నానా గొడవగా ఉన్నది కుందనందిని కనబడటంలేదు. కోపం వచ్చి ఎక్కడికో లేచిపోయిం దని అందరూ అనుకున్నారు ఆమెకు కోపం రావ టానికి కారణం తాను పెళ్ళాడతా ననటమే అయిఉంటుం దని నగేంద్రు డను కున్నాడు అలా కోపగించిన మనిషి కమలవెంట కలకత్తాకు వెళ్లిపోగూడదా?

నగేంద్రుడి ముఖం భీకరంగా తయా రయింది. అతని ఎదట పడటాని కందరూ భయపడుతున్నారు సూర్యముఖి కిందులో ఏపాత్ర ఉన్నదీ ఎవరికీ తెలియదు. నగేంద్రు డామెతో మాట్లాడటం మానేశాడు కుందను వెతకటాని కని గ్రామగ్రామా లకూ మనుషులను పంపాడు

కుంద వెళ్ళిపోవటంగురించి సూర్యముఖి భయపడింది. దేవేంద్రుడు టక్కరి అనీ, కుంద దుర్గుణాలు కలది కాదనీ కమలమణి అన్న మాటలలో ఆమెకు విశ్వాసం కుదిరింది. ఆమె జరిగినదానికి పశ్చాత్తాపపడింది. తన భర్తలో కలిగిన వైరాగ్యా నికి సంతసం చెందింది ఆమె కుందను తిట్టి, తనను తాను మరింత తిట్టుకున్నది. కుందను వెతకటానికి ఆమెకూడా మనుషులను పంపింది

కమలమణి కలకత్తా ప్రయాణం మానుకున్నది ఆమె దాసీలకు తన మెడలోని హారం తీసి చూపి, కుందను తీసుకొచ్చినవారి కా హారం ఇస్తా నన్నది.

ఇంత జరిగినా హీర కుందను గురించి ఎవరికీ ఏమీ చెప్పలేదు. ఆమె తన స్వార్థం గురించే ఆలోచించింది ఇది ఆమెకు మంచి అవకాశం తప్పటడుగు లేసి ఈ అవకాశాన్ని పాడుచేసుకోకూడదు



కుందను ఎవరికి అప్పగించాలి ? నగేంద్రుడి ఇంటికి తీసుకుపోతే కమలమణి హారం ఇస్తుంది సూర్యముఖీ, నగేంద్రుడూ కూడా ఏవైనా బహుమానా లివ్వక పోరు అలా కాక, కుందను దేవేంద్రుడి వద్దకు తీసుకుపోయినా అతను విశేషంగా ధన మిస్తాడు కాని అక్కడ కుంద ప్రాణాలతో ఉండదు

హీరను మరొక సంగతికూడా బాధించింది దేవేంద్రుడు తనను చూస్తూ కుందను తీసుకురమ్మని అడుగుతాడా ? హీరకు ఎవరిపైనా ప్రేమ లేదు అయినా ఆమె దేవేంద్రుడి అందంచేత ఆకర్షించబడింది, ఆమెకు దాసిగా ఉండా లని లేదు, సుఖపడా లనే ఉన్నది ఆ అవకాశాన్ని దేవేంద్రుడు తన కిచ్చాడు కాదు అటువంటి వాడికి కుందను అప్పగించటం అసంభవం ! ఆ మాట తలుచుకుంటేనే హీరకు శరీరంలో వణుకు పుట్టుకొచ్చింది

హీరకు సూర్యముఖిపైన కూడా పగే అందుకు వేరే కారణ మేమీ లేదు—ఆమె సుఖవతి, తాను దుఃఖజీవి, ఆమె సంపన్నురాలు, తాను పేదరాలు, ఆమె యజమానురాలు, తాను దాసి సూర్యముఖికీ, నగేంద్రుడికీ మధ్య వైకల్యం కలిగితే సూర్యముఖి ఆట కట్టయిపోతుంది – హీర కళ్లు చల్లగా ఉంటాయి ఆ తరవాత

నగేంద్రుడికి కుందనందినే హృదయరాణి అవుతుంది ఆమె తన చేతి కీ లు బొమ్మయే గనక ఆమెను ఇష్టం వచ్చినట్టు తాను వాడుకోవచ్చు

అందుచేత కుందను నగేంద్రుడి ఇంటికి చేర్చటమే తనకు అన్నివిధాలా లాభం కాని అప్పుడే కాదు—నగేంద్రుడు కుందకోసం మరికొంత తపించాలి ఈ లోపల తన అమ్మమ్మను ఊరికి పంపెయ్యాలి లేకపోతే కుంద రహస్యం ఆమెకు తెలిసి పోవచ్చు

ఈ విధంగా ఆలోచించి హీర తన అమ్మమ్మను ఊరికి పంపేసి, కుందను ఎంతో శ్రద్ధగా తన ఇంట దాచిఉంచింది కుందకూడా హీరకు తన పై ఎంతో ప్రేమ అనీ, అంతప్రేమ తనపైన కమలమణికికూడా లేదనీ అనుకున్నది

హీర వేసిన పథకానికి అంకురార్పణ నగేంద్రుడికీ, అతని భార్యకూ మధ్య మన స్సులు విరగడంతో జరగవలసిఉంది దానికోసం హీర కృషి సాగించింది ఆమె కౌసల్య అనే దాసితో, "ఇవాళ నాకు ఒంట్లో బాగా లేదు నా పనికూడా నువే చేసిపెట్టు," అన్నది

"అలాగే చేస్తాను మనిషన్న తరవాత తలనొప్పో, కాలునొప్పో రాకుండ ఉంటుందా?" అన్నది కౌసల్య

"న న్నెందు కలా తిడుతున్నావు?" అన్నది హీర తగాదా కల్పించుకుంటూ

"నేను నిన్ను తిట్టానా?" అన్నది కౌసల్య ఆశ్చర్యపడి

హీర పనిపెట్టుకుని నానాతిట్లూ తిట్ట నారంభించింది కౌసల్యకూడా ఎదురు తిరిగి హీరను తిట్టింది హీర సూర్యముఖిదగ్గిరికి వెళ్ళి, పెద్దపెట్టున దొంగఏడుపు లేడుస్తూ, కౌసల్యను వెళ్ళగొట్టకపోతే తాను పనిలో ఉండ నన్నది

సూర్యముఖి విచారించగా తప్పు హీరదే నని తెలిసింది అయినా దాన్ని తృప్తి పరచటానికి కౌసల్యను మందలించింది దానితో హీర తృప్తి పడక, కౌసల్యను పనిలోనుంచి తియ్యమని పట్టుబట్టేసరికి సూర్యముఖి చిరాకుపడి, "ఉంటే ఉండు, పోతే పో దాన్ని నే నేమీ చెయ్యను," అన్నది

"మానుకోమన్నారుగా, మానుకుంటాలేండి," అంటూ హీర కన్నీటితో ముఖ మంతా తడుపుకుని నగేంద్రుడిదగ్గిరికి పోయి నిలబడింది

కచేరీ సావట్లో ఒంటరిగా కూర్చునిఉన్న నగేంద్రు డామెను, ఎందు కేడుస్తున్నా వని అడిగాడు యజమానురాలు తనను పని మానుకోమన్న దనీ, తన జీతం లెక్కచూసి ఇప్పించమనీ హీర అన్నది

"ను వేం చేశావు ?" అన్నాడు నగేంద్రుడు



"ఈ రోజు నా కొత్త స్టెనోని కాల్చి పారేద్దామనుకున్నా "
"ఏం, అంతదాక ఎందు కొచ్చింది ?"
"నేను లెటర్ డిక్టేట్ చేస్తా కూర్చోమంటే ఆమె కుర్చీ ఎక్కడుందా అని వెతుకుతుంది.'

---

"కౌసల్య నన్ను తిట్టింది నేను వెళ్ళి అమ్మగారితో చెబితే ఆవిడ కౌసల్య మాటలు నమ్మి నన్ను వెళ్ళిపొమ్మన్నారు ?" అన్నది హీర

"అయితే ను వ్వేమంటావ్ ?''

''నా కేం ఎని ఇష్టంలేదు అమ్మగారు బాగా మారిపోయారు ఏ క్షణాన ఎవరి నేమంటారో తెలీదు కుందనందినిని ఇలాగే ఏదో అన్నారు ఆవిడగారు దేశం విడిచి పారిపోయింది నన్నే అలా అంటే నా గతేం కావాలి ?'' అన్నది హీర

ఈమాటలో నగేంద్రుడి ముఖం మాడినట్టయింది అతను హీరతో, ''నీ సంగతి తరవాత చూస్తాను, ను వ్వింటికి వెళ్ళిపో,'' అని చెప్పి, తన భార్యను పిలిపించి, ''హీరను వెళ్ళిపొమ్మన్నావా ?" అని అడిగాడు

సూర్యముఖి అతనితో హీర సంగతి వివరంగా చెప్పింది

నగేంద్రు డంతా విని, "హీర ఎలాగైనా చావనీ, నువు కుంద నేమన్నావేం ?" అని అడిగాడు.

ఆమాటతో సూర్యముఖి ముఖం వాడిపోయింది ఆమె కొంచెంసేపు మౌనంగా ఉంది. చివరకు "నాకు మీదగ్గిర రహస్యాలేమీ లేవు ఇదిమాత్రం ఎందుకు దాచాలి? కుందనందినిని ఒక చెడ్డమాట అన్నాను ఆమాట చెవితే మీకు కోపం వస్తుందేమో నని చెప్పలేదు '' అంటూ జరిగిన దంతా చెప్పేసి ''నేను కుందను తూలనాడి నా కంఠంమీదికే తెచ్చుకున్నాను ఆమెను వెతకటానికి నేనుకూడా ఊళ్ళ మీద మనుషులను పంపాను దొరికితే తప్పక తీసుకొస్తారు నావల్ల జరిగిన ఈ పొరపాటును మీరు క్షమించాలి," అన్నది

''ఇందులో నీ పొరపాటు అంతగాలేదు కుందను గురించి నువు విన్న వి... యాలనుబట్టి ఏ పరువుగల స్త్రీ అయినా నీలాగే చేస్తుంది కాని నువు విన్నది నిజమో, కాదో విచారించి ఉండవలిసింది.'' అన్నాడు నగేంద్రుడు

''అప్పుడు నా మనస్సు చెదిరిపోయింది నే నేమీ ఆలోచించలేదు '' అన్నది సూర్యముఖి

''నేను కుందను ప్రేమిస్తున్నా నన్న సందేహంలోపడి అలా చేశావు " అన్నాడు నగేంద్రుడు

సూర్యముఖి అతని కాళ్ళపై తలఉంచి, వెక్కి వెక్కి ఏడుస్తూ, ''నేను పడ్డ బాధ ఏమని చెప్పను మీ మనసులో మరొకతెకు చోటు దొరికిం దని తెలియగానే నేను చచ్చిఉండవలిసిందే కాని నేను చస్తే మీకు మరింత దుఃఖ మని ఆపని చెయ్య లేదు నా అపరాధాన్ని మనసులో ఉంచుకోకండి '' అన్నది

"అపరాధా లన్నీ నావే నీ అపరాధం ఏమీలేదు నేను నీకు ద్రోహం చేశాను నిన్ను మరిచిపోయి ఆ కుందనందినిని - ఏంచెప్పను? నేను భరించరాని బాధ అను భవించాను నా మనసు నా స్వాధీనంలో లేదు ' అన్నాడు నగేంద్రుడు

సూర్యముఖి చేతులు జోడించి, మీ మనసులో ఏముందో నాకు చెప్పకండి అవి మీరు చెప్పవలసినవీ కావు, నాకు వినాలనీ లేదు.'' అన్నది

''ఆలా కాదు. నీకు చెప్పవలసిన మాట లింకా ఉన్నాయి ఈ ఇల్లూ, సంసారం వదిలిపెట్టి దేశాంతరాలకు పోదా మనుకుంటున్నాను నాకు వీటిలో సుఖంలేదు నేను నీకు తగిన భర్తను కాను నా ఎదటే నువు కుమిలిపోతుంటే చూడలేను నీ మొగుడు పోయా డనుకో ఈ ఇంటి పెత్తనం చూసుకో ఎంతకాల మని నిన్ను మోసగించను? ఎప్పటికైనా కుందనందినిని మరిచిపోగలిగితే తిరిగి వస్తాను లేక పోతే మనం కలుసుకోం,'' అన్నాడు నగేంద్రుడు

"ఒక విన్నపం "



"ఏమిటది ?"

"ఒక్క మాసంరోజు లుండండి ఈలోపుగా కుందనందిని వార్త తెలియక పోతే అలాగే వెళ్ళిపోదురుగాని నేను మిమ్మల్ని ఏవిధంగానూ అడ్డుపెట్టను." అన్నది సూర్యముఖి.

హీరకు పనిఅయితే పోయిందిగాని, నగేంద్రుడి ఇంటితో సంబంధం తీరిపోలేదు భార్యాభర్తల మధ్య తాను నాటిన విషబీజం ఎలా వృద్ధిపొందుతున్నదీ తెలుసుకోవ టాని కామె, ఆ యింటివాళ్ళు ఎవరు కనిపించినా ఆపి వాళ్ళతో మాట్లాడేది. తన యజమానురాలి మనస్థితి గురించీ. యజమాని మనస్థితి గురించీ. తెలుసుకునేది ఎవరూ కనిపించకపోతే తానే ఆ ఇంటికి వెళ్ళి. దాసీవాళ్ళుండేచోట చేరి విషయాలు తెలుసుకునేది

కొన్నాళ్ళు గడిచాయి

హీరను దేవేంద్రుడివద్దకు తీసుకుపోయిన మాలతి అనే గొల్లమనిషి ఆరోజు మొదలు అప్పుడప్పుడూ హీర ఇంటికి వచ్చిపోతూండేది ఆ ఇంట్లో ఒకగది ఎప్పుడూ తాళంవేసి ఉండటం ఆమె గమనించింది

ఒకనా డామె వచ్చేసరికి అగదికి తాళంలేదు గొళ్ళెంమాత్రం వేసిఉన్నది ఆమె గొళ్ళెం తీసి తలుపు తోస్తే లోపల గడియపెటిఉన్నది

లోపల ఎవరో ఉన్నారు ' ఎవరై ఉంటారు ? కుందనందిని అయి ఉండవచ్చునని మాలతికి అనుమానం తట్టి, అది నిజమో కాదో తెలుసుకునేటందు కొకయుక్తి పన్నింది

హీర తన యజమాని ఇంటినుంచి ఒక లేడిపిల్లను తెచ్చి, పారిపోకుండా దాన్ని కట్టిపెట్టి, పెంచుకుంటున్నది హీర దానిచేత గడ్డి తినిపిస్తున్నది మాలతి అక్కడికి వెళ్ళి హీర గమనించకుండా లేడిపిల్ల కట్టుతాడు విప్పింది వెంటనే లేడిపిల్ల పారిపోయింది హీర దాన్ని పట్టుకోవటానికి పరిగెత్తింది

మాలతి ఏడుపుగొంతుపెట్టి, "అయ్యో, హీరా ఏమయిందే ? కుందా ' కుందా త్వరగా రావే, హీర కేదో అయిందీ ! " అని కేక పెట్టింది

కుంద చప్పున గదిలోనుంచి బయటికి వచ్చింది

గొల్లమనిషి ఆమెను చూసి నవ్వుతూ వెళ్ళిపోయింది

కుంద తిరిగి లోపలికి వెళ్ళి గదితలుపు మూసుకున్నది ఇలా జరిగిం దని ఆమె హీరతో చెప్పలేదు

మాలతి తిరిగి వెళ్ళి, కుంద హీర ఇంట రహస్యంగా ఉన్న సంగతి దేవేంద్రుడికి చెప్పింది అతను కుందను స్వయంగా చూడా లని నిశ్చయించుకున్నాడు కాని ఆరోజు వాళ్ళింట స్నేహితులకు విందు ఏర్పాటుండడంచేత ఆరోజు పొసగ లేదు

కుంద హృదయంలో అనేక రకాల తుపానులు చెలరేగాయి మొదట ఆమె తనను సూర్యముఖి వెళ్ళగొట్టినందుకు అవమానంతో కుమిలిపోయింది క్రమంగా ఈ బాధ తగ్గిపోయి ప్రేమబాధ హెచ్చింది ఆమె సూర్యముఖిమాట మరిచిపోయి నగేంద్రుణ్ణే తలవసాగింది అతను ఎప్పుడూ ఆమె కళ్ళఎదటనే మెసిలేవాడు

ఈ ప్రేమబాధతో ఆమె తాను చేసిన పనికి పశ్చాత్తాప పడసాగింది వా ళ్లేదో అన్నంతమాత్రాన తానెందుకు వచ్చెయ్యాలీ ? మాటపడ్డమాత్రాన వచ్చిన నష్ట మేమిటీ ? అక్కడ ఉంటే నగేంద్రుడు కనిపిస్తూండేవాడుగద ' ఇప్పుడు అసలు చూడటానికే లేదు

పోనీ తిరిగి అక్కడికి పోతే ? సూర్యముఖి తనను మళ్ళీ వెళ్ళగొడుతుందేమో ? కాని వెళ్ళకపోతే ప్రాణం నిలిచేటట్టు లేదు ఏమయితే అయింది, వెళదా మనుకున్నది కుంద



కాని ఒక్కతే వెళ్ళాలంటే బిడియం. హీరను తోడు తీసుకుపోవచ్చు - కాని హీరతో ఈ సంగతి తననోట ఎలా చెప్పటం?

నగేంద్రుడి దర్శనంకోసం గిలగిలా తన్నుకుపోతున్న కుంద ఒకనాటిరాత్రి ఆఖరిజామున తలుపు తీసుకుని బయటికి వచ్చి, చీకట్లోపడి నగేంద్రుడి భవనానికి బయలుదేరింది. నగేంద్రుడు పెందలాడే లేస్తాడు; కిటికీవద్దనో, మేడమీద ఉండో, తోటలోనో, మరో చోటనో అతను కనిపిస్తే ఒక్కసారి చూసి, తిరిగి వచ్చెయ్యాలని ఆమె ఉద్దేశం.

కుంద అతని మేడవద్దకు పోయింది. అతను కిటికీ దగ్గరగాని, మరొకచోట గాని కనిపించలేదు. ఆమె అతనికోసం అన్ని ప్రదేశాలూ తిరిగి, ఇంకా లేచిఉండ డనుకుని, కొలను దగ్గిర చెట్టు మొదట్లో కూర్చున్నది.

దాసీవాళ్ళు తలుపులు తెరిచే అలికిడి వినిపించింది. తూర్పు తెల్లవారుతున్నది. తెల్లవారటాన్ని సూచించే మందమారుతం సాగింది. ఎవరన్నా వచ్చి తనను చూస్తారన్న భయంతో ఆమె వెళ్ళిపోదామని లేచింది.

కాని ఆఖరుఆశ ఆమెను వదలలేదు. ఒకొక్కప్పుడు నగేంద్రుడు నిద్రలేచి అంతఃపురం పక్కనఉన్న పూలతోటలోకి రావటం కద్దు. ఒకవేళ అక్కడ తిరుగుతున్నాడేమో! అక్కడ వెళ్ళి చూడకుండా ఇంటికిపోవటం కుంద కిష్టం కాలేదు.

ఉద్యానవనం చుట్టూ ఎత్తయిన ప్రహరీగోడ ఉండటంచేత కుంద గోడమీది నుంచి చూడలేకపోయింది అయితే ద్వారం తెరిచే ఉన్నది కుంద లోపలికి వెళ్ళి ఒక పొగడచెట్టు దగ్గిర నిలబడి చుట్టూ కలయచూసింది నగేంద్రుడి జాడ కనబడ లేదు లతామండపంమధ్య చలవరాతి అరుగుపైన ఎవరో పడుకుని ఉన్నట్టు కని పించింది దగ్గిరగా చూతామని కుంద చెట్లచాటుగా మెల్లిగా లతామండపాన్ని సమీపించింది

ఇంతలోనే అక్కడ పడుకునిఉన్న వ్యక్తి లేచి ఇవతలకు వచ్చింది అది సూర్యముఖి, ఆమె పూలు కోయ నారంభించింది కుంద గాభరాపడుతూ మాధవీ లత చాటున దాగింది కాని కొద్దిసేపటికి సూర్యముఖి అటే వచ్చి, కుందను చూసి, "ఎవరు ? కుందేనా ?" అన్నది

కుంద భయంతో కొయ్యబారిపోయింది సూర్యముఖి ఆమెను సమీపించి, "రా, కుందా ' రా, చెల్లీ, నేను ఇంకెన్నడూ ని న్నేమీ అనను తల్లీ !" అంటూ కుంద చెయ్యి పట్టుకుని అంతఃపురంలోకి తీసుకుపోయింది

* * * * * *

ఆరాత్రి దేవేంద్రబాబు కడుపునిండా తాగి హీరఇంటికి వచ్చి కుందకోసం వెతి కాడు హీర చీరెకొంగు అడ్డంపెట్టుకుని నవ్వింది

"ఏం నవ్వుతావు ?" అన్నా డతను రోషంతో

"పిట్ట ఎగిరిపోయింది, వెతికి ఏం లాభం ? నరేంద్రుడి ఇంటికి చేరింది వాళ్ళు మళ్ళీ చేరదీశారు." అన్నది హీర

దేవేంద్రుడు వెళ్ళిపోయాడుగాని హీరసంగతి తెలుసుకుందా మనిపించింది వాన వస్తుందా అన్నట్టుగా చూశాడు హీరకూడా అతను వెళ్ళకూడ దనే ఉన్నది కాని అతన్ని కూర్చోమంటే తనబెట్టు చెడిపోతుం దనుకుని ఊరుకున్నది

"ఇంట్లో తాగు డేమైనా ఉందా ?"అని అడిగాడు దేవేంద్రుడు లేదన్నది హీర

"వాన వస్తుందేమో ! కాస్సేపు కూర్చుంటే ఎవరన్నా ఏమన్నా అనుకుంటారా ?" అన్నాడు

"ఎందు కనుకోరూ ? అకారణంగా రాత్రివేళ మీరు రావటమేచాలు ఎవరైనా ఏమైనా అనుకోటానికి "

"అట్లా అయితే కాస్సేపు కూర్చోవచ్చుగా ?"

హీర జవా బివ్వలేదు ఆమె తన మంచంమీద పక్క సరిచేసి, అతన్ని కూర్చో మని, హుక్కా సిద్ధంచేసి తెచ్చి, అతనికి అందించింది



దేవేంద్రుడు తన చొక్కాలోనుంచి బ్రాండిసీసా పైకితీసి దాన్ని ఆ పళంగానే తాగి హీరకేసి చూసేసరికి ఆమె కళ్ళు చాలా అందంగా కనిపించాయి

"నీ కళ్లెంత అందంగా ఉన్నాయి!" అంటూ అతను ఒకపక్కన ఉన్న సారంగి తీసి, వాయిస్తూ పాడాడు

హీరకు ఒళ్ళు తెలియకుండాపోయింది ఆమె తీవ్రమైన మదనోద్రేకానికి గురి అయి ఆ ఉద్రేకాన్ని నోటిమాటలతో వ్యక్తం చేసింది ఆమె తనకోసం తపిస్తున్న దని దేవేంద్రుడు తెలుసుకున్నాడు

కాని అంతలోనే ఆమె తాను నోరుజారిన సంగతి తెలుసుకుని, అతన్ని తక్షణం వెళ్ళిపొమ్మన్నది అతను తనను పాడు చెయ్యటానికి వచ్చా డన్నది తాను అతని రూపగుణాలకు సమ్మోహితురా లయినమాట నిజమేగాని అంతమాత్రాన కుంట కాదు అతను తనను నిజంగా ప్రేమించిఉంటే కళంకం వచ్చినా తా నంత బాధపడేది కాదేమో కాని అతను తన అక్కర తీర్చుకుని, రేపు తనను గురించి వెటకారంగా మాట్లాడే సందర్భంలో అతనికి వశంకావటం ఆమెవల్ల కాదు

ఈ మాటలు విని దేవేంద్రుడు తనకు హీరసంగతి తెలిసిం దనీ, అవకాశం వచ్చినప్పుడు హీరను ఉపయోగించుకోవచ్చు ననీ అనుకుని వెళ్ళిపోయాడు అయితే అతనికి హీరహృదయం బాగా తెలియలేదు

కలకత్తాలో ఉన్న కమలమణికి సూర్యముఖి ఉత్తరం రాస్తూ, "కుందవిషయం అడిగావు ఆమె దొరికింది మరో సంతోషవార్త నా భర్తకూ కుందకూ వివాహం

ఏర్పాటు చేస్తున్నాను. ఒకటి రెండురోజులలో పెళ్ళి జరుగుతుంది. ముహూర్తానికి కాకపోతే సదస్యానికైనా రా, నిన్ను చూడా లని ఉన్నది," అన్నది.

ఈ వివాహం జరిగితే సూర్యముఖి చాలా బాధపడుతుం దని కమలమణి అనుకున్నది. ఆమెభర్త శ్రీశుడు అసలు ఈ వార్తనే నమ్మలేక, నగేంద్రుడికి ఉత్తరం రాశాడు. నగేంద్రుడు జవాబు రాస్తూ తాను కుందనందినిని పెళ్ళాడటాన్ని సమర్థించుకున్నాడు. కుంద వితంతు వన్న దొక ఆక్షేపణ కాదు; వితంతు వివాహాలు శాస్త్ర సమ్మత మని విద్యాసాగరు డంతటివాడే అంటున్నాడు. సంఘ బహిష్కార భయం లేదు. ఎందుకంటే నగేంద్రుడే సంఘం; గోవిందపురమే అతని దైనప్పు డతన్ని బహిష్కరించే సాహసం ఎవరి కుంటుంది? అదీగాక ఈ పెళ్ళి గోప్యంగా ఉంచబడుతుంది. నీతివిరుద్ధ మనే వాదం పొసగదు; ఒక పురుషుడు ఒక్క స్త్రీనే పెళ్ళాడా లన్నది క్రైస్తవులు తెచ్చిపెట్టిన నీతి. అదంతా అలా ఉండగా, నగేంద్రుడికి సూర్యముఖివల్ల సంతానంలేదు. కుందనందినివల్ల కలిగినట్టయితే అది మేలే అవుతుంది, ఇంక చెప్పినా, ఈ పెళ్ళి సూర్యముఖికి బాధాకరమైతే అది పెద్ద అభ్యంతరమే; కాని ఈ పెళ్ళి తలపెట్టి చేస్తున్నదే ఆమె!

ఈ ఉత్తరం చూస్తూనే కమలమణి తనభర్తతో సహా బయలుదేరి గోవిందపురానికి వచ్చేసింది. పడవపద్దనుంచి ఇంటికి ఎంతోమందిస్త్రీలు ఆమెవెంట వచ్చారు. పెళ్ళి జరిగిపోయిందా అని ఎవరినిగాని అడగటానికి కమలమణికి నోరు రాకపోయింది.

ఆమె కలవరపడిన మనస్సుతో, సూర్యముఖిని చూడటానికి అంతఃపురం ప్రవేశించింది. "సూర్యముఖి ఎక్కడ?" అని ఒక దాసీని అడిగి, "పెళ్ళి అయింది. ఆమెగారు చచ్చిపోయారు," అని జవాబు వస్తుందేమో నని భయపడింది: కాని ఆ దాసీది సూర్యముఖి పడకటింట ఉన్నదని చెప్పింది.

అక్కడ సూర్యముఖి మూసిఉన్న కిటికీకింద తల వంచుకుని కూర్చుని కనపడింది. కమలమణి అడుగులచప్పుడు విని సూర్యముఖి లేచివచ్చింది.

"పెళ్ళి అయిందా?" అని అడగటానికి కమలకు నోరు రాలేదు.

సూర్యముఖి విల్లంబులాగా కరిగిపోయింది. గుండ్రని ఆమె ముఖం కోలగా అయింది. కళ్ళు గుంటలుపడ్డాయి. పెళ్ళి జరిగిపోయిం దని గ్రహించి కమలమణి, "ఎప్పు డయింది?" అని అడిగింది.

"నిన్న," అని సూర్యముఖి సమాధానం చెప్పింది.

ఇద్దరూ ఒకేచోట కూర్చుని మాటాపలుకూ లేకుండా కొంత సేపు కన్నీరు కార్చారు.

"సుఖపడ్డావా?" అన్నది కమలమణి.

"నే నెవతెను? ఆయన కాలులో ముల్లుగుచ్చుకుంటే నా ప్రాణం విలవిలా కొట్టుకుంటుంది." అని సూర్యముఖి కొంచెం సేపుండి, "కమలా, ఆడపిల్లలు పుట్టితే చంపిపారేస్తారుట — ఏదేశంలో?" అని అడిగింది.

"ఆడదై పుట్టటం తప్పా? రాసిపెట్టినట్టు జరుగుతుందిగాని!" అన్నది కమలమణి.

"నాది అదృష్టంకాదా? అలాటి భర్త ఎవరికి దొరుకుతారు? అందమూ, ఐశ్వర్యమూ తీసెయ్యి; అంత గుణవంతుడు మ రెవరుంటారు? అంత అదృష్టవంతురాలి కిలా ఎందుకు జరిగిందో తెలియటంలేదు."

"అదీ రాసిపెట్టినదే!"

"అయితే ఇలా మరి దహించుకుపోతున్నా వేం?"

"నీ భర్తను చూసి సంతోషిస్తున్నా నంటున్నావు; దహించుకుపోతున్నా నంటున్నావు. రెండూ నిజ మెలా అవుతాయి?"

"రెండూ నిజమే; ఆయన సుఖం చూసి ఆనందిస్తున్నాను. కాని ఆయన నన్ను కాలితో తన్నారు. అంది—" సూర్యముఖి పై మాట అనలేకపోయింది.

"ఆయన కాలితో తన్నా డని అభిమానపడేదానవు 'నే నెవతెను?' అనటం దేనికీ? నీలో స్వాభిమానం ఉండే బాధపడుతున్నావు, లేకపోతే బాధపడవు."

"చేసినదానికి పాశ్చాత్తాపపడటంలేదు. కోరి ఆత్మహత్య చేసుకునేవాడికికూడా మరణవేదన ఉంటుంది చూడూ!"

సూర్యముఖి మనోవేదన ఎంత లోతైనదో కమలమణి గ్రహించింది. ఆసంగతి సూర్యముఖి తెలుసుకున్నది.

"నీ మనస్సులో ఉన్న దేమిటో చెప్పు," అన్నది కమలమణి.

"ఏమీ లేదు. ఉంటే నీదగ్గిర దాస్తానా?" అన్నది సూర్యముఖి.

కాని సూర్యముఖి ఒక్క విషయం దాచింది. ఆ రాత్రి నిద్రపోయి, మర్నాడు తెల్లవారి కమలమణి సూర్యముఖి పడకటింటికి వెళ్ళేసరికి సూర్యముఖి అక్కడ లేదు. ఆమె పక్కకూడా పరిచినది పరిచినట్టే ఉన్నది. దానిపైన ఎవరూ పడుకున్నట్టు లేదు.

పక్కమీద ఒకఉత్తరం ఉన్నది. అది సూర్యముఖి కమలమణికి రాసిన ఉత్తరం.

''నా భర్త నావల్ల సుఖపడటం లేదనీ, కుందనందినికోసం ప్రాణా లర్పించటాని కైనా సిద్ధంగా ఉన్నారనీ తెలిసినప్పుడే వారిద్దరికీ పెళ్ళిచేసి వెళ్ళిపోవాలని నిశ్చయిం చాను. పెళ్ళిఅయిన రాత్రే నేను వెళ్ళిపోయి ఉండవల్సింది. కాని ఆయన సుఖం రెండురోజులు కళ్ళార చూసి ఆనందిద్దా మనీ, నిన్నొక్కసారి చూద్దా మనీ ఆశపడి నీకు జాబుకూడా రాశాను. రెండు కోరికలూ తీరాయి. వెళ్ళిపోతున్నాను.

"నన్ను పోనివ్వవనే భయంతో ముందుగా నీ వద్ద సెలవు పుచ్చుకోలేదు. ఒక్క ప్రార్థన – నా కోసం వెతికించవద్దు మనం మళ్లా కలుసుకుంటామని నాకు తోచదు. కుందనందిని ఉండగా నే నీ దేశానికి రాను. బిచ్చగత్తెగా దేశాటన చేస్తాను.

"నా భర్తకు ఉత్తరం రాద్దామని ప్రయత్నించాను. ఎంత ప్రయత్నించినా సాధ్యం కాలేదు. నే నాయనపై అలిగి వెళ్ళ లేదని ఆయన కెలాగైనా నచ్చజెప్పు. నా కాయనపైన కోపం లేదు. ఆయనపైన నాకు గల ప్రేమ ఈ దేహం ఉండగా మారేదికాదు. ఆయన సద్గుణాలను నే నెన్నటికీ మరవలేను.

"నువు నీ భర్తతోనూ, కొడుకుతోనూ సుఖంగా ఉండు. ఏనాడు నువు నీ భర్తప్రేమను పోగొట్టుకుంటే ఆనాడే నీకు చావు రావా లని ఆశీర్వదిస్తున్నాను. నన్నలా ఎవరూ ఆశీర్వదించారు కారు !"...

సూర్యముఖి వెళ్ళిపోయిం దని తెలియగానే నౌకర్లు ఆమెను వెతకటానికి అన్నిదిక్కులా బయలుదేరారు. నగేంద్రుడూ, కమలమణీ, ఆమె భర్త శ్రీశుడూ ఎవరి మానాన వారు మనుషులను పంపారు. దాసీలూ, బిల్లాలు ధరించిన భటులూ, నౌకర్లూ తమ యజమానురాలిని తీసుకురావటానికి బయలు దేరారు. బంధువులు బళ్ళమీద ఎక్కి సూర్యముఖిని వెతకటానికి రహదార్ల వెంట బయలుదేరారు. చెట్ల కిందా, ఇళ్ళ ముందరా, స్నాన ఘట్టాలలోనూ, పాఠశాలల్లో చర్చలు సాగాయి.

"ఆమె ఎంతో దూరం వెళ్ళదు. మైలో, రెండు మైల్లో వెళ్ళి ఎక్కడైనా కూర్చుంటుంది." అన్నాడు శ్రీశుడు.

కాని రెండుమూడు గంటలు గడిచినా సూర్యముఖి జాడ తెలియలేదు. ఆమెను వెతకటానికి నగేంద్రుడే బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళి, ఈ లోపల ఆమె ఇంటికి చేరే ఉంటుం దనుకుని మళ్ళీ తిరిగివచ్చాడు. ఇలా వెతుకుతూండగానే సాయంకాలం అయింది.

శ్రీశుడు చెప్పినట్టే జరిగింది. సూర్యముఖి రెండుమైళ్ళు వెళ్ళి ఒక సరస్సు పక్కన కూర్చున్నది. ఎన్నడూ ఇల్లు విడిచి వెళ్ళిన మనిషి కాకపోవటంచేత దూరం నడవలేకపోయింది.



'అంతా మోసం, అన్నీ అబద్ధాలు నేనుండను ఇక్కడ మా అమ్మదగ్గరకు పోతా "
"నేనూ అంతే, నువ్వుగాని మీ అమ్మదగ్గరకు పోతే, నేనూ నా భార్యదగ్గరకుపోతా "

---

ఆమెను వెతుకుతున్న నౌకర్లలో ఒకడు అక్కడికి వచ్చి, ఆమెను చూసి "అమ్మా ఇంటికి దయచెయ్యండి," అన్నాడు 'ఇంట్లో అందరూ ఆందోళన పడుతున్నా" రన్నాడు

'నాకు చెప్పటానికి నువ్వెవడివి నువ్వు వెంటనే పోకపోతే ఈ సరస్సులో పడిపోతాను ' అన్నది సూర్యముఖి

నౌకరు పరుగెత్తుకుంటూ వెళ్ళి నగేంద్రుడితో ఈమాట చెప్పాడు నగేంద్రుడు స్వయంగా పల్లకీతోసహా అక్కడికి వచ్చేసరి కామె అక్కడలేదు

సూర్యముఖి అక్కడినుంచి బయలుదేరి ఇంకో తోపులో కూర్చున్నది పుల్లలేరుకోవటానికి అక్కడికి వచ్చిన ముసలి దొకతె ఆమెను చూసి, "నువ్వు మారాణివి కావా, అమ్మా?" అన్నది

"నా దగ్గిర నగలుకూడా ఏమీ లేవే, మారాణి నెలా అవుతాను" అన్నది సూర్యముఖి

ముసలి దామాట నమ్మింది

పగలల్లా వృథాగానే పోయింది సూర్యముఖికోసం వెతికే మగవాళ్ళకు ఆమె ఎలాఉంటుందోకూడా తెలియదు కనిపించిన ఆడవాళ్ళ నందరినీ పల్లకీలలో

ఎక్కించి తెస్తున్నారు. ఆ ఆడవాళ్లు పల్లకీ మొహం ఎరిగినవాళ్ళుకూడాకారు: వాళ్ళ కీ విధంగా పల్లకీ ఎక్కే యోగం పట్టింది.

శ్రీశుడు ఉండటానికి అవకాశం లేక కలకత్తాకు తిరిగి వెళ్లాడు. కమలమణి మటుకు గోవిందపురంలో ఉండిపోయింది...

కుందనందిని తనకు అసాధ్య మనుకున్న సుఖాన్ని చవిచూసి, ఆ సుఖానికి సారం లేదనుకున్నది. కాని సూర్యముఖి వెళ్ళిపోగానే తన సుఖానికి సారం ఉన్నదని ఆమె తెలుసుకున్నది. తనను కాపాడి రక్షించిన మనిషి తాను కారణంగా ఇల్లు విడిచిపోయింది.

ఆ సాయంకాలం నగేంద్రుడు పక్కమీద పడుకున్నాడు. కుంద అతనివైపున కూర్చుని విసురుతున్నది. ఇద్దరూ ఎవరి ఆలోచనలలో వా రున్నారు — నవవధూ వరులలో అది మంచిలక్షణం కాదు.

"నే నేంచేస్తే పరిస్థితి ఎప్పటిలా గవుతుందో!" అని లోపల అనుకుంటూ ఆ మాటల నామె పైకే అనేసింది.

నగేంద్రుడు చిరాకుగా, "ఇప్పు దేమయింది ? ఏం కావాలి ? నన్ను పెళ్లాడినందు కప్పుడే దిగులు పుట్టుకొస్తున్నదా ?" అన్నాడు.

"మిమ్మల్ని పెళ్ళాడి సుఖపడతానని నే నేమీ ఆశపడలేదు. సూర్యముఖి ఎలా తిరిగివస్తుందా అని ఆలోచిస్తున్నాను," అన్నది కుంద.

"ఆ మాట పైకి అనకు. నీ నోట సూర్యముఖి పేరు వింటే నాకు చాలా బాధగా ఉంటుంది. నీ మూలానే ఆమె వెళ్ళిపోయింది."

ఈ సంగతి కుందకు తెలుసు. కాని నగేంద్రు డామాట అనటం ఆమెకు చాలా బాధ కలిగించింది.

"నే నంటే అసహ్యమా ? అదృష్టహీనురాలిని. అంతేగాని నే నేమీ తప్పుచెయ్యలేదే. ఈ పెళ్ళి చేసినది సూర్యముఖే!" అనుకున్నది కుంద తన మనసులో.

చాలా సే పయాక, "ఏం, మాట్లాడవు, కోపమా ?" అన్నాడు నగేంద్రుడు.

"లేదు."

"లేదు అని ఊరుకున్నావే ? నామీద విశ్వాసం లేదా ?"

"ఎందుకు లేదూ ?"

"నువు న న్నెప్పుడూ ప్రేమించలేదులాగుంది."

"మనసారా ప్రేమించాను."



"మీరు వ్రాసిన నవల చాల బావుందండి ఎవరిచేత రాయించారు "

అది నిజమే సూర్యముఖి ప్రేమకు కుందనందిని ప్రేమకు ఏమీ తీసిపోదు కాని ఆమెది ముగ్ధస్వభావం మాట్లాడటం చేతకాదు అందుచేత నగేంద్రుడు నిజం తెలుసుకోలేక, "నన్ను మనసారా ప్రేమించినది సూర్యముఖే కోతికి హారం పనికి రాదు దానికి తగినది ఇనుపగొలుసే," అన్నాడు

కుంద దుఃఖం ఆపుకోలేక బయటికి వెళ్ళిపోయింది ఆమె దుఃఖాన్ని పంచుకునేటందు కెవరూలేరు ఈ పెళ్ళినేరం తనదే ననుకుని కుంద కమలమణికి తనముఖం చూపించలేదు ఇప్పు డామె కమలమణివద్దకు వెళ్ళింది

కమలమణి కుందను చూసి ఆనందం కనబరచలేదు ఆశ్చర్యపడిందిగాని మాట్లాడలేదు కుంద ఆమె దగ్గిర కూర్చుని ఏడవసాగింది కమలమణి ఆమెను ఊరడించటాని కేమీ అనలేదు అందుచేత కుంద తన శోకాన్ని దిగమింగుకున్నది ఏదో పని ఉన్నదని చెప్పి కమలమణి వెళ్ళిపోయింది

"అంత సుఖాని క్కూడా అంత మున్నది," అనుకున్నది కుంద

## ఫలం

తాను కుందనందినిని పెళ్ళాడటం పెద్ద పొరపా టనే నిర్ణయానికి వచ్చాడు నగేంద్రుడు అందువల్ల రత్నంలాటి సూర్యముఖిని పోగొట్టుకున్నాడు ఆమె

మామూలు రత్నంకూడా కాదు; 'కోహినూర్' రత్నం. ఆమె స్థానాన్ని కుంద ఎలా ఆక్రమిస్తుంది? తా నన లామెకు సూర్యముఖిస్థానం ఎందు కిచ్చినట్టు? భ్రమ!

అలాటి భ్రమతోనే ఆతను కుందమీది వ్యామోహాన్ని ప్రేమ అనుకునిఉండాలి. అది నిజంగా ప్రేమే అయితే, పదిహేను రోజులైనా జరగకముందే, "నే నీమెను ఎందుకు ప్రేమించాను? ఏం చూసి ప్రేమించాను? అన్న ప్రశ్నలు కలుగుతాయా? సూర్యముఖి ఎక్కడికి పోయింది? ఎలా తిరిగి దొరుకుతుంది?''

సూర్యముఖి వెళ్ళి నెల అయింది. ఆమె సమాచారం తెలియరాలేదు. నగేంద్రుడు ఆమెను వెతుక్కుంటూ పోవా లని నిశ్చయించాడు. కుందతో సంసారం చేస్తూ ఇంట ఉండటం అతనికి అసాధ్య మనిపించింది. కుంద చేసిన అపచారం ఏమీ లేదని తెలిసికూడా, తప్పు తనదే నని నమ్మికూడా అతను కుందముఖం చూసి సహించ లేకుండా ఉన్నాడు. అ స్తమానమూ ఆమెమీద విసుక్కుంటున్నాడు, ఆమె ఏడుస్తున్నది.

నగేంద్రుడు ఎస్టేటు దివానుకు అప్పగించి, కుందనందినికి హీరను దాసిగా పెట్టి ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు.

నగేంద్రుడి దివాణం కళాహీనమైపోయింది. సూర్యముఖిలేదు; నగేంద్రుడులేడు; కమలమణి అదివరకే కలకత్తాకు తిరిగివెళ్ళిపోయింది. నగేంద్రుడు వదిలివెళ్ళిన కుందనందిని, పిల్లలు ఆడుకుని పారేసిన బొమ్మలాగా కళాహీనంగా ఉన్నది.

నగేంద్రుడు బయలుదేరుతున్నా డని విని హీర తనను తిరిగి పనిలో పెట్టుకోమని అతన్ని వేడుకుని కుందకు పరిచారికగా చేరింది. దేవేంద్రుడి అందం ఆమె మన స్సును నిలువునా దహించేస్తున్నది. ఒక్కొక్కసారి ఆ వ్యామోహంలో ఆమె వివశురాలై, మళ్ళీ ఆతనిసంగతి జ్ఞాపకం తెచ్చుకుని మనస్సును నిగ్రహించు కుంటూండేది. మనసును నిగ్రహించటంలో హీరకు అసాధారణ సామర్థ్యం ఉంది. ఆమెకు పాపభీతీ, ధర్మచింతా లేకపోయినాకూడా తన స్త్రీత్వాన్ని చక్కగా కాపాడు కునేది.

ఆమె కుందనందినికి దాసీగా కుదరటానికి కారణం ఉన్నది. ఒకప్పు డామె ధనా శతో కుందకు రక్షకురా లయింది; ఆమెను తెస్తే తనకు బహుమానం వస్తుందనీ, నగేంద్రు డామెను పెళ్ళాడిన అనంతరం కుందచేతికి అంతులేని డబ్బు వస్తే, ఆమె నుంచి తాను తీసుకో వచ్చుననీ హీర ఆశపడింది. ఆమె అనుకున్నట్టు కుంద నగేం ద్రుడి భార్య అయింది గాని, ఆమెచేతికి చెప్పుకోదగినంత డబ్బేమీ రాలేదు.

ఇప్పుడు హీరకు ధనాశ కూడా లేదు. దేవేంద్రుడిపై తనకు గల ప్రేమ నిష్ఫలం కావటంచేత, తనకు అంతరాయంగా ఉండి, ఆ దేవేంద్రుడి ప్రేమకు పాత్రురా లయిన కుందపై హీరకు అసూయ పుట్టుకొచ్చింది. ఇంట్లో ఎవరూ లేకుండా వెళ్ళిపోవటం చేత, దేవేంద్రుడు వైష్ణవి వేషంలో వస్తాడేమో నని భయపడి, హీర అతను వచ్చే దారు లన్నిటికీ కంచెలు అడ్డం పెట్టించే ఉద్దేశం తోనూ, అహోరాత్రాలు కుందకు కాపలాగా ఉండే ఉద్దేశంతోనూ ఆమె పనిలో ప్రవేశించింది. ఇదంతా కుందనందిని క్షేమంకోరి కాదు — ఆమె మీది ఈర్ష్యచేత బలత్కారంగా దేవేంద్రు డామెను లొంగదీసుకుంటా డన్న భయంతో.

కుంద హీరలో కూడా మార్పు గమనించింది. పూర్వం హీర తనపై ప్రేమ ఉన్నట్టు ప్రవర్తించేది. ఇప్పు డదేమీలేదు. కుంద తన యజమానురాలైనప్పటికీ ఆమెను తన దాసీలాగా చూసేది. కుందది మృదు స్వభావం; హీరది తీవ్ర స్వభావం. అందుచేత కుంద తన దాసికి దాసిగా మసలుకోవలిసివచ్చింది.

ఇది గమనించి దివాను హీరను, "నిన్ను పనిలోనుంచి తీసేస్తున్నాను. ఇంటికి వెళ్ళిపో," అన్నాడు.

హీర మండిపడి, "నన్ను తీసెయ్యటానికి నీ వెవరు? అయ్యగారు నా కీ పని ఇచ్చారు. ఆయన వచ్చి పొమ్మంటేగాని పోను," అన్నది.

ఇంక మాట్లాడితే తన పరువు దక్క దని దివాను ఊరుకున్నాడు. హీరను లొంగదీయగలది సూర్యముఖి ఒక్కతే.

ఒకనాడు హీర అంతఃపురం సమీపంలో ఉన్న లతామండపంలో పడు కున్నది; యజమానురాలూ, యజమానీ వెళ్ళాక ఆ మండపానికి హీరే అధి కారిణి అయింది. పొద్దూకిపోయింది. ఆకాశాన నిండు చందమామ ప్రకాశిస్తున్నది. మంచి పూలవాసన వస్తున్నది.

---

అలాటి సమయంలో హీరకు అకస్మాత్తుగా ఆ లతామండపంలో దేవేంద్రుడు పొడగట్టాడు. అతను మారువేషంలో లేడు.

''ఏమి టీ సాహసం? ఎవరన్నా చూస్తే బడితెపూజ చెయ్యరూ?'' అన్నది హీర.

"హీర ఉండగా నా కేం భయం?" అంటూ అతను ఆమెపక్కన వచ్చి కూర్చు న్నాడు. హీర పారవశంలో మునిగిపోయింది.

"ఇక్కడి కెందుకు వచ్చావు? ఎవరికోసం వచ్చావో అది నీకు కనబడదు," అన్నది హీర.

"కనబడింది: నేను వచ్చింది నీకోసమే."

హీర ఈ ఇచ్చకాలు నమ్మక నవ్వుతూ, "నాకంత అదృష్టం లేదు ఉంటే మిమ్మల్ని చూసి సంతోషించటాని కిన్ని పాట్లెందుకు? ఇక్కడ ఎవరైనా చూస్తా రేమో, ఏకాంతస్థలానికి పోదామా?'' అన్నది

'ఎక్కడికి పోదాం?'

"నిర్భయంగా ఉండేచోటికి, మీ తోటలోకి "

'నన్నుగురించి నువు భయపడ నవసరంలేదు "

"నిన్నుగురించి కాకపోతే నన్ను గురించైనా భయపడాలిగా! నీ పక్కన కూర్చునిఉండగా ఎవరన్నా చూస్తే నా గతి ఏంకాను?''

"అయితే పద మీ కొత్త యజమానురాలితో ఒక్కసారి మాట్లాడి పోతేనేం?"

''ఆమె నెలా చూడటం?'

"నీ దయ ఉంటే అంతా సాధ్యమే "

''నువ్విక్కడనే ఉండు నే నామెను తెస్తాను ' అంటూ హీర అక్కడినుండి బయలుదేరి, కొంతదూరం వెళ్ళి ఒక చెట్టుచాటున నిలబడి బిగబట్టిన గొంతుకతో ఇన్ని కన్నీళ్ళు కార్చి అక్కడినుంచి ద్వారం వద్దకు వెళ్ళి ద్వారపాలకులతో, "పూలతోటలోకి దొంగ వచ్చాడు వెంటనే వెళ్ళండి ' అన్నది

నలుగురు మనుషులు కర్రలు తీసుకుని తోటలోకి పరుగెత్తారు దేవేంద్రుడు వాళ్ళను దూరానే చూసి, లతామండపం నుంచి కిందికి ఒక్కదూకు దూకి పారిపో సాగాడు వాళ్ళు అతని వెంటబడి పట్టుకుని దేహశుద్ధి చేసి పంపేశారు

*　　*　　*

ఒకనాటి రాత్రి కాశీకి వెళ్ళే మట్టిరోడ్డుమీద జోరున వర్షం కురుస్తూండగా సూర్య ముఖి స్పృహదప్పి పడిపోయి ఉంది అటుగా వస్తున్న ఒక వయసు మళ్ళిన బ్రహ్మచారికి కనబడింది అతను కావి బట్టలూ, కమండలమూ ధరించి ఉన్నాడు నెత్తిన వెంట్రుక లున్నాయి ఆ బ్రహ్మచారి ఆమె నెత్తుకుని సమీప గ్రామానికి తీసుకుపోయి హీరమణి అనేఆమె ఇంట చేర్చాడు

హీరమణి ఉష్ణోపచారం చేసి, తాగటాని కిన్ని పాలిచ్చిన మీదట సూర్యముఖికి స్పృహ వచ్చి కళ్ళు తెరచి, "నే నెక్కడ ఉన్నాను?' అని అడిగింది హీరమణికి తన పేరు చెప్పింది

ఈ స్థితిలో సూర్యముఖి వయసుకూడా తెలియటం లేదు ఆమె కళ్ళు లోతుకు పోయాయి తైల సంస్కారం లేక జుట్టు అట్ట కట్టుకుపోయింది ఆమె ధరించిన బట్టలు మట్టికొట్టుకునిఉన్నాయి ఆమె చావటానికి సిద్ధంగా ఉన్నదానిలా కనబడింది




బ్రహ్మచారి పేరు శివప్రసాదశర్మ. అతను సూర్యముఖి ఏ వ్యాధితో బాధ పడుతున్నదీ తెలుసుకోలేక వైద్యుణ్ణి పిలిపించాడు. వైద్యుడు వచ్చిచూసి, ఆమె ఉబ్బసంతో బాధ పడుతున్నదనీ, దానిమీద జ్వరం వచ్చిందనీ చెప్పి, మందిచ్చి వెళ్ళాడు.

తరువాత బ్రహ్మచారి హీరమణిని ఏదో పనిమీద పంపేసి సూర్యముఖి సమీపంగా వచ్చి కూర్చుని ఆమె విషయ మంతా తెలుసుకోవటానికి ఉపక్రమించాడు.

'నా కోసం ఎందుకు శ్రమపడుతున్నారు? నన్ను కాపాడటం నిరుపయోగం? పడిపోయినచోటనే నన్ను చచ్చిపోనివ్వవలసింది. చావు వచ్చేస్తున్నదని ఎంతో సంతోషించాను" అన్నది సూర్యముఖి.

"అమ్మా, ఆత్మహత్య మహాపాతకం. అయినా నీ కంత దుఃఖ మెలా కలిగింది. నిన్ను చూస్తే గొప్ప ఇంటిదానవుగా కనబడుతున్నావు. నీ సంగతి నాకు చెప్పగూడదా? నేను నీ కొడుకులాటివాణ్ణి" అన్నాడు బ్రహ్మచారి.

సూర్యముఖి అతనితో చచ్చేముందు తన భర్త నొక్కసారి చూడా లని ఉన్నదని చెప్పింది. తన భర్త చిరునామా బ్రహ్మచారికి తెలిపింది.

బ్రహ్మచారి నగేంద్రుడికి ఉత్తరం రాశాడు.

"నన్ను మీ రెరగరు. మిమ్మల్ని నే నెరగను. మీ భార్య సూర్యముఖి మధుపురంలో హీరమణి అనే వైష్ణవి ఇంట జబ్బుపడిఉన్నది. చికిత్స జరుగుతున్నది,

గాని, ఆమె జీవించే ఆశ లేదు మిమ్మల్ని ఒక్కసారి చూసి ప్రాణాలను విడవా లనే ఆశతో ఉన్నది ఆమె కోరికపైననే మీ కీ ఉత్తరం రాస్తున్నాను మీకు రావా లనే ఉద్దేశం ఉంటే రాణీగంజి మార్గాన ఇక్కడికి రండి రాణీగంజిలో ఉండే శ్రీమాన్ మాధవచంద్రగోస్వామి మీకు మధుపురానికి దారి చెప్పగలరు వచ్చే పక్షంలో త్వరగ రావటం మంచిది "

ఈ ఉత్తరం గోవిందపురం చేరేసరికి నగేంద్రుడు దేశాటనకు బయలుదేరిఉండటం చేత దాన్ని దివాను తీసిఉంచుకుని, నగేంద్రుడు కాశీ చేరినట్టు రాయగానే, మిగిలిన ఉత్తరాలతోబాటు దాన్నికూడా కాశీలో అతని చిరునామాకు పంపాడు

ఉత్తరం చూస్తూనే నగేంద్రుడు రాణీగంజికి బయలుదేరాడు

దేవేంద్రుణ్ణి భటులచేత కొట్టించినందుకు హీర మొదట సంతోషించి తరువాత భయపడింది అతనూ ఈ అవమానం జరిగినందుకు తనపైన పగబట్టుతాడు, ఇక ఎన్నటికీ తనపట్ల సుముఖుడు కాడు తన ఆశ లన్నీ కూలిపోవలిసిందే

దేవేంద్రుడు హీరను శిక్షించటానికి ఉపాయా లలోచించసాగాడు అత నొకనాడు మాలతిని పిలిచి హీరను రమ్మని చెప్పమన్నాడు

హీర రెండు రోజులు జంకి, చివరకు దేవేంద్రుడి ఇంటికి వెళ్ళింది అతను హీరపైన ఆగ్రహించలేదు పాత విషయాలు ప్రస్తావించనుకూడా లేదు, సాలె పురుగు ఈగకోసం గూడు అల్లినట్టుగా ఆమెతో తియ్యటిమాట లాడాడు ఆ మాటలకు హీరకు మతిపోయింది ప్రేమ చూపటంలో దేవేంద్రుడే సమర్థు డనుకున్నది

అతను మాటలు చాలించి, తాగిన ఉత్సాహంలో పాటలు పాడాడు హీర ఆనం దాశ్రువులు రాల్చింది దేవేంద్రుడు తన పైబట్టతో ఆమెకళ్ళు తుడిచాడు హీర శరీరం పులకించింది తరవాత అతను సరస నర్మ సంభాషణలతో హీరను మరింత కరిగించాడు తనతోబాటు ఆమెచేతకూడా పాడించాడు

హీరకు స్వర్గం ఎదురుగా ఉన్న ట్టనిపించింది మామూలుగా తన మనస్సును నిగ్రహించగలది అయికూడా ఈసారి ఆ పని చెయ్యలేకపోయింది

నగేంద్రుడు మధుపురం చేరేసరికి వర్షాకాలం వెళ్ళి చలికాలం వచ్చేసింది అతను బ్రహ్మచారి గురించి విచారించాగా బ్రహ్మచారి ఊళ్ళో లేడనీ, ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదనీ అన్నారు అంతకంటే దారుణమైన వార్త అతనికి వైద్యుడి ద్వారా తెలియవచ్చింది హీరమణి ఇంట్లో ఉండే సూర్యముఖి అనే ఆమెకు జబ్బు చాలావరకు నయమైన సమయంలో హీరమణి ఇల్లు కాస్తా కాలి




పోయింది సూర్యముఖి ఇంటితోబాటు కాలిపోయింది, హీరమణి ఎటో వెళ్ళిపోయింది ఎటు వెళ్ళిందో ఎవరికీ తెలియదు

సూర్యముఖి ఇంటితోబాటు కాలిపోయిందని వినగానే నగేంద్రుడు కుర్చీమీది నుంచి పడిపోయాడు పడటంలో అతని తలకు బలమైన దెబ్బ తగిలింది ఆ దెబ్బ కతనికి స్పృహ తప్పింది

వైద్యు డతనికి చికిత్స చేశాడు ఆయన సూర్యముఖికి వైద్యం చేసినవాడే

ఆ సాయంకాలం నగేంద్రుడు మధుపురంనుంచి పల్లకిలో ఎక్కి వెళ్ళిపోతూ, 'అంతా పూర్తి అయింది," అనుకున్నాడు ఇక అతను గోవిందపురంలో ఉండి ఇల్లూ వాకిలీ చూసుకోవటం అసంభవం తన కున్న జమిందారీ, ఇళ్ళు, స్వార్జిత మైన స్థిరచరాస్తులూ జాబితా వేసి, వాటన్నిటినీ సతీశుడికి దానం చేస్తున్నట్టు ప్లీడరు చేత పత్రం రాయించాలి చరాస్తి అంతా కమలమణికి పంపాలి ఒక్కసారి సూర్యముఖి పక్కమీద పకునిడు ఏడువాలి ఆమె నగలన్నీ మూట గట్టి ఎవరికీ ఇవ్వకుండా, తనవద్దనే ఉంచుకుని, అవసాన సమయంలో వాటిని చూసుకుంటూ కన్ను మూయాలి అంతదాకా ఎక్కడో అజ్ఞాతంగా, తన ముఖ మెవరికీ చూప కుండా బతకాలి

ముప్ఫైమూడేళ్ళు నిండని నగేంద్రుడు జీవితంలో అన్ని రుణాలూ తీరిపోయి ఇలాటి నిర్ణయాలు చేసుకున్నాడు తన జీవితం ఇలా పాడైపోవటానికీ, సూర్య

ముఖి దిక్కులేని చావు చావటానికీ, అన్ని దుష్పరిణామాలకూ కారణం తానే అని కూడా అతను రూఢి చేసుకున్నాడు...

రాత్రి ఎనిమిది గంటలప్పుడు శ్రీశుడు ఒంటరిగా సావడిలో కూర్చునిఉండగా నగేంద్రుడు వచ్చి తాను తెచ్చిన మూట ఒకచోట పెట్టి కుర్చీమీద కూర్చున్నాడు. అతని ముఖం చూస్తే శ్రీశుడి కెందుకో భయం వేసింది. నగేంద్రుడు కాశీనుంచి ఒక ఉత్తరం లోగడ రాశాడు: మధుపురంనుంచి బ్రహ్మచారి ఒకడు ఉత్తరం రాశా డనీ, తాను అక్కడికి పోతున్నా ననీ అందులో చెప్పాడు. ఆ తరవాత ఏమయిందీ శ్రీశు డెరగడు.

శ్రీశుడు నగేంద్రుడి పక్కన కూర్చుని, "నగేన్, ఎందు కలా మౌనంగా ఉన్నావు. మధు పురానికి వెళ్ళలేదా?" అని అడిగాడు.

"వెళ్ళాను."

"బ్రహ్మచారిని చూశావా?"

"లేదు."

"సూర్యముఖి వార్త ఏమైనా తెలిసిందా? ఇప్పు డెక్కడ ఉన్నది?"

"స్వర్గంలో!" అంటూ నగేంద్రుడు పైకి చూపాడు.

ఇద్దరూ కాస్సేపు మౌనంగా కూర్చున్నాక నగేంద్రుడు, "నీకు స్వర్గంలో నమ్మకం లేదు — స్వర్గం ఉన్నదనే నా నమ్మకం,'' అన్నాడు.

సూర్యముఖి ఎక్కడా లేదనుకోవడం బాధగా ఉండటంచేత నగేంద్రుడికి స్వర్గంలో నమ్మకం కుదిరిం దని శ్రీశుడు గ్రహించాడు.

సూర్యముఖి పోయిం దని విని కమలమణి మట్టిలో పొర్లి ఏడిచింది.

నగేంద్రుడు తన సంగతి అంతా వివరంగా చెప్పినాక శ్రీశుడు అతనితో, "నీకు దారిలో బ్రహ్మచారి తగిలిఉండవలసిందేనే. అతను నిన్న ఈ కలకత్తాలోనే ఉన్నాడు. నీకోసం మధుపురం బయలుదేరివెళ్ళాడు. నిజంగా అత నెంత మంచివాడు! నీకు రాసిన ఉత్తరానికి జవాబు రాకపోయేసరికి నీకోసం గోవిందపురం వెళ్ళాట్ట. ను వ్వక్కడ లేవు. కాశీలో ఉన్నా వంటే కాశీకి వెళ్ళాడు. కాశీనుంచి మళ్ళీ గోవిందపురానికి వచ్చి, అక్కడినుంచి ఇక్కడికి వచ్చాడు. మధుపురంలో తప్పక కనిపిస్తా వని అక్కడికి వెళ్ళాడు. రాణిగంజిలో అతను నీకు కనిపించవలసిందే," అన్నాడు.



బ్రహ్మచారి శ్రీశుడితో సూర్యముఖి ఇల్లు వదిలినది మొదలు ఆమె ఏమేమి కాష్టాలు పడినదీ వివరంగా చెప్పాడు వాటి నన్నిటినీ నగేంద్రుడు శ్రీశుడిచేత చెప్పించుకున్నాడు వింటున్నకొద్దీ పిచ్చివాడిలాగా అయిపోయాడు

సూర్యముఖి ఇల్లు విడచినతరవాత త్వరలోనే ఒక బ్రాహ్మణకుటుంబాన్ని కలుసుకున్నది వారు కాశీ వెళుతున్నారు వారు కలకత్తాదాకా పడవపైన వచ్చారు దారిలో నదీతీరాన ఒక చెట్టుకింద పడిఉన్న సూర్యముఖిని బ్రాహ్మడు చూశాడు వారివెంట సూర్యముఖి బర్హి అనే చోటిదాకా వచ్చింది ఆపైన సూర్యముఖి వారివెంట వెళ్ళక, తన భర్తను చూడాలని బుద్ధిపుట్టి కాలినడకను ఇంటికి తిరిగివస్తూ దారిలో పడిపోయింది ఆ స్థితిలో బ్రహ్మచారి ఆమెను చూసి మధుపురం చేర్చాడు

ఈ వివరాలు విని నగేంద్రుడు ఘోరసంతాపం పొందాడు శ్రీశుడాతని ఓదార్చ యత్నించాడు

* * *

అమూల్యమైన తన స్త్రీత్వాన్ని దేవేంద్రుడి ప్రేమకు తాకట్టుపెట్టిన హీర ఆ ప్రేమ గుడ్డిగవ్వ విలవచెయ్యదని తెలుసుకున్నది స్వచ్ఛమైన ప్రవాహంలాగా కనిపించినది

కాస్తా ఆమె దిగేసరికి బురదరొంపి అని తెలిసిపోయింది ఆమె ప్రణయం అక్షరాలా మూడునాళ్ళ ముచ్చట అయింది ఆడుకొనే కుర్రవాడు పచ్చికాయను కొరికి అవతల పారేసినట్టుగా దేవేంద్రుడు హీరను త్యజించేశాడు

దాసిగానన్నా ఉండని మ్మని హీర అతన్ని వేడుకున్నది "కుందనందినిని చూపిస్తేనే నేను నీతో మాట్లాడేది లేనిపక్షంలో నీదారిన నువ్వు వెళ్ళు నీ గర్వానికి తగిన ప్రాయశ్చిత్తం ఇదే ' అన్నాడు దేవేంద్రుడు

హీర కోపోద్రేకంతో అతన్ని నానామాటలూ అన్నది అతను హీరను కాలితో తన్ని తోటలోనుంచి బయటికి గెంటాడు

హీర ఒక అంటరానివాడివద్దకు వెళ్ళి తన ఇంట ఎలుక లున్నాయని చెప్పి అయిదు రూపాయలకు వాడివద్ద విషం కొని, ఇంటికి వచ్చింది కాని తీరా విషం మింగి చద్దా మనుకునేసరి కామెకు చావబుద్ధి కాలేదు ' నన్ను కాలితో తన్నినవాణ్ణి చంపక నే నెందుకు చావాలి? ఈ విషాన్ని తినవలిసింది వాడు। లేదా వాడి ప్రేయసి కుందనందిని వా రిద్దరిలో ఎవరో ఒకరు చచ్చాక నేను చస్తాను అని హీర అనుకున్నది

ఆమెలో వెర్రిలక్షణాలు మొదలయాయి - నవ్వుతుంది అంతలో ఏడుస్తుంది కేకలు పెడుతుంది ఒక్కసారి మూర్ఛపోతుంది

హీర అమ్మమ్మ తన మనమరాలికోసం మందు తీసుకురావటానికి కర్ర తాటించు కుంటూ వైద్యుడింటికి బయలుదేరింది కొంటెపిల్లకాయలు ఏవేవో పాటలు పాడి ఏడిపిస్తూ ఆమె వెంటపడ్డారు వాళ్ళనూ, వాళ్ళ తల్లిదండ్రులనూ యమలోకానికి వెళ్ళమని ఆశీర్వదిస్తూ నగేంద్రుడి దివాణంలో ఉన్న వైద్యు డింటికి వచ్చి "వైద్యుడుగా రున్నారా?' అన్నది

'నేనే వైద్యుణ్ణి ఏం కావాలి' అని వైద్యు డడిగాడు

''కళ్ళు కనపడవు, నాయనా ఒకటి రెండు తక్కువగా డెబ్భై, యెనభైఏళ్ళు। నవాబు శ్రీరంగపట్టణాన్ని కొల్లగొట్టేనాటికి ముప్ఫయి ఏళ్ళదాన్ని నా కడుపుతీపి ఎలా చెప్పుకునేది ఒక కొడుకుండేవాడు వాణ్ణి చంపుకున్నాగదా' ఒక మనమరా లున్నది అదికూడా ' అంటూ ముసలిది పెద్దరాగం తీసింది

"ఇంతకూ నీ కేం కావాలి?" అని వైద్యు డడిగాడు

కాని ముసలిది తన జీవితమూ హీర జీవితమూ దాని తల్లిదండ్రుల జీవితమూ ఏకరువు పెట్టింది అందులో సగం శోకాలు। అతి కష్టంమీద ముసలిది వచ్చినది తన మనమరాలి జబ్బుగురించి అని డాక్టరు అర్థం చేసుకోగలిగాడు

"నీ మనుమరాలికి హిస్టీరియా అయుంటుంది " అన్నాడు వైద్యుడు

"అయితే, బాబూ, ఆ ఇష్టరసానికి మందున్నదా ? అని ముసలిది అడిగింది

"లేకేం ఆమెకు కాస్త కాక తెప్పించాలి ముందు ఈ కేస్టరాయిలు తీసుకు పోయి రేపొద్దున ఇయ్యి తరవాత చికిత్స చేద్దాం '

ముసలిది ఆమదంసీసా పట్టుకుని ఇంటికి వస్తుండగా దారిలో ఎరిగినమనిషి కనిపించి "ఏమిటమ్మమ్మా, అదీ ? ' అన్నది

'హీరకు ఇష్టరసం వచ్చిందిటే ! అందుకు మందియ్యమంటే డాక్టర్ కష్టరస మిచ్చాడు కష్టరస మిస్తే ఇష్టరసం పోతుందిటే ?" అని ముసలిది అడిగింది

"పోతుందేమో మరి సరేగాని అమ్మమ్మా నీ మనమరాలికి ఇంతగా రసం హెచ్చటం దేని కంటావు ? " అని ఆ మనిషి అడిగింది

ముసలిది కొంచెం ఆలోచించి "వయస్సుకాదుటే ? అన్నది

"అయితే, చూడూ, దాని కింత చిత్రమూల రస మిచ్చిచూడు ! దాంతో ఎంతేసి రసాలూ పోతాయిట ! '

ముసలిది ఇంటికి వెలుతూనే, తన మనమరాలికి కాక తెప్పించాలని డాక్టరన్న మాట జ్ఞాపకం వచ్చి కుంపటి అంటించి తెచ్చి హీరముందు పెట్టింది

"ఏమిటిది ?" అని హీర అడిగింది

"నీకు కాస్త కాక చెయ్యాలని వైద్యుడన్నాడులేవే " అని ముసలిది సమాధానం చెప్పింది

నగేంద్రుడి దివాణమంతా భీభత్సంగా ఉంది ఎక్కడ చూసినా బూజు, దుమ్ము ఎక్కడిదక్కడే ఉంది తోటలో ఎక్కడ చూసినా ఎండుటాకులు, కొలనునిండా నాచు, భాండాగారంలో ఎలుకలు పెంపుడు పక్షులను పిల్లులు తినేశాయి కుక్కలు కొన్ని చచ్చాయి కొన్ని పారిపోయాయి కొన్ని కట్టేసినచోటనే చైతన్యం లేకుండా పడి ఉన్నాయి గుర్రాలను చూసేవాళ్ళు లేరు అంతటా పెద్దమ్మ నాట్యం చేస్తున్నది

ఇంట్లో కుందనందిని ఉన్నది ఎవరైనా తనను రాణీ" 'అని పిలిస్తే వేళాకోళం చేస్తున్నా రనుకుంటుంది ఏదైనా చెప్పటానికి దివాను వస్తే ఆమె గుండెలు దడదడ లాడేవి నగేంద్రుడివద్దనుంచి ఒక్క ఉత్తరం లేదు అతను దివానుకు రాసే ఉత్తరాలు తీసుకుని చదివి, తిరిగి ఇవ్వకుండా దాచుకునేది

ఆమె నగేంద్రుణ్ణి మొదటినుంచీ ఎంతో ప్రేమించింది ఆ సంగతి ఆమె ఎవరికీ చెప్పలేదు ఆ ప్రేమ ఇప్పు డామె హృదయాన్ని బద్దలుకొట్టేస్తున్నది జరిగిన

అనర్థా లన్నిటికీ ఆమే కారణ మని అందరూ అనుకుంటున్నారు. నగేంద్రుడుకూడా అలా అనుకునే ఆమెను బహిష్కరించి ఉండవచ్చు. కాని ఆమె చేసిన పాపం ఏమిటి ?

కాని ఒక్కొక్కసారి, తానే సూర్యముఖి కష్టాలకు మూలకారణ మని కుంద అనుకునేది. తనకు చావు వస్తే బాగుండు ననిపించేది. సూర్యముఖి తిరిగివచ్చాక చచ్చిపోదా మనికూడా ఆమె అనుకున్నది. సూర్యముఖి చచ్చిపోయిందన్న సమాచారం ఆమె కందలేదు...

దానపత్రాలు వగైరా కలకత్తాలోనే తయారు చేయించి వాటిని రిజిష్టరు చేయించ టానికి నగేంద్రుడు కాలినడకన గోవిందపురానికి బయలుదేరుతూ, తన బావమరిది శ్రీశుణ్ణి పడవమీద వచ్చెయ్య మన్నాడు.

శ్రీశుడివెంట కమలమణికూడా బయలుదేరింది.

కమలమణి మళ్ళీ కనిపించగానే కుందనందినికి ఆకాశాన చుక్క పొడిచిన ట్లయింది. సూర్యముఖి వెళ్ళిపోయాక కమలకు కుందపైన పట్టరాని ఆగ్రహం కలిగి, ఆమె ముఖం చూడటంకూడా మానేసింది. కాని ఇప్పుడు వాడిపోయిన కుందనందిని ముఖం చూసి కమలమణికి కోపం పోయి, దుఃఖం వచ్చింది. వెనకగా నగేంద్రుడు వస్తున్నా డని వినగానే కుందముఖం వికసించింది. కాని సూర్యముఖి చచ్చిపోయిం దని విని ఆమె ఏడ్చింది.

కమలమణి ఆమె నోదార్చింది.

శ్రీశుడు బయటా, కమలమణి ఇళ్ళలోనూ శుభ్రం చేయించారు. యుద్ధానికి బయలుదేరే సైన్యంలాగా పరిచారిక లందరూ చీపురుకట్టలు పట్టుకుని ఇల్లు శుభ్రం చెయ్యటానికి ఉపక్రమించారు. ఇంటికి తిరిగి కళ వచ్చింది.

సాయంకాలంవేళ నగేంద్రుడు ఇంటికి వచ్చి చేరాడు. అతని రాక అందరికీ ఆనందం కలిగించింది — ఒక్క కుందకు తప్ప. అత నామెను చూడబోలేదు.

రాత్రి అందరూ పడుకుని నిద్రపోయాక నగేంద్రుడు సూర్యముఖి పడకటింట పడుకోవటానికి వెళ్ళాడు. కాని పడుకోలేక అతను ఏడవనారంభించాడు. అదిఎంతో డబ్బు ఖర్చుచేసి, ఎంతో అందంగా కట్టి అలంకరించిన ఇల్లు. గోడలకు నిలువు టద్దాలూ, మంచిమంచి చిత్రువులూ ఉన్నాయి.

అర్థరాత్రి దాటింది. నగేంద్రుడు సోఫాపైన కూర్చుని ఏడుస్తున్నాడు. దీపం దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. బయటగాలీ, వానా ప్రచండంగా ఉన్నాయి. అతను చుట్టూ కలయజూస్తూ గతాన్ని స్మరించుకోసాగాడు.



చము రయిపోయి దీపంకాంతి హీనమైపోయింది అది పూర్తిగా ఆరిపోనున్న సమయంలో నగేంద్రుడికి వాకిలివద్ద ఒక లస్పష్టాకారం – ఆడదాని నీడలాటిది – కనబడింది అతను ఆ ఆకారాన్ని పరీక్షగా చూసేసరికి అది సూర్యముఖి పోలికగా కనబడి, అతని శరీరం కంపించింది

అతను వాకిలికేసి వెళ్ళాడు ఆ నీడ అదృశ్య మయింది అప్పుడే దీపంకూడా ఆరి పోయింది అతను కెవ్వున అరిచి మూర్ఛపోయాడు

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి అంతటా గాఢాంధకారంగా ఉంది తన తల కింద దిండులాటిది ఉన్నట్టు గ్రహించి అతను తడివిచూచుకున్నాడు ఒకస్త్రీ తొడపై తన తల ఉన్నట్టు అతనికి అర్థ మయింది

'ఎవరు నువు ?' అని అత నడిగాడు

జవాబు రాలేదు కాని ఒకటి రెండు కన్నీటిచుక్కలు వేడిగా అతనిపైన బడ్డాయి అతను ఆ మనిషి తొడమీదనుంచి తల ఎత్తి లేచికూర్చున్నాడు అతనితోబాటు ఆ స్త్రీ కూడా లేచి, వాకిలికేసి వెళ్ళింది ఆ నడక చూస్తే కుందలాగాలేదు

అలా వెళ్ళిన స్త్రీ తిరిగివచ్చి అతనికాళ్ళపైనపడి, డగ్గుత్తికతో, "మీరు నాతో మాట్లాడాలి లేకపోతే చచ్చిపోతాను," అన్నది

ఈ మాట వింటూనే అతను లేచి ఆమెను పట్టుకోబోయి. మూర్ఛపోయాడు ఆమె అతనితలను తన ఒడిలో పెట్టుకుని కూర్చున్నది

అతనికి మళ్ళీ తెలివివచ్చేసరికి బయట తెల్లవారింది కిటికీలోనుంచి ఎండకూడా లోపలికి వస్తున్నది అతను కళ్ళు తెరవకుండానే 'ఎప్పుడు వచ్చావు కుందా? నాకు తెల్లవార్లూ కలలో సూర్యముఖే! ఆ కలలో నేను సూర్యముఖి తొడమీద తల పెట్టుకుని పడుకున్నాను నువు సూర్యముఖి వైతే ఎంత బాగుండేది!" అన్నాడు

"ఆ నిర్భాగ్యురా లంటే మీకంత ఆనంద మైతే నేనే సూర్యముఖిని"

అతను లేచికూర్చుని, కళ్ళనీళ్లు తుడుచుకుని మాటిమాటికీ చూస్తూ "నాకు పిచ్చెత్తిందా? లేక సూర్యముఖి బతికి ఉన్నదా? లేదు నాకు పిచ్చెత్తింది!'' అంటూ కింద పడుకుని ఏడవసాగాడు

''లేవండి! నేను చావలేదు నా దుఃఖా లన్నీ తీరిపోయాయి మీ సేవ చేసు కుందా మని వచ్చాను." అన్నది సూర్యముఖి

అతను లేచి ఆమెను కౌగిలించుకున్నాడు ఇద్దరూ కలిసి ఎంతో సేపేడ్చారు ఏడవటంలోకూడా ఎంతసుఖం ఉంటుందో!

జరిగిన వాస్తవ విషయాలు నగేంద్రుడికి సూర్యముఖిద్వారా తెలిశాయి వైద్యుడు పొరపడ్డాడు ఆయన చికిత్సతో సూర్యముఖి పూర్తి ఆరోగ్యం పొందింది ఆమె గోవిందపురానికి వెళ్లా లని ఆత్రపడి ఆమాట బ్రహ్మచారితో చెప్పింది ఆమె వెంట అతనుకూడా రావటాని కెలాగైతేనేం ఒప్పుకున్నాడు ఒకరోజు సాయంకాలం భోజనం చేసి సూర్యముఖి అతనివెంట గోవిందపురానికి బయలుదేరింది గోవింద పురంలో నగేంద్రుడు లేడు సమీపాన ఉన్న ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణులఇంట సూర్యముఖిని ఉంచి, బ్రహ్మచారి నగేంద్రుణ్ణి వెతుక్కుంటూ బయలుదేరాడు అతను కలకత్తా వెళ్ళి శ్రీశుడిద్వారా నగేంద్రుడు మధుపురానికి వెళ్ళినట్టు తెలుసుకుని అక్కడికి వెళ్లాడు సూర్యముఖి వెళ్ళిపోయినరాత్రే హీరమణి ఇల్లు కాలిపోయింది దానితో బాటు హీరమణికూడా కాలిపోయింది అయితే ఆ కాలిపోయిన మనిషి సూర్యముఖి అనే రోగిష్టి దనీ, ఆరోగ్యంగా ఉన్న హీరమణి తప్పించుకుని వెళ్ళిపోయిం దనీ అంతా అనుకున్నారు అమాటే వైద్యుడుకూడా నగేంద్రుడితో చెప్పాడు ఇదంతా బ్రహ్మచారికి మధుపురంలో తెలియవచ్చింది ఈ దుర్వార్త విని నగేంద్రుడు బాధ పడతాడేమోనని బ్రహ్మచారి అతనికోసం ఆత్రంగా వెతికాడు ఈలోపుగా నగేంద్రుడు ఇంటికి తిరిగివస్తున్నా డన్న విషయం గ్రామంలో ఉంటున్న సూర్యముఖికి తెలిసింది కిందటిరోజు ఆమె గ్రామంనుంచి నడిచివచ్చి, ఇవాళ నగేంద్రుడు

వస్తున్నా డని తెలిసి వెళ్ళిపోయింది ఆమె గడిచినరాత్రి జాము పొద్దుపోయి మళ్ళీ వచ్చి తెరిచిఉన్న కిటికీలగుండా లోపల ప్రవేశించింది ఆమెను ఎవరూ చూడలేదు ఆమె మెట్లకింద దాగిఉండి అతను లోపలికి వెళ్ళినాక మెట్లెక్కివచ్చి చూసింది వాకిలి తెరిచేఉన్నది అతను నెత్తిన చెయ్యిపెట్టుకుని కూర్చుని ఉండటం కని పించింది, కాని దగ్గిరికి రావటాని కామె భయపడింది ద్వారంవద్దనుంచి అతన్ని చూస్తూ తృప్తిపడింది ఆ సమయంలోనే అత నామెను చూసి మూర్ఛపోయాడు

* * *

సూర్యముఖిపడకటింట నగేంద్రుడు సూర్యముఖిని తలచుకుని దుఃఖిస్తున్న సమయంలోనే కుంద దిండుపై తల పెట్టుకుని నగేంద్రుడికోసం ఏడ్చింది అదివర కల్లా ఆమె తన భర్తను చూడాలన్న ఆశతో బతికిఉండగోరింది అతను వచ్చాడు, గాని ఆమెకు కనిపించలేదు ఇప్పుడిక దేనికోసం బతికిఉండాలో ఆమెకర్థంకాలేదు.

తెల్లవార్లూ శోకించి కుంద తెల్లవారుజామున చిన్న కునుకు తీసింది ఆ నిద్రలో ఆమెకు ఒక పీడకల వచ్చింది

నాలుగేళ్ళక్రితం ఆమెతండ్రి చచ్చిపోయినప్పుడు కలలో కనిపించిన తల్లిలాగే ఒక కాంతివంతమైన స్త్రీమూర్తి వచ్చి ఆమె తలవైపున నిలబడింది ఆమె ముఖం హీరముఖంలా గున్నది, కాని ఆమె కుందతల్లే 'కుందా, అప్పుడు నామాట విని నాతో వచ్చావుకావు. ఇప్పుడు దుఃఖం అనుభవిస్తున్నావు నేను మళ్ళీ వస్తా నని చెప్పాను, వచ్చాను సంసారంతో సంతృప్తి కలిగినట్టయితే నాతోకూడా రా!" అన్న దామె

కుంద ఏడుస్తూ, "అమ్మా, నన్ను తీసుకుపో, నే నిక్కడ ఉండలేను," అన్నది

"అయితే బయలుదేరు" అంటూ ఆమెతల్లి మాయమయింది కుంద మేలుకుని, తన కల నిజం కావా లని దేవుణ్ణి వేడుకున్నది

తెల్లవారుతూనే హీర పనిలోకి వచ్చింది కమలమణి వచ్చినప్పటినుంచీ హీర కుందవిషయంలో చాలా విధేయతగా ఉంటున్నది అల్పసంతోషి అయిన కుంద ఈ మార్పు చూసి ఎంతో సంతోషించిందేగాని హీరను కొంచెంకూడా శంకించలేదు

"ఎందుకమ్మా ఏడుస్తున్నావూ?" అని హీర కుంద నడిగింది కుంద జవాబు చెప్పలేదు "అయ్యయ్యో తెల్లవార్లూ ఎడ్చినట్టున్నదే," అన్న దామె, తడిసి పోయిన దిండు చూసి

దానిక్కూడా కుంద జవా బివ్వలేదు

"బాబుగా రేమన్నా అన్నారా? నాకు చెప్పకూడదా!" అన్నది హీర

"ఏమీ అనలేదు  ఆయన నన్ను చూడలేదు  అని కుంద దుఃఖం ఆపుకోలేక పోయింది

హీర లోపల సంతోషిస్తూ, "ఈ మాత్రాని కేడవాలా? ఆలస్యంగా వచ్చి చూస్తారు అంతేకద, నీ కన్న పెద్దదుఃఖం ఉన్నవా శ్శెందరులేరు నా కున్న దుఃఖమే నీ కుంటే ఆత్మహత్య చేసుకునిఉందును!" అన్నది

'ఆత్మహత్య అన్నమాట వినగానే కుందకు అమంగళం స్ఫురించి ఒళ్ళు జలదరించింది

"నా దుఃఖం ఏమిటో చెబుతాను విను నే నొకణ్ణి నా ప్రాణంకన్న ఎక్కువగా ప్రేమించాను అతను నన్ను పెళ్ళాడలేదు యజమానురాలివి నీదగ్గిర దాయట మెందుకు, చేసినపాపం చెప్పేయ్యటమే మంచిది '' అన్నది హీర

అయితే కుంద ఈ మాటలు వినటంలేదు "ఆత్మహత్య" అన్నమాట చెవిలో మోగుతున్నది "నువు ఆత్మహత్య చేసుకోగలవు ఈ బాధ భరించటమా? చచ్చి పోవటమా?'' అని ఎవరో అంటున్నట్టున్నది

''నే నతన్ని భర్తకన్న ఎక్కువగా ప్రేమించాను అతను నన్ను ప్రేమించక నాకన్నను హీనురాలిని ప్రేమించాడు '' ఈ విధంగా ప్రారంభించి, పేర్లు మాత్రం బయటపెట్టకుండా తన కథ అంతా చెప్పి, అతను కాలితో తన్నినమాటకూడా చెప్పి, "నే నేం చేయ్యాలో నీవే చెప్పు" అన్నది

"ను వేంచేశావు?" అని కుంద అడిగింది

"విషా లమ్మే చెప్పరానివాడిదగ్గిర విషం కొనితెచ్చుకున్నాను," అంటూ హీర అక్కడే ఉండే తన పెట్టెలోనుంచి విషపుబరిణె తీసి కుందకు చూపింది ఆమె పర ధ్యానంగా ఉన్నట్టుగా ఆ బరిణెను తనపెట్టెలో పెట్టేసి, దానికి తాళం వెయ్యకుండా కుందకు హితోపదేశం చేసింది

ఇంతలో మంగళవాయిద్యాలు వినిపించాయి హీర ఆశ్చర్యపడి, అదేమిటో తెలుసుకువస్తా నని చెప్పి వెళ్ళిపోయింది ఆమె వెళ్ళగానే కుంద పెట్టెలోనుంచి విషపుబరిణె తీసి దాచేసుకున్నది

హీర వెళ్ళి చూసేసరికి పరిచారికలు సూర్యముఖిని కూర్చోబెట్టి చుట్టూ చేరి పరిచర్యలు చేస్తున్నారు కొందరు అరుస్తున్నారు, కొందరు పాడుతున్నారు కమలమణి శంఖం ఊదుతూ, అందరిపైనా పన్నీరు చల్లుతున్నది సూర్యముఖి నవ్వుతూ జుట్టుకు చమురు రాయించుకుంటున్నది, అలంకరణలు చేయించుకుంటున్నది



పరామర్శలూ, పరిచర్యలూ పూర్తి కాగానే సూర్యముఖి కమలమణి చెవిలో, 'కుందను చూసివద్దామా ?' అన్నది కుందవల్ల ఏతప్పూ లేదని ఆమె ఎరుగును కుందపైన ఆమెకు సోదరీభావమేగాని కోపమేమీ లేదు

ఇద్దరూ కలిసి కుందఇంటికి వెళ్ళారు చాలా సేపటికి కమలమణి, ముఖాన బాధా భయమూ కనబరుస్తూ బయటికి వచ్చి, నగేంద్రుడికోసం మనిషిని పంపింది

నగేంద్రు డా మనిషితో సహా వస్తూ, వాకిట ఏడుస్తున్న సూర్యముఖిని చూసి, "ఏం జరిగింది ?'' అని అడిగాడు

"సర్వనాశనం " అన్నది సూర్యముఖి

"ఏం ?

"కుంద విషం తాగేసింది దాన్ని పసితనంలోనే పెద్దలలో చేర్చేశాను,'' అంటూ సూర్యముఖి మళ్ళీ ఏడ్చింది

సూర్యముఖి డాక్టరుకోసం వెళ్ళింది నగేంద్రుడు కుందవద్దకు వెళ్ళి కూర్చున్నాడు కుంద ముఖం నల్లబడింది, కళ్ళలో కాంతిలేదు శరీరం కొట్టుకుంటున్నది ఆమె కింద కూర్చుని మంచపుకోడుమీదికి వాలి ఉన్నది ఆమె నగేంద్రుణ్ణి చూస్తూనే అతని కాళ్ళపైన బల్లిలాగా పడిపోయి ఏడ్చింది

"ఇదేమిటి, కుందా? ఏం తప్పు చేశాను? న న్నెందుకు విడిచిపోతున్నావు?" అన్నాడు నగేంద్రుడు

"నే నేం తప్పుచేశా నని నన్ను మీరు వదిలిపెట్టారు?'' అని నోటమాటరాని కుంద ఇప్పు డడగగల్గింది "ఈ రావటం నిన్ననే వచ్చి నాదగ్గర కూర్చుని ఒక్కసారి 'కుందా' అని పిలిస్తే నేను చచ్చిఉండను అలా ఉంటే బాగాలేదు ఒక్కసారి మీ నవ్వుముఖం చూసి మరీ చస్తాను లేకపోతే నాకు సుఖం లేదు" అన్న దామె

ఆమె మాటలు ఆతని మర్మాలను ఛేదించాయి

''ఎందు కీ సాహసం? నాకు కబురు చెయ్యకూడదా?" అన్నా డతను

"నే నన్నది నిజంగా తీసుకోకండి మిమ్మల్ని ఒక్కసారి చూసి. అక్కగారువస్తే మిమ్మల్ని ఆమెకు అప్పగించి చావా లని మీరు రాకపూర్వమే నిశ్చయించుకున్నాను కాని తీరా మీరు కనిపిస్తుంటే చావా లనిపించటంలేదు" అన్నది కుంద

మాట్లాడటం చేతగాని ఆ చిన్నపిల్ల మాటలకు ఏమిసమాధానం చెప్పాలోకూడా తెలియని స్థితిలో పడ్డాడు నగేంద్రుడు

' నేను మీతో ఎన్నడూ ధైర్యంగా మాట్లాడలేదు మాట్లాడా లన్న ఆశ తీరలేదు శరీరం వశం తప్పుతున్నది ఎంతోకాలం బతకను నాలుక ఎండుకపోతున్నది ఎక్కువసేపు బతకను" అన్నది కుంద

డాక్టరు వచ్చి చూసి కుందకు చికిత్స నిరుపయోగ మని చెప్పి వెళ్ళిపోయాడు ఆఖరుక్షణంలో కుంద కమలమణినీ సూర్యముఖినీ చూడగోరింది చేత్తో వారి పాదాలు రాచి తన తలకు రాచుకున్నది తరువాత ఆమె తన భర్తకాళ్ళపై తల ఉంచి ప్రాణాలు వదిలింది

నగేంద్రు డామెకు నదీతీరాన దహనసంస్కారం చేశాడు

*　　　*　　　*　　　*

కుందకు విషం ఇచ్చినది హీర అని అందరికీ అనుమానం కలిగింది హీర ఎక్కడా కనిపించలేదు అందుచేత ఆమెకోసం నగేంద్రుడు మనిషిని పంపితే ఆమె ఇంటివద్దకూడా లేదు

ఒక సంవత్సరం అనంతరం ఆమె దేవేంద్రుడికి కనిపించింది అప్పటి కతను రోగపీడితుడై తాగుడు మూలంగా రోగాలు నయంగాని స్థితిలో చావటానికి

సిద్ధంగా ఉన్నాడు ఇంకా మూడు నాలుగు రోజులకు పోతా డనగా మంచంలోనుంచి లేవలేకపోయాడు

ఆ సమయంలో అతని నౌకర్లు వచ్చి, 'ఎవతో పిచ్చిది మిమ్మల్ని చూడా లంటున్నది " అని చెప్పారు అతను రానిమ్మన్నాడు

బిచ్చగత్తెలాటి మనిషి మోకాలు దిగని చింకిగుడ్డలు ఏట్టుకుని లోపలికి వచ్చి, గుర్తుపట్టావా ? నేను హీరను '' అన్నది

'నీ న్నీస్థితికి తెచ్చిన దెవరు ?" అని దేవేంద్రుడు తమాషాకు అడిగాడు

హీర మండిపడి 'అడుగుతున్నావుకూడానా ? నువుకాదా ? నీ కిప్పుడు జ్ఞాపకం లేకపోవచ్చు, కాని ఒకనాడు ఈ చోటే నీ కానంద మిచ్చాను నువు నా కాళ్ళు పట్టుకుని 'స్మరగరళ ఖండనం మమ శిరసి మండనం దేహిపదపల్లవ ముదారం' అని పాడావు తరవాత నన్ను తన్ని వెళ్ళగొట్టావు నేను పిచ్చదాన్నయిపోయాను నీకుగాని కుందనందివ్వకిగాని విష మిద్దా మనుకున్నాను ఇంద కిచ్చాను ఆమె కిచ్చినాక నాకు పిచ్చి ముదిరింది అది నా ఆధీనంలో ఉండటం మానింది దేశం విడిచిపెట్టాను, పిచ్చిదానికి తిండి ఎవరు పెడతారు ? బిచ్చమెత్తసాగాను నువు చస్తున్నావని విని చూసి సంతోషిద్దా మని వచ్చాను నీకు నరకంలోకూడా చోటు లేకుండుగాక అని ఆశీర్వదిస్తున్నాను !' అంటూ గట్టిగా నవ్వి 'స్మరగరళ ఖండనం మమ శిరసి ముండనం దేహిపదపల్లవ ముదారం అని పాడుకుంటూ వెళ్ళిపోయింది

ఆ తరవాత దేవేంద్రుడికి జ్వరం హెచ్చి, 'పదపల్లవ ముదారం'' అని కలవరిస్తూ చివరకు చనిపోయాడు

తరవాత చాలా రోజులపాటు అక్కడి ఉద్యానవనం దిక్కునుంచి స్త్రీ కంఠం, "స్మరగరళ ఖండనం మమ శిరసి ముండనం దేహిపదపల్లవ ముదారం " అని పాడటం వినిపిస్తూండేది





ముందు వేసవికాలంలో ఒకరోజున బాగా ప్రొద్దెక్కిన తర్వాతనే కొంచెం దూరపు వూరికి నేను కర్మవశాత్తూ ప్రయాణం చెయ్యవలసి వొచ్చిందని - ఎక్కువ ఉపోద్ఘాతం లేకుండా - చెపితే మీరు నన్ను నమ్మొచ్చును. కరకట్టమీద కాలిబాటన నేను నడుస్తున్నాను. నాకు చేతిప్రక్కన కృష్ణానదీ - నదిలో పురుగుల్లాగా పడవలూ - అక్కడక్కడ రేవుల్లో బట్టలు పైకి ఎగకట్టి, వచ్చి పొయ్యేవాళ్ళను చూస్తూ, గుడ్డలు బాచి వుతికే చాకలి పడుచులూ - ఇవన్నీ ఆనందం కలుగచేస్తున్నా యని భావించుకోటానికి ప్రయత్నం చేశాను.

దారిపొడుగునా పెరుగుతట్టలూ, కట్టెల మోపులూ నెత్తిన పెట్టుకుని అమ్ముకోటానికి, బస్తీకి పోతూ వింత వింత పడుచులు ఎదురైనారు. ఎవరో వెనక వుండి వీళ్ళందర్నీ నాకొరకు - నా యిష్టంవచ్చిన వాళ్ళని కోరుకో మని - ఒక్కొక్కరినే లైనుగా పంపిస్తున్నట్టుగా వుంది. ఒక్కొకరే చూపుమేర దూరంలో పుట్టి, మూడు నిమిషాల్లో, పెద్దవాళ్ళయి - నాకు చాలదగ్గిరవాళ్ళయి - నా కళ్ళలోకి - భయంగా - నిర్భయంగా - చింతగా - నిశ్చింతగా - గూఢంగా - నిగూఢంగా - సంతోషంగా - శాంతంగా - సిగ్గుగా - కొంటెగా - విధవిధాలుగా చూచి, తాకేటంత దగ్గిరగా వొచ్చి, కొంచెం పక్కకు తొలిగి, మాయమై పోతున్నారు. వాళ్ళ భావ తరంగాలు ఏమిటి? వాళ్ళ హృదయాలకూ, నా హృదయానికీ, ఈ దాటరాని దూరం ఎందుకు? హృదయాన్ని చూచే శక్తి హృదయానికి వుంటే, లోకం ఇట్లా వుండదుగదా!

ఇదంతా వేదాంతం! ఎండ అనుకోక ప్రకృతి అందాలను చూచి తనివితీర ఆనందిద్దా మని వుద్దేశించిన నేను ఎట్లాగో బురదలాంటి వేదాంతంలో పడ్డాను. ఇంతలో దూరాన వినవస్తూన్న ఒక పాట నన్ను ఆ బురదలోంచి పైకి లాగింది.

ఒకపుట్ట దాటాను; ఒక మలుపు తిరిగాను; చెట్టునీడన ఎవరో, ఒక్కడూ కూచుని పాడుకుంటున్నాడు. తన పాటను తను తప్పక ఆనందిస్తూ గూడా వుండి వుండాలె. ఆత్మానుభవాన్నిపట్టి అల్లాం

పిల్లలమఱ్ఱి బాలకృష్ణశాస్త్రి








టప్పుడు పాట పసలేకపోయినా కలిగే ఆనందానికి కొదువ వుండ దని చెప్ప గలను.

"రాగ...సు ధా ర స...పానము... చేసి..." అని పాడుతున్నాడు.

"పానము"లో "పా"ను సాగదీసి, బిగ్గరగా,నోరంతా తెరిచి వుచ్చరిస్తూంటే, అసలు పాటకు ఎక్కువ లాహిత్ కాక పోయినప్పటికీ, అర్థానికి చాలా అను గుణంగా వుందని చెప్పక తప్పదు.

మళ్ళీ "రాగసుధారస పా_" దాకా పాడి అక్కడ నన్ను చూచి, అధాట్టుగా ఆగిపోయినాడు. నేను దగ్గరికి వెళ్ళే టప్పటికి నన్ను చూచి ఆపినట్టుగా వుండకుండా_వినపడీ వినపడకుండా _ గొణుగుపాట పాడుతున్నాడు.

మొహం చూస్తే చ దు వు కు న్న మొహం లాగానే వుంది. కళ్ళజోడు పెట్టుకొన్నాడు. గడ్డం మీసం నాజూగ్గా పెంచాడు. లాల్చీ తొడుక్కున్నాడు. అడ్డకం వేసిన ఖద్దరు వుత్తరీయం వల్లెగా వేసుకున్నాడు.

"ఏమండోయి?——అయ్యా?"

దగ్గిరికి వెళ్ళాను.

"మీ దగ్గిర అగ్గిపెట్టె వుందా?"

జేబులోంచి వెతికి తీసి ఇచ్చాను.

అది తీసుకుని చేతిలో పట్టుకుని కొంచెం అనుమానిస్తూ, సిగరెట్టు కూడా వుందా?" అన్నాడు. లిటరేచరు ఆటలో 'డైమనురాణి వుందా? _ కళావరు రాజు వుందా'_అని ఒక్కొక్కచే వరుసన లాగుతారే అట్లా వుంది ఈ అడగడం. సిగరెట్టు ఇస్తే వక్కలూ _ తమలపాకు బీడీలూ _ ఇంకా ఆ పైపీ అడిగేటట్టుగా వున్నాడు, అతని వాలకం చూస్తే. అయినా చిన్నప్పటి నించీ మొహమాట స్తుణ్ణి కావటంచేత లేదనలేక సిగిరెట్టు కూడా యిచ్చాను.

అతను సిగరెట్టు వెలిగించాడు, నేను గూడా ఒకటి తీసి వెలిగించాను.

"ఎండ! _ ఏ మెండ! _ అదిరిపో తోంది" అన్నాడు.

అవును అన్నట్లు తలవూపాను,

"ఎందాకా మీరు?"

"కారుపూడి."

"సరే లెండి!_నేను కూడా అక్క డికే! _ తోడుగా వెళ్ళొచ్చు. ఎండ భరించలేక కొంచెం చెట్టునీడన కూచు న్నాలేండి. ఏం, పోదామా?" అన్నాడు.

సరే ననుకొని కలిసి ప్రయాణం సాగించాము.

పది నిమిషాల్లో అతన్ని గురించి తెలుసుకోవలసిన దంతా తెలుసు కున్నాను. పేరు అడిగితే విజిటింగు కార్డు యిచ్చాడు. దాంట్లో_

'రంగా. ఎం. ఏ.

కళోపాసక్'

అని ఇంగ్లీషులో వుంది. తను కవిత్వం అల్లగల దనీ_ చిత్రాలు చిత్రించగల దనీ_పత్రికలకు వ్యాసాలూ, క థ లూ

పంపుతూ వుంటా డనీ — సందర్భాను సారంగా నాకు తెలియజేశాడు.

ఆ పది నిమిషాల సంభాషణలో అతను గొప్పగా చదువుకున్నా డనీ— చదువుకంటెను ముఖ్యమయింది — అతని అంతర్బుద్ధి, సంస్కారం అంటామే దాన్ని, సంపాదించుకుం దనీ — అతని మా ట ల వ ల్ల నే గ్రహించగలిగాను. అల్లాంటి ప్రముఖులు దేంటోనయినా తప్పక రాణించగలరు. అయితే మనది ఆంధ్రదేశంగదా ! — "మ ధ్య త ర గ తి కి చలామణీ జా స్తి అండీ ఎందువల్లనో!" అని తను చలామణీ లేని ఉ త్తమ తర గతికి చెందినట్టు సూచించాడు.

ఇంతలో సంతపాలెం ద గ్గ రి కి వొచ్చాము. నాకు గొంతు ఎండుక పోతోంది. బ్రాహ్మణ ఇల్లు వుంటే ఇన్ని మంచినీళ్ళు తాగుదాం రమ్మన్నాను. రంగా ఎం.ఏ. బ్రాహ్మణఇల్లు ఎక్కడో దూరంగా వుందిగాని తను రానన్నాడు. తనకు అసలు దాహమే కావటంలే దన్నాడు. ఎల్లాగో బలవంతం చేసి ఇల్లన్నా చూపించ మని తీసుకువెళ్లాను అతన్ని.

ఇంటిదాకా తీసుకువెళ్ళి తను బయట నుంచొని నన్ను లోపలికి వెళ్ళి తాగి రమ్మన్నాడు. అతన్నిగూడా ఎండా కాలం, గొంతు పిడచకట్టుకుపోతోంది, రమ్మని బతిమాలాను; రాలేదు. నేను లోపలికి వెళ్ళాను.

వసారాలో ఒక వెధవమనిషి వుంటే "అమ్మా కొంచెం మంచితీర్థం ఇప్పి స్తారా ?" అన్నాను.

"రాజా ! వీరికి కొంచెం మంచినీళ్లు-ఇవతల బిందెలోవి-తీసుకొచ్చి ఇవ్వు-పాపం, ఎండలో వొచ్చారు." అంది.

రాజా అన్నపిల్ల మరచెంబుతో నీళ్ళు తెచ్చి నా ముందు పెట్టింది. ఆమె 17, 18 ఏళ్ళ వయసు గల మంచి చక్కని చుక్క. ఒక చిన్న పల్లెటూ రులో అంట్లు తోముకుంటూ, పిడకలు చేసుకుంటూ, నీళ్ళబిందెలు బుజాన మోసుకుంటూ జీవితం గడపటానికి వుద్దేశించబడ్డ పిల్లకాదు. ఆమె ఒక వేళ ఒప్పుకొనే చేస్తా నన్నా ఇవతలవాళ్ళు చూచి సహించలేరు. ఆమె అందం అట్లాంటిది.

"ఇంకో చెంబుతోగూడా ఇవ్వండి, మరొకరుగూడా వున్నారు వీథిలో." అన్నాను; ఆమెతో మాట్లాడే అవకాశా నికి సంతోషిస్తూ.

"బ్రాహ్మలేనా?" అన్నది వెధవ మనిషి. నీళ్ళు తాగుతూ అవు నని తలవూపాను.

రాజాఅన్న పిల్ల ఇంకో చెంబుతో గూడా మంచినీళ్ళు తీసుకుని వీధి గుమ్మంలోకి వెళ్ళింది. రంగా ఎం. ఏ. ను చూసే చూడటంతోనే చెంబు కింద జార విడిచి, కెవ్వున కేక వేసి,

"అమ్మోమ్! రంగాచార్లువెధవ వొచ్చాదేవ్!'' అని గట్టిగా అరిచింది.

"ఏడీ!_వెధవ ఏడీ !" అని వెధవా. విడ పరుగెత్తింది. నేను గూడా ఏమిటా అని వీధిలోకి వెళ్ళాను.

రంగా ఎం. ఏ. తిరిగి చూడకుండా, వీధి చివరగుండా పరుగెత్తి డొంకన పడ్డాడు. దగ్గిరగా నేను దొరికాను వెధవావిడ నోటికి; విరుచుకుని నామీద పడ్డది.

''ప్రతి గాడిదకొడుకూ_ప్రతి వెధవ కొడుకూ_మా ఇంటికి చావటానికి పని ఏముందంటా ! _ అంత వొళ్ళు తెలియకుండా ఛస్తున్నారా! _ ఒక పుట్టువెధవ బయట నుంచుని, ఇంకో పుట్టువెధవను_కుంకను_మంచినీళ్ళ కని పేరు పెట్టి లోపలికి పంపిస్తాడా?_ఎవరనుకున్నారో! జాగర్త!_మనసబుతో చెప్పి ముక్కోణం తీయిస్తాను _ పుట్టువెధవల్ని ! ..."

''అవ్వగారూ తొందర పడకండి _ అసలు ఏమిటో చెప్పండి."

''చాల్చాలు లేవయ్యా ! _ నోరు మూసుకోక_సిగ్గులేక తగుదునమ్మా అని మాట్లాడొచ్చావు !_ పెద్దమని షన్న పెద్ద మనిషి!_పయిగా తొందర పడుతున్నానని కూస్తావట్రా, పుట్టుకుంకా!_ఇవ్వాళ్ళ మా పెద్దవాడే వుంటేనా, మిమ్మల్ని ద్దర్నీ చర్మం వొలిచి అక్కడ పెట్టక పోయి నాడూ! _ గుడ్లు పెట్టుకు చూస్తూ నుంచున్నావేం ఇంకా _ పీడ విరగడై వొదిలి పోక_ఓరి మీ మొహాలు మండా! మిమ్మని బండెడు కట్టెలతో తగలెయ్యా ! _ ఓరి మిమ్మని మారణహోమం చెయ్యా!..."

నేను తలవంచుకుని వీధిన పడ్డాను. డొంకలోకి పొయ్యేవరకూ కూడా విన పడుతూనే వున్నాయి, ఆ ఇల్లాలు గుక్క తిప్పుకోకుండా, వన్నెలు వన్నెలుగా తిట్టిన తిట్లు.

వూరికి అరమైలు దూరాన చెరువు గట్టున చెట్టుకింద కూచున్నాడు రంగా ఎం. ఏ. _ శాంతంగా ఏమీ జరగనట్టు.

"నా దుంప తెంచావు !" అన్నాను కోపంతో.

"నీవు నా తాడు తెంచావు !" అన్నాడు నవ్వుతూ. "అందుకనే నాకు మంచినీళ్ళూ ఏపాడూ వద్దన్నాను. తాగిన వాడివి నీవు చక్కారాక _ ఆ రాజాను నా మీదికి తోలావు !"

"ఏం జరిగింది ?"

"ఏం జరగలేదు__నువ్వు వింటూనే వుంటివిగా!"

"ఏమీ జరక్కపోతే అంత అల్లరి అవుతుందా ?_ ఆ వెధవముండ నన్నూ నిన్నూ కలిపి బండబూతులు తిట్టిందే'''

"కొంచెంగా వినపడ్డయి నాక్కూడా_ అందుకనే రానన్నాను. అయిం దేదో అయింది, ఇహ దారిని పోదాం పద," అన్నాడు.

''నన్ను ఇన్ని తిట్లు తిట్టించి చెప్పక పోతే వూరుకుంటానా ?" అన్నాను.




"వాళ్ళిద్దరు పార్ట్‌నర్‌షిప్ వదులుకుంటున్నట్టున్నారు."

దారే నడుస్తూ చెప్పటం సాగించాడు.

"వాళ్ళ చుట్టాలు మా వూళ్ళో వుండటంచేత నాకు వాళ్ళ కుటుంబంతో కొంచెం ఎరుక ఉంది. అదీకాక మాబావగారి వూరు, కారుపూడి, వెళ్తూ వొస్తూ దారిలో సంతపాలెంలో వాళ్ళ యింట్లో అప్పుడప్పుడు మకాం వేస్తూవుండేవాణ్ణి.

"రాజా అన్నపిల్ల చిన్నప్పటినించీ నా కళ్ళముందు పెరగడంచేత ఆమెతో ఎక్కువ చనువుగా వుండేవాణ్ణి.

"పది రోజులనాడు యీదారిని పోతూ వర్షం రావడంవల్ల ఆరోజు రాత్రి వాళ్ళ ఇంట్లో తిష్టవెయ్యటం సంభవించింది.

"వసారాలో నాకు మంచం వేశారు. రాజాగూడా ఆ వసారాలోనే కొంచెం దూరంగా మంచంమీద పడుకొనివుంది. వూరు పొద్దుకకముందే భోజనా లయినయి. అప్పుడే ఏం నిద్ర వొస్తుంది? కళ్ళు తెరుచుకొని పడుకున్నాను. ఆమె తల్లి ఇంకా ఇంట్లో ఏదో పని చేస్తూనే వుంది.

"నిజంగా నాకు ఏ దురుద్దేశ్యమూ లేదంటే నమ్ము. వూరికే యీదాలాపంగా పడుకున్న రాజావైపు చూశాను. చీకట్లో ఆమెకళ్ళు తెరుచుకొన్నదీ మూసుకొన్నదీ తెలియలేదు. కాని ఆమె ఆకారము మటుకు స్పష్టంగా కనిపిస్తోంది. ఆమె ఎడమకాలి బొటనవేలు అట్టా అట్టా ఆడుతున్నది. నేనుగూడా నా ఎడమకాలి బొటనవేలు అట్టా అట్టా ఆడించాను. వెంటనే ఆమె వేలు ఆడటం ఆగింది. కొంచెం వుండి ఆమె కుడికాలు బొటనవేలు కొంచెంగా కదిలినట్టుగా వుంది. వెంటనే నా కుడికాలి బొటనవేలు పెద్దగా ఆడించాను. ఆ తరవాత కొంచెం సేపు ఇద్దరం ఏమీ ఆడించలేదు. 'ఇదేదో

మంచి ఆటలాగా తోచింది. మళ్ళీ మొదలుపెట్టి ఎడమకాలి బొటనవేలు ఆడించాను — ఆమె ఎడమకాలి బొటన వేలు కదలలేదు — ఏ బొటనవేలూ కదల లేదు. కొంచెం వూరుకొని కుడికాలి బొటనవేలు ఆడించాను. తర్వాత రెండు బొటనవేళ్ళూ ఆడించాను— అది కష్టంగా వుండి, రెండు పాదాలు గబగబా ఆడించాను. ఆమె తన చిన్న చిటికనవేలు గూడా కదపలేదు. నాకు విసుగు వెయ్యటము మొదలు పెట్టింది. ఆమె నన్ను నమ్మించి మోసపుచ్చినట్టుగా వుంది. కోపంగూడా వొచ్చింది.

"ఇంతలోనే ఆమె తన కుడి చెయ్యి ఎత్తి కుడివైపున పెట్టుకుంది, ఇప్పుడు దారిలోకి వొస్తున్న దనుకున్నా. నేను గూడా ఆలస్యం లేకుండా కుడిచెయ్యి తీసి కుడివైపే కొంచెం చప్పుడు చేస్తూ వేశాను.

"నాకు బాగా ధైర్యం వొచ్చింది. ఆడవాళ్ళు ఇచ్చే ప్రేమ సూచనలు నేను బాగా అర్థం చేసుకోగలను. అంతకంటె సూచన ఏం కావాలి? అయినా ఎందుకయినా మంచిదని కొన్ని ప్రత్యేక ప్రేమ సూచనలు నేనుగూడా చేశాను.

"అంతటితో ఆగినట్టయితే ఎంతో బాగుండేది. కాని విధి!— విధి నన్ను అక్కడ ఆగనివ్వలేదు.

"నేను బయటకు పోవలసి వచ్చింది. బయటకు పోవటానికి ఆమె మంచం పక్కగా పోవలసివుంది. పొయ్యేప్పుడే ఆమెను అట్లా ఒకసారి తాకి పోదామని కోర్కె పుట్టింది. కాని దానిని జయించగలిగాను ఆ సారికి. మళ్ళీ వొచ్చేప్పుడు పుట్టిన ఆ కోర్కెను జయించలేక పోయినాను. ఒక్కసారి అట్లా తాకాను. మెత్తని శరీరం వేళ్ళకు తగలగానే వొళ్ళంతా పులకరించింది. ఆమె కదల్లేదు. ఊరుకోక ఇంకోసారిగూడా... అట్లాగే చేశాను.

"ఆమె కళ్ళు తెరిచింది. నాకు కాళ్ళు వణికినయి. దబదబా వెళ్ళి ముసుకు పెట్టుకు పడుకున్నాను.

"ఆమె లేచి ఇంట్లోకి పోయి తలుపులు వేసుకుంది. అస్ఫుటంగా లోపల మాటలు వినపడ్డయి. కాని ఆమె తల్లితో చెప్పిందో లేదో తెలియదు. బయటకు మళ్ళీ ఎవరూ రాలేదు.

నా కా రాత్రి అంతా నిద్ర పట్టలేదు. తెల్లవారుఝామునే లేచి ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయినాను.

"మళ్ళీ ఇవ్వాళ్ళ నీ తెలివితక్కువ వల్ల వాళ్ళ ఎదుట పడ్డాను — తినాలిసిన తిట్లన్నీ తిన్నాం" అని తేల్చాడు.

"ఏదో కోడ్దో గొప్పో చదువుకున్న వాడివిగదా, నీకూ్కడా ఏమి టీ పిచ్చి?— బొటనవేళ్ళేమిటి?— ఆడట మేమిటి? — ఏమి టీఖర్మ?" అని అన్నాను, వొళ్ళు మండి.

"నేను కథకుణ్ణి. నాకు వ్రాయటానికి ఇల్లాంటి స్వానుభవం చాలా ముఖ్యం — అందుకోసం పడ్డాను ఇన్ని తంటాలూ— అంతకంటే దురుద్దేశ్యం నా కేమీలేదు."






అప్పుడు నేను హిమాయత్ నగర్లో ఉండేవాణ్ణి. రాజు జీరాలో ఉండేవాడు. మే మిద్దరం టాంక్ బండ్ మీదికి నడిచి టీస్టాలు ప్రాంతంలో సిమెంటు సోఫాల్లో కూలబడి పిచ్చిపిచ్చిగా మాట్లాడుకోడం అలవాటు. ఇద్దరం భోజనం కానిచ్చేసి వచ్చేవాళ్ళమేమో, యింక ఆ కబుర్లకి అంతు అంటూ ఉండేదిగాదు. ఊర్లో, దేశంలో, ప్రపంచంలో ఉన్నవన్నీ మాకే కావాలి. మాటలమధ్య గంటలు గడిచి పోతే, అర్ధరాత్రివేళ, నిర్జనమైన రోడ్డు మీద వాడు అటు, నేను యిటు బద్ధకంగా ఆవలించుకుంటూ నడిచిపోవడం — అదో సర్దా.

రాజుకి ఆవేశంతో మాట్లాడ్డం అల వాటు. ఆ ఊపులో ఒకోసారి, మామూలు సంభాషణే ఉపన్యాసంగా మారిపోడం మామూలు. క్రొత్తవాళ్ళు ఆశ్చర్యపోవచ్చు గాని నాకు నవ్వొస్తుంది. నా నవ్వు చూసి వాడు కొద్దిగా సంబాళించుకుంటాడు.

ఆ సాయంకాల మెనిమిది కావస్తోంది. రాజు మాట్లాడ్డంలేదు. మధ్యమధ్య అలా మూగగా కూలబడిపోయి నీళ్ళకేసి, నీళ్ల అవతల పరుగెత్తే రైల్లో దీపాలకేసి చూడ్డం మాకు మామూలే. కాని ఉన్నట్టుండి రాజు అడిగాడు—

"రావు, నువ్వెందుకు బతుకుతున్నావు?"

నాకు నవ్వొచ్చింది.

"నవ్వకు, నవ్వడాని కేంలేదు. నువ్వెందుకు బతుకుతున్నావంటే ఏం సమాధాన మిస్తావు? ... నువ్వేగాదు। పార్కుల్లో, సినిమాళ్ళో, కాలేజీ గేట్ల దగ్గిర, రైలు ప్లాట్‌ఫారాలమీద, రంగు రంగుల అందమైన సాయంకాలం వేళల సిటీల్లోని ఫాషన్ సెంటర్ల పేవ్‌మెంట్ల మీద ఉల్లాసంగా, ఉత్సాహంగా కదిలిపోయే జనంలో ఎవరైనా దూరంగా ఒంటరిగా పిలిచి, రహస్యంగా 'ఎందుకు బతుకుతున్నావు?' అనడిగితే సమాధానం ఏం చెప్తారు? డబ్బుకోసమా? పిల్లల్ని కనడానికా? సుఖాన్ని రకరకాలుగా రుచి చూడాలనా? దేశోద్ధరణ కోసమా? డబ్బు సంపాదించి, పిల్లల్ని కని, సుఖపడి, దేశా న్నుద్ధరించి, యివన్నీ అయిపోయాక — ఆ తర్వాత ఏం చెయ్యాలి? ఏమిటి? ఎందుకు?"

"చావలేం కాబట్టి బతకాలి. అంత కన్నా పెద్దకారణం ఏం కావాలి?"

"అందుచేత, బ్రతుకనేది చావుకోసం నిరీక్షణ అన్నమాట. యీ నిరీక్షణ జరిగే కొద్దిసేపులో మనకి మనమే ఏవేవో వ్యావృత్తులు ఆదర్శా లని, లక్ష్యా లని ఏర్పర్చుకొని వాటిని సాధించా లని తంటాలుపడ్డం, సాధించామన్న తృప్తితో యీ ప్రపంచాని కంతటికీ సార్వభౌముల మన్నట్టు మనకన్నా తెలిసినవాడు గొప్పవాడు యీ లోకంలో లేనట్టు, కథ లెలా రాయా లన్నదగ్గిర్నుంచీ, పిల్ల లెన్నెలా కనా లన్నదాకా సమస్త ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక విషయాల మీదా యిది మంచి యిది చెడు అని నిర్ణయించేసి వీలయినప్పుడల్లా ప్రచారం చెయ్యడం — యిదంతా ఏమి టంటావు? ఆత్మవంచన।"

నే నేం మాట్లాడలేదు. రాజు చెప్పుకుపోయాడు.

"అవతల గదిలో మన బతుకులతీరు నిర్ణయించే యింటర్వ్యూలాంటిది జరుగుతోందనుకుందాం. ఆయింటర్వ్యూ యెలా యెంతకాలం జరుగుతుందో అక్కడ యెవరున్నారో, యివేవీ తెలుసుకుందుకు వీల్లేకుండా యింటర్వ్యూ పూర్తి చేసిన



వాళ్ళని వేరే దారివెంట దూరంగా యేదో తెలియనిచోటికి పంపేస్తున్నారనుకుందాం. ఈ పరిస్థితిలో యివతల హాల్లో లుక లుకలాడేజనమంతా, ఎప్పటికో అప్పటికి ఆ గుమ్మంముందు బిల్లబంట్రోతు తమ పేర్లు పిల్చేలోపల ఒకర్నొకరు అసూయతో, ద్వేషంతో, మెప్పుతో, ప్రేమతో తిట్టుకోడం, పొగుడుకోడం, కీర్తించడం యిక్కడి కిక్కడే యేవో బంధుత్వాలు, శత్రుత్వాలు ఏర్పర్చుకొని తమని తాము మర్చిపోడం, యిదంతా చూస్తుంటే యెంత నవ్వూ, బాధా కలుగుతాయో_దీని కంతకీ దూరంగా, మూలగా యీగోలంత టిలో మాటా, చేతా కలపకుండా చూస్తూ నిలబడ్డవ్యక్తి ఒక్కడికే తెలుస్తుంది।

"సరిగ్గా అలాంటి వ్యక్తి అతను.।"

రాజు పొడుగ్గా ఊపిరితీశాడు. కథ ఉపక్రమణ కాబోతోం దన్నమాట.

* * *

మొదటిసారి అతన్ని చూసింది ఒక సాయంకాలం అయిదుగంటల వేళ. ఆ రోజు బయటి కెక్కడికీ పోలేదు. అలాగే బయటికి చూస్తుంటే యెదట యింటి ముందుగేటు తెరుచుకుంది. నౌకరు వచ్చి రెండు తలుపులూ పూర్తిగా వెనక్కంటా గెంటాడు. కాసేపటికి ఓ పాతకారు బయటికి వచ్చింది. ఆ కారు యెంత పాతగా మోటగా ఉందో అందులో ఉన్న ఒకేఒకమనిషి అంత నాజూగ్గా, అందంగా కనబడ్డాడు. అందులో కెక్కడమే అవ

మాన మనిపించే ఆ కార్లో అతను అంత ఠీవిగా కూర్చొని నడపడం ఏదో పరస్పర విరుద్ధాల కలయికలాగ అనిపించింది ఆ క్షణంలో నాకు తెలిసింది అత నొక అందం, డబ్బూ ఉన్న మనిషి అన్నంత వరకే

ఆ మర్నాడో, మరి రెండురోజులకో రాఘవరావుగారితో మాట్లాడ్డం జరిగింది. రాఘవరావుగారు నే నున్న యింటి యజమాని ఏదో పెద్ద ఉద్యోగం చేసేసి రిటైరయ్యారు సాధారణంగా అన్ని విషయాలమీద చాలా దాటీగా, పూర్తి ఆత్మవిశ్వాసంతో మాట్లాడేరకం. మా సంభాషణ అతనిమీదికి మళ్ళింది.

అతను అలా బయటికి రావడం చాలా అరుదుగా జరిగేపని అందుచేత అలా బయటికి వచ్చినరోజు, చూసినవాళ్ళంతా అదేవిషయం మాట్లాకుంటారు అతడి తండ్రి శ్రోత్రియుడు, సదాచార సంపన్నుడు తల్లికూడా ఆయనకి తగిందే ఆ వృద్ధ దంపతుల్ని చూచి పార్వతీ పరమేశ్వరు లనుకునేవాళ్ళు వాళ్ళిద్దరికీ ఒకేఒక్క సంతానం అతను. పువ్వుల్లో పెట్టి పెంచారు. కాని పండిత పుత్రు డనిపించుకున్నాడు ఇటు సంస్కృతమూ రాలేదు, అటు యింగ్లీషు చదువులూ పూర్తిగా అబ్బలే. బి. ఏ ఫేలయాడు డబ్బుంది కాబట్టి ఉద్యోగం అక్ఖర్లేదు చదువుమాత్రం యెందుకులే అని పెళ్ళి చేశారు. పెళ్ళయాక పెళ్ళాన్ని వదిలి యెక్కడికో దేశాలవెంటబడి వెళ్ళిపోయాడు. అక్కడ ఏం చేశాడో, ఏమయిందో, ఎంతమందిని 'చక్కబెట్టాడో' తెలియదు; తిరిగి వచ్చాడు ఒకామెని వెంటబెట్టుకుని. ఈలోపల యిక్కడ యితను యింట్లోంచి వెళ్ళిపోయిన మూడేళ్ళకి కొన్ని విపరీత మయిన పరిస్థితుల్లో భార్య చనిపోయింది. కావాలనే ప్రాణం తీసుకుంది అని కొంత మంది అంటారు, కొందరు యింకోలాగ అంటారు 'ఆ విషయంగురించి మన మెంత తక్కువ మాట్లాడుకుంటే అంత మంచిది!' చివరి కేమయితేనేం, యితను వచ్చేలోపలే తల్లికూడా జారుకుంది ఇతను వచ్చిన మరో ఆర్నెళ్ళకో, ఏడాదికో యితన్నీ, యితని వెంటనున్నామెనీ చూసి బెంగపెట్టుకొని తండ్రికూడా యీలోకం విడిచిపెట్టాడు. ఇతనితో వచ్చినామె యిక్కడ యితర స్నేహితుల్ని 'మరిగి' ఉద్యోగం సంపాదించుకొని వేరే ఉంటోంది ఇతని దగ్గిరకి అప్పుడప్పుడు వస్తూంటుందిట! ఇతనికి డబ్బు, అందం ఉందన్న గర్వం, అహంకారం మిగిలాయి అలా మేడలో ఒక్కడూ రహస్యంగా ఎవరికీ తెలియని చీకటి బ్రతుకు గడుపుతూంటాడు. ఆ యింట్లో అతను కాకుండా ఒక నౌకరు, వంటవాడు మాత్రం ఉంటున్నారు ఆ మేడమీది మూలగదిలో అత నుండేది. ఎప్పుడూ




"పాకం బాగా కలపి గట్టివడేదాక వేడిచేస్తూ కలియబెట్టాలి."

మత్తులో ఉంటాడు. ఒకవేళ యెవరన్నా చూడ్డానికి వెళ్తే, మాట్టాడానికి వచ్చేసరికి అర్ధగంట పట్టుతుంది. ఆ తర్వాత 'యింకా యెంతసేపు కూర్చుంటావు,' అన్నట్టు విసుగ్గాచూస్తూ త్రుంచి మాట్లాడ తాడు. చివరికి వెళ్ళినవాళ్ళు మొగమింత జేసుకొని తిరిగి వచ్చేయాలి. ఆ అను భవం ఒకసారయాక మరెవరూ ప్రయ [redacted] ఎక్కడికి వెళ్తాడా అని జనమంతా విరగ బడిచూస్తారు. కాని యెవరికీ తెలియదు. ఊరుబైటికెంతదూరమో వెళ్తాడు. తిరిగి వచ్చేసరికి రాత్రి ఏ రెండవుతుందో, మూడవుతుందో!

ఇదంతా రాఘవరావుగారి సమాచారం.

* * *

"మనిషి ఎర్రగా నునుపుగా బాగున్నాడు!" అన్నాను నేను.

"మంచి అజానుబాహువు. తండ్రి పోలిక. ఆ గర్వం అందుకనే – మిగతా వాళ్ళంతా తనకన్నా ఓ మెట్టు కింద చూస్తాడు!...కాని అదంతా పైమెరుగు [redacted]

ఆరాత్రంతా నా మెదడ్లో యీ గొడవే మెదలసాగింది. ఊళ్ళో అందర్తో బాటు నాకూ అతనిగురించి ఆలోచన యెక్కువైంది. చాలామందితో, చాలాసార్లు, చాలాచోట్ల అతనివిషయం మాట్లాడాను. అందరిదీ తలోమాట!

రామారావని ఆ ఊళ్ళో అందరికన్నా నాకు బాగా సన్నిహితంగా ఉండేవాడు. రామం బ్రహ్మచారి. కవిత్వం. కళలు వగైరా పిచ్చి ఉన్నవాడు ఇరవై యేళ్ళుంటాయేమో! రామంకూడా అందరిలా తనకి తెలిసినంతగా ఇంకెవరికీ తెలియదనుకుంటూంటాడు! రామంచెప్పిం దిదీ

*     *     *

అతని తల్లిదండ్రులు వర్ఠి ఛాందసులు, మూర్ఖులు వాళ్ళు కేదన్నా. ఎందులోనన్నా పాండిత్య మంటూ ఉంటే ఉండవచ్చుగాని. ప్రస్తుత పరిస్థితులకి ప్రపంచానికి పనికిరానివాళ్ళు. అతన్ని తమ ఉక్కుపంజరాల్లాంటి భావాలకి అంకితం చేసి, అతని సాటిలేని ఆలోచనా శక్తిని తమ పట్టుదల పదునుకత్తులమీద బలిపెట్టి, చివరికి యెందుకూ పనికిరాకుండా చేశారు అతనికి చదువు అబ్బలేదు, నిజమే కాని అది అతని లోపం కాదు. అతనితండ్రి అతనికోసం నిర్ణయించిన చదువులోపం చదువులో అతను వెనక పడగానే మానిపించి యింటో కూర్చోబెట్టారు సీసాలో బిగించి బిరడాపెట్టినట్టయింది ఎక్కడికన్నా పారిపోవాలని కలలు గన్నాడు. ఇదంతా చాలదన్నట్టు ఎవర్నో తెచ్చి పెళ్ళిచేశారు బలవంతాన ఆమె వచ్చిన వాతావరణం ప్రభావమో ఏమో, ఆమె అతనికి సుఖం, ఊరట కలిగించడంకన్నా, మరికాస్త విసుగుదల, వైరాగ్యం కలిగించింది ఈ పరిస్థితుల్లో అతను యింట్లోంచి పారిపోయాడు ఆ తర్వాత యింట్లోపెళ్ళాం. తల్లి చనిపోయినమాట నిజం అయితే అవి యెలా జరిగాయో యెవరికీ తెలియదు. ఊర్లో మనుష్యుల ఊహాశక్తి యెంత ఉందో ఆ విషయంలో ప్రచారంలో కొచ్చిన కట్టుకథలు చెప్తాయి. ఆతను కలకత్తా పారిపోయాడు అక్కడేదో గుమస్తాలాంటి ఉద్యోగం చేసేవాడేమో' లేకపోతే యింటిదగ్గిర్నుంచి తెచ్చినడబ్బుతో యిష్టం వచ్చినట్టే తిరిగాడో' చూసినవాళ్ళు లేరు అక్కడ ఓకామెతో సాన్నిహిత్యం ఏర్పడింది ఆమె ఎవరో ఏ పరిస్థితుల్లో యితన్ని కలిసిందో ఎవరికీ తెలియదు యింటికి తిరిగొస్తూ ఆమెనికూడా తెచ్చాడని మాత్రం అందరూ ఎరుగుదురు. ఇక్కడామెను చదివించాడు. ఆమె ఉద్యోగంలో జేరి, ఆమె బ్రతుకు ఆమె బ్రతుకుతోంది ఆమెగురించి రకరకాల కథలకి ఆధారాల్లేవు ఆమె, అతను కలుసుకున్నప్పుడు ఏం చేస్తారో లోకానికి తెలియదు, ఊహాగానం తప్పించి అత నొక వేదాంతి ఇంటినిండా ఎన్నోపుస్తకాలు ఉన్నాయి, తండ్రి నాటివీ, అతనుకొన్నవీ, అవన్నీ చదవడమే కాలక్షేపం ఈ చదువుకీ ఆలోచనలకీ మధ్య ఎవరన్నా మాట్లాడబోతే చికాకు, విసుగు కలగడం సహజం పైగా అతని అనుభవాల ముందు, అతనిలాంటి సున్నితమైన



హృదయంగల మనిషిమీద యీపరిస్థితుల ప్రభావంముందు, ఎవరన్నా చవకబారు విషయా లేవన్నా మామూలుగా చర్చించ బోతే చెప్పలేనిబాధ, రోతా గలగడం మామూలు అతనికి లోకంతో పనిలేదు వేళకి వంటవాడు తిండి పెడ్తాడు కావ ల్సినవి తెచ్చి పెట్టేందుకు నౌకి రున్నాడు ఇంక ఆ యింటో ఒక్కడూ తనకి తానే కాలక్షేపం ! ఇలా యిప్పటికి సుమారు అయిదేళ్ళనుంచీ బయటి ప్రపంచం ఏమౌతూందో, ఏమౌతుందో అత నేం పట్టించుకున్నట్టు కనబడదు అయితే యీ బయటిప్రపంచమే అతనిగురించి విపరీతంగా పట్టించుకుని ఛీదరించుకున్నా దన్నా వదలకుండా వెంటబడ్తూంటుంది !

రాఘవరావుకీ రామారావుకీ మధ్య వయసులో, అభిప్రాయాల్లో, ఎంతో తేడా ఉంది. అందుకే వాని గురించిన వాళ్ళ కథల్లోనూ అంతతేడా ! యీ రెండు వెర్ష న్లకీ మధ్య యింకా రకరకాల చిత్రణలు విన్నాను

యిదంతా మొదటిసారికీ, రెండో సారికీ మధ్య జరిగింది రెండోసారి చూసిందికూడా మళ్ళా ఓ సాయంకాలమే యీసారి చూడ్డం బొత్తిగా మరోరకం పరిస్థితుల్లో ఆనాటి అతనిఆకారం నన్ను యెక్కువగా కదిలించింది మేడపైని ఆరుబయట సంధ్యవేళ నౌకరు పేంసోఫా వేసి దిండ్లు సర్దాడు అతర్వాత కిందకెళ్ళి కాసేపట్లో మెట్లమీద అతన్ని తీసుకొస్తూ కనబడ్డాడు యెర్రని మొగం చుట్టూ నల్లగా ఒత్తుగా ఫ్రేం కట్టినట్టు గడ్డం, తెల్లని లాల్చీ, పంచె. మనిషి నీరసంగా ఉన్నాడు ఆ కళ్ళు ఏదో తీవ్రతని, ప్రశాంతతని సమపాళ్ళలో వెలిబుచ్చు తున్నాయి నౌకరు బుజాలమీద అను కొని ఒక్కొక్క మెట్టే నీరసంగాయెక్కి వచ్చి అతను ఆ సోఫాలో కూలబడ్డాడు. అతని చూపు యెక్కడో ఆకాశం నీలపు లోతుల్లో కట్టేసినట్టుంది. అలా యెంత సేపు కూర్చుంటాడో అని నేనూ రాత్రి పదైనా కదలకుండాచూశాను అతను కద ల్లేదు నేనే లోపలికి వచ్చేసిపడుకున్నాను

పడుకున్నాక అతనంటే యెంతో సానుభూతి కలిగింది అత నెంత పాపా

తున్నాడు గావచ్చు; యెంతో మందిని యెన్నో రకాలుగా యిబ్బందులు పెట్టి ఉండవచ్చు. కాని అనుభవిస్తున్న శిక్ష భరించలేనిది. తలనొప్పిగా నున్న సాయంకాలం రెండు గంటలు బయటికి కదలకుండా యింట్లో ఒంటరిగా కూర్చొని పోతే, ఎన్నో యుగాలనుంచి బందిఖానాలో మగ్గుతున్న వాళ్ళలా బాధపడి పోతాం. అలాంటిది అన్నేళ్లు యింటో మరొకరు లేకుండా యెంత సేపూ చూసిన ఆ యిద్దరు మనుష్యుల్నే చూస్తూ నాలుగు గోడల మధ్య పాతుకుపోవడ మంటే ఎంతటి తత్వం, వేదాంతం కావాలో!

రామం చెప్పినట్టు అతని పుస్తకాలే అతని సహచరులు. ఆ చదువే అతనికి ఆనందం, తృప్తి యిస్తుం దనుకోవాలి. ఏమయినా రోజూ ఏవో కొన్నిగంటలు. కొన్నిరోజులు తప్పించి, ఎడతెగకుండా అన్ని సంవత్సరాలు, చదువులో, ఆలోచనల్లో యిమిడిపోవడం సంభవమా? అలా కాకపోతే రాఘవరావుగారు చెప్పింది నిజ మవాలి? అతను ఆయన చెప్పినట్టు మలిన జీవనాన్ని సాగిస్తుండి ఉండాలి.

ఎవరు చెప్పింది నిజం? అందరిదీ నిజమేనేమో? ఎవరిదీ నిజం కాదో? ఏనుగు, అయిదుగురు గ్రుడ్డివాళ్ళ కథ గుర్తు కొస్తుంది. ఏది నిజం – అన్నది చాలా పెద్దప్రశ్న.

*   *   *

రాజు యింతవరకు చెప్పి ఆగాడు. కాసేపు మాట్లాడలేదు. ఆ కాసేపట్లో, తర్వాత చెప్పబోయే దానికి నన్ను తయారు చేస్తున్నా డనుకోవాలి.

"ఇవాళ రామంనుంచి ఉత్తరం వచ్చింది. అతను చనిపోయాడు. శవాన్ని మెడికల్ కాలేజి పాథాలజీ మ్యూజియంకి దానం చేశాడు. వంటవాడికి, నౌకరుకి చెరో అయిదెకరాలు, మిగతా ఆస్తి, మేడ ఆమెకి వ్రాశాడు."

యిలాంటి దేదో చెప్పబోతున్నాడని నేను ఊహించాను; కాబట్టి అంతగా ఆశ్చర్యపోలేదు.

"అతని శరీరాన్ని ముక్కలుగా తరిగి, ప్రతీ రక్తనాళాన్నీ పరిశీలించే వైద్య విద్యార్థులు బహుశా అతను రోగాల పుట్ట గాదని తేలుస్తారేమో! అలా తేల్చాలనే, అత నలా దిక్కులేని వాళ్ళ శవాల్ని దానం చేసినట్టు తనని తానే యిచ్చేసుకున్నాడేమో!

"కాని అతని హృదయాన్ని సముద్ర తరంగాల తాకిడిలా స్పందించిన అనుభూతుల్ని, మెదట్లో క్షణం విశ్రాంతి నివ్వకుండా కొరుక్కుతిన్న ఆలోచనల్ని తెలుసుకోడం ఎవరితరం. అతను చదివిన పుస్తకాలు, ఇచ్చే జ్ఞానపు పరిధు లేమిటి? ఈ జీవితం గురించి, ప్రపంచంగురించి ప్రపంచంలో అనేక విషయాలగురించి అన్నేళ్ళు ఒంటరిగా మథనపడి అతను



యువ

వచ్చిన నిర్ణయాలసారం ఎలా ఉంటుంది? అస లతను ఒక నిర్ణయానికి వచ్చాడా?

"లేకపోతే రాఘవరావుగారు చెప్పినట్టు ఆడవాళ్ళకొలువులోనే అతని కాలం గడిచిపోయిందా? అదే నిజమైతే ఆ వేళ్ళ స్పర్శలో ఎందరు అందమైన ఆడవాళ్ళు పరవశు లైనారో? ఆచేతుల కౌగిలిలో ఎన్ని హృదయాలు ఆనందపు టవధులు చూశాయో? యివన్నీ బ్రతు కనే పెద్ద భాగహారంలో శేషంగా మిగిలిపోయిన ప్రశ్నలు ' యీ ప్రశ్నల కింక సమాధానాలు దొరకవు

"అతను జీవితంలో ఆనందించాడా? జీవిత మంతా రోజు ఒక యుగంలా నరక యాతన అనుభవించాడా? ఎలా గడిచాయి అతనిరోజులు? అత నెందుకు బతికినట్టు? అదంతా చావుకోసం నిరీక్షణేనా? లేకపోతే ఆ వంటరితనాని కేమిటి అర్థం?

"తృప్తి, ఆనందం, బాధ, విచారం, లాంటి వన్నీ సాపేక్షంగా ఆలోచించాల్సిన విషయాలు జీవితంలో పరిపూర్ణత అంటే ఏమిటో తెలిస్తేనేగాని వెలితి ఏమిటో నిర్ణయించడం కష్టం జీవితానికి పరిపూర్ణత అనేది తృప్తిలో వుందనుకుంటే ఆతృప్తి అతనికి లేదనుకోడానికి ఆధారంలేదు ఒకడు డబ్బు సంపాదించి, ఒకడు అధికారం పొంది, ఒకడు సుఖం అనుభవించి — రకరకాలుగా తృప్తి పడితే, అతను యీ ఆట వంతనీ దూరాన్నుంచి చూసి నవ్వుకొని వీ టన్నిటికీ అతీతమైన తన స్థితిని తల్చుకుని తృప్తి పడ్డాడేమో! ఏమైనా అతని జీవిత మింక మూసిన పుస్తకంలాంటిది అందులో ఏముందో తెలుసుకోడం సాధ్యంగాదు"

రాజు చాలా సేపు మాట్లాడాడు. ఆవేశంతో మాట్లాడాడేమో, అలిసిపోయిన సూచనలు కనబడుతున్నాయి. కాసేపు మౌనంగా కూలబడ్డాం

"ఒంటి గంట యింది, యింటికెళ్దాం." అన్నాను.

రాజు లేచాడు అతను రాజుని 'వదలడం' యిప్పట్లో జరిగేపని గాదన్న సంగతి నాకు తెలుసు

రాజు జీరావైపు, నేను హిమాయత్ నగర్ కి నడక సాగించాం



# కదంబం

## పోరంకి దక్షిణామూర్తి

"అదుగో బుచ్చిరెడ్డిపాళెం!" అన్నదామె. తల ఎత్తి చూశాను, రెండు ఫర్లాంగుల దూరంలో దుకాణాలు కన్పిస్తున్నాయి రోడ్డుకు ఎడంపక్క. ఊరు కనిపిస్తోంది ఊరి మధ్యగా, పెద్ద ఎత్తున, దేవాలయపు గాలిగోపురం కనిపిస్తోంది

"హమ్మయ్య! వచ్చేశాం సార్!" అన్నాడు రంగయ్య

రంగయ్యా, భార్యా వింజమూరు నుంచి నాతో ప్రయాణం చేస్తున్నారు మేమెక్కిన బస్సుకాస్తా, బుచ్చిరెడ్డిపాళానికి రెండు మైళ్ళ ఇవతల ఆగిపోయింది మరమ్మతు అయేవరకూ ఆలస్య మవుతుందంటే, చాలామంది ప్రయాణీకులం నడక లంకించుకున్నాం ఊరు దగ్గర పడిందని తెలియగానే నాకు ఎక్కడలేని ఓపికా వచ్చింది. వాళ్ళతోబాటు నేనూ గబగబా నడవడం ప్రారంభించాను

కనుచీకటి వేళ, 'బుచ్చి'లో అడుగు పెట్టాం. అంటే వూళ్ళో అని కాదు. బస్సుస్టాండుదగ్గిర చుట్టూ దుకాణాలూ, కాఫీ హోటళ్లూ ఉన్నాయి ఉదయగిరి వైపు పోయే బస్సు ఒకటి అప్పుడే బయలుదేరుతూ ఉంది చుట్టూ పదిహేను, ఇరవై మంది పిల్లలు చేరి, పూలమాల లమ్ముతున్నారు. ఆ బస్సు బయలుదేరింది. అయినా బస్సుతోబాటు వాళ్లూ నడుస్తూనే ఉన్నారు దండలు చేతులకి చుట్టుకుని రకరకాలవి చూపిస్తూ, అమ్ముతున్నారు కొందరు కొన్నారు కొంత మంది అక్కర్లే దంటున్నారు అయినా వీళ్ల వదలరు అమ్మ కాదంటే అయ్యనీ, అయ్య కాదంటే అమ్మనీ పేరుపేరునా పిలిచి దండలు అందిస్తున్నారు ఒక అమ్మాయి బలవంత పెడుతోంది. ఇంకొక పడుచు ఎంతతోస్తే అంతే యిమ్మంటోంది. ఇంకొక నెరజాణ, కొనవివాళ్ళని దెప్పుతోంది ఇంకో పిల్ల, "పువ్వులకాడ బేర మేందయ్యా!" అని కోప్పడుతోంది.

నాకు చాలా చిత్రంగా ఉంది. ఆంధ్ర దేశంలో మొత్తంమీద ఎన్నో ఊళ్ల తిరిగాను కాని, ఇంత అందమైన దృశ్యం ఎక్కడా చూడలేదు. ఇంత మంది పిల్లలూ, ఇన్నిరకాల పూలూ!

బస్సుల్లో యిలా ప్రయాణాలు చేసినప్పుడు ఎన్నో వూళ్ళలో ఆగుతుంటాయి కదా! ఆగినచోట్ల — వాము జంతికలూ, చేగోడీలూ, కరకజ్జం, బటాణీలూ, అరిటిపళ్ళూ, సోడాకాయలూ,



మొక్కజొన్న పొత్తులూ — యిలాంటి వేవో అమ్ముడొస్తాయి కాని, యిన్ని రకాలపువ్వులూ ఎక్కడా అమ్మరావు. ఈ వూళ్ళో పువ్వులు తప్పితే మరేవీ రావు అందుకే 'బుచ్చి' అంటే నాకు చాలా యిష్టం

బస్సు వెళ్ళిపోయింది. కళ్ళల్లో దుమ్ముకొట్టి పోయింది. ఒక్క క్షణం కళ్ళు మూసుకుని అలా నిలబడి పోయాను

రంగయ్యా, భార్యా నాకంటె ముందు నడుస్తున్నారు జేబులో రుమాలు తీసుకుని కళ్ళు తుడుచుకున్నాను.

"రాండి సార్," అంటూ రంగయ్య పిలిచాడు.

అడుగు ముందుకు వెయ్యబోయాను. తీరా చూద్దును కదా, చుట్టూ పిల్లలు! పువ్వు లమ్ముకునే పిల్లలు! రకరకాల పువ్వులు. రకరకాల వన్నెలు, తీరు తీరుల దండలు.

అందరూ తలొక దండా పట్టుకొని చేతులు చాచారు.

ఒక్క-క్షణం అప్రతిభుణ్ణి అయాను. రాయలవారి విజయనగరంలో విరూపాక్ష స్వామి ఆలయానికి అల్లంత అవతల ఏ పూల అంగడి వీధిలోనో నిలుచున్నానా, అనిపించింది. బహుశ ఆనాటి పుష్ప లావికలు యిలా అవతరించారేమో అని పించింది.

"ఇవి పున్నాగపూలు!"

"ఇవి కొండమల్లెలు!"

"ఇవి బొండుమల్లెలు!"

"ఇవి జాజులు!"

"ఇవి కనకాంబరాలు!"

ఒక్కొక్కరు ఒక్కొక్క తీరు దండలు చూపిస్తున్నారు. ఏవని కొంటాను? ఎన్నని కొంటాను? పోనీ కొనుక్కున్నా యివి నేనేం చేసుకుంటాను? ముచ్చటగా సిగలో ముడిచేందుకు నా అన్న వాళ్ళెవరున్నారనీ?

నేనా ఒంటిగాణ్ణి. పైగా ఆఫీసుపని మీద ఊళ్ళు తిరుగుతున్నవాణ్ణి. మనసు పడి పువ్వులు ముడిచేందుకుకూడా తీరికా? కాని ఇంతమంది ఒకసారి నన్ను వేధించుతుంటే ఏం చేసేది?

వాళ్ళల్లో ప్రతి ఒక్కరూ ఆశగా చూస్తున్నారు. పోనీ, వాళ్ళ తృప్తి కోసమయినా తీసుకుంటే; ఏ పువ్వులని తీసుకోను? పువ్వు అనేది ఏదన్నా బాగుంటుంది. ఒక్కొక్క దాంట్లో ఒక్కొక్క అందం కనిపిస్తుంది. ఇది ఎక్కువా, అది తక్కువా అని అంత తేలికగా నిర్ణయించడం సాధ్యమా?

నా సందిగ్ధావస్థను గుర్తించినట్టున్నారు, ఎలాగా మెత్తబడతానని బ్రతిమాలడం ప్రారంభించారు. ఒక అమ్మాయి బేడ కిస్తానంటే, మరొకమ్మాయి అణన్నరకే యిస్తానంది. ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటూ ముందుకొస్తున్నారు.

నాకు మతోయినట్టయింది.

ఇంతట్లో — ఎన్నో రకాల పూలు కలిపి కట్టిన దండ ఒకటి, ఒక అమ్మాయి చేతిలో కనిపించింది. రంగు రంగుల పూలు ముద్దొస్తూ ఉన్నాయి.

ఆ అమ్మాయి బిడియ పడుతున్నట్టు దూరంగా నిలుచునిఉంది.

ఆవైపు తిరిగి, దగ్గిరికి పిలిచాను.

"ఏమి టది?" అన్నాను.

"కదంబం!" అన్నది.

కదంబం! దండలాగే పేరూ బాగుంది.

"ఎంత కిస్తావు?" అని అడిగాను.

"మీ యిష్టమొచ్చినంత యియ్యండయ్యా!" అన్న దాపిల్ల. అనడమేకాదు— ఆ కదంబమూ, బుట్టలో ఉన్న మరికొన్ని విడిపూలూ అన్నీ తీసి నా దోసిట్లో పోసింది.

దోసిట పట్టినన్ని పూలు! రకరకాల పూలు, రంగురంగుల పూలు, ఒక్కొక్క పువ్వుది ఒక్కొక్కతీరు వాసన. జీవితంలో సున్నితమైన అభిరుచులకూ, సున్నితమైన వాసనలకూ ఎదురుచూసే

నాకు. ఆ పుష్పలావిక కదంబం తో 'పూలంగిసేవ' చేసినట్లే అనిపించింది.

అయినా—"ఇన్నిపూలు నే నేం చేసుకోను?" అని అడిగాను.

ఆ పుష్పలావిక ఏమంటుందో నని ఆసక్తిగా చూశాను. కాని ఆమె ఏమీ అనలేదు. ముఖం కొద్దిగా పక్కకి వొంచి, తనలో తను నవ్వుకుంది. కదంబం సొగసు ఒక ఎత్తూ, ఆ నవ్వు ఒకటీ ఒక ఎత్తూ!

"అర్ధణా కిస్తావా ?" అన్నాను.

అందరూ ఒక్కసారి కిలకిలా నవ్వారు. మా పుష్పలావిక చెయ్యి అడ్డం పెట్టుకుని నవ్వింది.

"నేను బీదవాణ్ణి! యింతకంటె యిచ్చుకోలేను మరి!" అని — అర్ధ రూపాయి తీసి చేతులో పెట్టాను. ఒక కదంబానికే అంత యిస్తున్నా నంటే ఆ అమ్మాయే నమ్మలేనట్టు చూసింది. చుట్టూఉన్నవాళ్లు ఆశ్చర్యపోయారు.

ఆ అమ్మాయికి నేను అర్ధ రూపాయి యివ్వడంతో, యింకా ఒకళ్ళిద్దరు బుట్టలో పువ్వు లన్నీ తీసివ్వబోయారు.

"మీరు చాలా మంచివాళ్లు కాని, ఉన్నవి చాలు!" అని చెప్పి బయట పడ్డాను.

రంగయ్యా, భార్యా నాకోసం ఎదురు చూస్తున్నారు. వాళ్ళని కలుసుకోవడం కోసం తొందరగా అడుగు లేస్తున్నాను.

"ఈ అయ్య శానా మంచాయన!" అంటూ వెనకాల వాళ్లు అనటం వినిపించింది.

"కదంబం కొన్నారా సార్ ?" అన్నాడు రంగయ్య.

"ఔను, కొనే వరకూ వాళ్లు వొదల్లేదు!" అన్నాను.

"ఈ పిల్ల లందరూ యింతే సార్!" అన్నాడు.

మే మిలా మాట్లాడుకుంటూ ఉండగానే, మా పుష్పలావిక పరుగెత్తుకుంటూ అక్కడికి రావడం చూశాను.

"ఇదుగో, మీ చెల్లె లొస్తున్నదే!" అంటూ భార్యకి చూపించాడు రంగయ్య.

ఆ అమ్మాయి వచ్చింది. రంగయ్య భార్యని పలకరించింది.

"ఏం దక్కా! పెండ్లికెల్లొస్తున్నారా?"

"అవును. మీ రందరుకూడా వస్తా రనుకున్నాం. అమ్మ, అయ్య అంతా బాగున్నారా?"

"బాగున్నా రక్కా!" అని, నా వైపు చూసి నవ్వింది.

"ఈ అమ్మాయి మీ చెల్లెలా?" అని అడిగాను.

"మా పిన్నమ్మ కూతురు! ఈవూరే యిచ్చాది. పువ్వు లమ్ముకుంటది!"

ఇవిగో, ఈ పువ్వులన్నీ మీ చెల్లెలే నా దోసిట్లో గుమ్మరించింది!" అన్నాను.

ఇద్దరూ నవ్వారు.

"ఈ అయ్య మంచాయనక్కా! ఒక్క కదంబానికి అర్ధరూపాయి యిచ్చారు," అన్న దాపిల్ల.

"తెలియనాయన. ఆయ విస్తే ను వ్వెట్లాతీసుకున్నావు?" అని అడిగాడు రంగయ్య.

''పెద్దాయిన యిస్తే తీసుకోకుంటే ఎట్లక్కా?'' అన్న దామె బిక్కమొహం పెట్టి.

రంగయ్య నవ్వాడు. "ఇంకెప్పు డట్ల తీసుకోకు!'' అన్నాడు.

"అందరిదగ్గిరనేనెందుకుతీస్కుంటా?" అని రెట్టించిం దాపిల్ల.

"బాగన్నావు పెన్నా!'' అన్నది రంగయ్యభార్య.

పెన్న!

ఆ పిల్ల పేరు పెన్న!

అక్కా చెల్లె ళ్ళిద్దరూ మాట్లాడు కుంటూఉండగా నేనూ, రంగయ్యాప్రక్క హోటలుకు పోయి కాస్త టిఫినూ, కాఫీ తీసుకున్నాం. ఇద్దరం బయటికి వస్తూఉంటే రంగయ్య అడిగాడు—

"ఏమి సార్! మీరు నెల్లూరు పోతారా?"

"అదే ఆలోచిస్తున్నాను రంగయ్యా! కాని యీ వూళ్లో నాకు రెండు మూడు రోజుల పని ఉంది. ఇక్కడ ఉండేందుకు వసతి దొరికితే పని పూర్తి చేసుకునే వెళ్తాను?"

"ఉండండి సార్! దాని కేంది!"

"ఇక్కడ హోటళ్ళలో ఏమన్నా గదులు దొరుకుతాయా?"

"గదు లెక్కడ సార్! అన్నీ చిన్న హోటళ్ళాయె! పొద్దుటివరకూ ఆగితే, పంచాయతి బంగ్లాలో గది దొరుకు తుంది!"

"మరి యీ రాత్రికి? ఆఫీసు రికార్డూ అదీ ఉంది. ఎక్కడ పెట్టేది?"

"మా యిల్లు యిక్కడికి దగ్గరే నయ్యా!'' అన్నది పెన్న.

"ఈ సారు మీ గుడిసెలో ఉంటా రేందే?"అన్నాడు రంగయ్య.

''నాకు అటువంటి అభ్యంతర మేమీ లేదు. కాని వాళ్ళని యిబ్బంది పెట్టడం బాగుండదు. సామాను దాచుకునేందుకు చోటు చూపించు చాలు. యీ పూటకి ఏ అరుగుమీదన్నా పడుకోవచ్చు.'' అన్నాను.

"అదేంది సార్! యాడనో అరుగు మీద పండడ మేంది? నా మాట విని, మా వాళ్ళింటికి రండి చెప్తా! మీ కంతా బాగ చేయిస్త,'' అన్నాడు రంగయ్య.

ఊరుకాని వూళ్లో వీళ్ళే బంధువుల్లా ఆదరిస్తూఉంటే నేను కాదనటం ఏం బాగుంటుంది? వాళ్లతోచే బయలుదేరాను.

ఊరుకు దాదాపు చివర, యానాది వాళ్ళగుడిసెలు ఉన్నాయి. వాటికి యివతలవైపు ఒక సందులో మారుమూల తాటాకుగుడిసె ఒకటి ఉంది. ఆ వాకిట్లో అడుగుపెట్టాము.

పెన్న లోపలికి ఉరికి, అక్కా, బావా వచ్చారని చెప్పింది. పెన్నతండ్రీ, తల్లీ బయటికివచ్చి పలకరించారు.

వాళ్ళు మాట్లాడుతూ ఉండగా, ఆ అమ్మాయి కూర్చునేందుకు కుక్కి మంచం ఒకటి తెచ్చి వేసింది. దివ్వెసోడ తెచ్చి గుమ్మంలో పెట్టింది.

కొంచెంసేపు కూర్చున్న తరువాత రంగయ్యా, పెళ్ళామూ బయలుదేరారు. ఆ పూటకి ఉండమన్నా వినలేదు. అన్నం తిని వెళ్ళమన్నారు. "అబ్బే, తొందరగానే వెళ్ళిపోతాం" అన్నాడు రంగయ్య.

వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత ఒక పళ్ళెంలో పళ్ళూ, పాలూ తీసుకువచ్చింది పెన్న. అంతకుముందే హోటల్లో టిఫినూ, కాఫీ తీసుకరావడంవల్ల అస్సలు ఆకలి వెయ్యటంలేదు. అయినా వాళ్ళ ఆదరం త్రోసిపుచ్చలేక తీసుకోక తప్పింది కాదు.

ఆ మంచంమీదే పక్క పరుచుకుని పడుకున్నాను. పెన్నా, ఆమె తండ్రీ గుమ్మంలో కూర్చుని కబుర్లు చెబుతున్నారు. వాళ్ళతో మాట్లాడుతునే ఉన్నాను. ఎప్పుడు నిద్ర పట్టిందో నాకే తెలియదు.



ఒక రాత్రివేళ మెళుకువ వచ్చింది. మొహం మీద దోమలు ముసి రేస్తున్నాయి. అక్కడ దక్కడ నల్లులు అంటబొడుస్తునాయి. మంచం నులక ఎగుళ్లు దిగుళ్లుగా ఉంది.

నిశ్శబ్దంలో ఊరు నిద్రిస్తూ ఉంది. అప్పుడప్పుడు ఒకటి రెండు కుక్కల మొఱుగులు వినిపిస్తున్నాయి. కొండ మీది చుక్కలు లెక్కెడుతూ మాగన్నుగా పడుకునిఉన్నాను.

జీవితంలో ఇటువంటి అనుభవాలు ఎంత చిత్రమైనవి! ఏవో పనులమీద యిలా ఊళ్ళు తిరగడం, ఒకచోట తినడం, మరొకచోట పడుకోవడం, రకరకాల వ్యక్తులతో పరిచయాలు చేసుకోవడం, రకరకాల అనుభూతులు గుండెల్లో ప్రోదిచేసుకోవడం – యివన్నీ తలుచుకున్నప్పుడు జీవితం ఎంత విశాలమయిందో అనిపిస్తుంది. ఇన్ని తీరుల అనుభూతులుపొందడంవల్ల ఈజీవితంలో నేను పడేశ్రమ ఏదీ వృధా కాదనిపిస్తోంది.

మళ్ళీ కళ్ళు మూతలు పడుతున్నాయి. రంగయ్యా, భార్యా కనిపించారు. అతను ఏదో అంటున్నాడు. ఆమె ఎందుకో నవ్వుతున్నది. ఆమె చేతిలో ముల్లె విప్పింది. అందులో అన్నీ పువ్వులే. ఆ పువ్వు లన్నీ ఆమె తలమీద గుమ్మరించాడు రంగయ్య! ఎంత అందమైన ముచ్చట !

వాళ్లిద్దరూ, ఒకరినొకరువాటేసుకుని అలా వెళ్ళిపోతున్నారు. పువ్వు లన్నీ అక్కడే కుప్పలా పడిఉన్నాయి. ఆ కుప్ప నడుమనుంచి పెన్న పైకి లేచింది. ఆమె నవ్వుతూ యిటే వస్తున్నది. ఆమె మెడలో పొడవాటి కదంబం! చెక్కిట చుక్క, నొసట కుంకుమా ఎర్రగా వెల్గుతున్నాయి. తలకు ఎత్తయిన పూల కిరీటం! ఆమె అడుగు తీసి అడుగు వేస్తూంటే మట్టిలో మందారాలు విచ్చుకుంటున్నాయి.

పెన్న యీ వైపే వస్తున్నది. నా వైపే వస్తున్నది ! యౌవనోదయంలో మొట్టమొదటిసారిగా కలిగిన అనుభూతిలా ఉంది. హృదయం నిండిపోయింది.

కల చెదిరిపోయింది. కళ్ళు విచ్చుకున్నాయి.

సరిగా అప్పుడే బయట దడి తలుపు కదిలిన చప్పు డయింది. ఎవరో యిద్దరు లోపలికి రావడం గమనించాను. వాళ్ళు ఏం చేస్తారో చూద్దా మని కదలకుండా అలానే పడుకునిఉన్నాను. వాళ్ళు నా వైపు చూడకుండానే గుడిసె వెనక తట్టుకు వెళ్తున్నారు. నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. ఎవళ్లో వీళ్ళు? ఎందుకొచ్చారో, యీ అర్ధరాత్రివేళ? అలవాటయిన చోటికి వచ్చినట్టు యీ చొరవ ఏమిటో? ఏం అర్థంకాలేదు. నేనుకూడ లేచి, ఆవైపుకి మెల్లగా వెళ్ళాను.

వీళ్ళతో బాటు యింకో అయిదారు గురు అక్కడ కూర్చున్నారు. గుప్పున సారాకంపు కొట్టింది! పెన్ను అటూ యిటూ ఒకటి రెండుసార్లు తిరగడం కనిపించింది. వాళ్ళందరిముందూ ముంత లున్నాయి. సంగతి అంతా అర్థమైంది. తిరిగివచ్చి పడుకున్నాను. కాని నిద్ర తేలిపోయింది. రకరకాల ఆలోచనలు బుర్రలో మెదులుతున్నాయి.

'వాళ్ళని చూడకపోయినా బాగుండి పోయేది!' అనుకున్నాను.

ఎంతో అందంగా ఊహించుకున్న పుష్పలావిక ఈ అర్థరాత్రి వేళదొంగసారా అమ్ముతోంది! ఆవురావురు మంటూ చూస్తున్న తాగుబోతు వాళ్ళ మధ్య చనువుగా తిరుగుతోంది!

అవును, ఆ అమ్మాయిగురించి నేను యింతగా ఆలోచించడ మేమిటీ? నా కే మవసరం వుందీ?

ఏమీ లేదు. ఉండాలన్న భ్రమకూడా ఏదీలేదు. అయినా, నాకు తెలియకుండానే నాలో, ఏమూలో కొద్దిపాటి అసూయ కలిగి ఉండాలి. లేకపోతే యింతగా నిరుత్సాహం కలిగేదికాదు.

దొంగసారా వ్యాపారం చేస్తున్నవాళ్ళ ఇంట్లో నేను! కలలోకూడా ఊహించలేని నిజ మిది!

ప్రపంచంలో చాలామంది చట్టవిరుద్ధ మైన పనులు చేస్తూనేవుంటారు. చట్టా లనేవి 'మంది'కి కాని 'మనిషి'కి కాదని ఆ పరిస్థిలో ఎవరికి వా రనుకుంటారు. ఆ మందిలో తమ్ముతాము మినహాయించు కుంటారు. తమకు అనుకూలంగా ఏదో సాకుచెప్పుకుని సరిపెట్టుకుంటారు. ఇంక గత్యంతరంలేకనే అలా చేస్తున్నా మని సమాధాన పడతారు. ఇది నేరస్తు లందరి మనస్సుల్లోనూ అంత రాంత రాలలో కలిగే అభిప్రాయం. ఒక దొంగ, ఒక వ్యభిచారి, ఒక తాగుబోతు. ఒక చీకటి వ్యాపారస్తుడు, ఒక లంచగొండి, ఎవడికివాడు ఒక అభిప్రాయం ఏర్పరచు కుని దానికి అనుగుణంగా అవకాశం కలగజేసుకుంటాడు. లేదా వచ్చినదాన్ని వినియోగపరచుకుంటా నంటాడు. అయితే, స్వలాభదృష్టి, సుఖేచ్ఛ అనేవి ప్రతి ఒక్కరికీ ఉంటా యన్నంతమాత్రాన విశృంఖలత్వాన్ని ఎవ్వరూ ఒప్పుకోరు. తమదాకా వచ్చినప్పుడు వాళ్ళే స్వరక్షణ కోసం మళ్ళీ చట్టాలు చూపిస్తారు.

ఎలెక్సిస్ కారెల్ అనే ఆయన, 'మాన్ ది అన్ నోన్' అన్నాడు. అందులో నిజం యిప్పుడు బోధపడింది.

అయినా మంచీ చెడూ, నీతీ అవినీతీ అనేవాటికి ప్రపంచంలో యింతవరకూ హద్దు చూపించినవా డెవడు? చూపించ గలిగేఉంటే, ప్రపంచంలో ప్రతి ఒక్కరి మొహం మీదా, నేరస్తు డన్న ముద్ర ఏదోఒక సందర్భంలో వెయ్యకతప్పదు. అందుకని గడుసువా ళ్ళంతా మన కెందు



కన్నట్టు చూసీ చూడనట్టు తప్పుకుంటారు.

కాన్వెంట్లో ఒక్కొక్కళ్ళే తిరిగి పోవడం గమనించాను. అంతా వెళ్ళిపోయాక, పెన్నతండ్రి వచ్చి -దడి తలుపు గట్టిగా కట్టి వెళ్ళిపోయాడు.

దోమలు పీకేస్తున్నాయి. సరిగా గంట సేపటినుంచీ కంటిమీద కునుకు లేదు.

పొద్దున్నే పంచాయతీ బంగళాలో గది తీసుకోవాలి. రెండుమూడు రోజుల్లో పని పూర్తి చేసుకోవాలి. అయిపోయిన వెంటనే నెల్లూరు బస్సెక్కాలి.

ఇల్లువిడిచి రెండునెలలు కావస్తోంది. ఏమిటో, దిగులుగా ఉంది. ఇంతమంది జనం మధ్య ఒంటరిగాణ్ణి నేనొక్కణ్ణే అనిపిస్తోంది. జీవితంలో యింతకంటె కఠిన మైన శిక్ష ఎవడూ అనుభవించ డనిపిస్తుంది. తెలిసిన మొహం ఒక్కటీ కనిపించదు. నాకు యిష్టులూ, కావలసిన వాళ్ళూ, ఒకపూటకూడా నన్ను చూడకుండా ఉండలేనివాళ్ళూ ఎందరో ఉండగా 'ఆగమ్మకాకి' లా యిలా ఊళ్ళంబట్టి తిరగడంకంటె దురవస్థ మరొకటి లేదనిపించింది. ఒక వినోదమూ, ఉత్సాహమూ యిచ్చేతోడు అసలే లేదు.

"గురువుగారూ! మీలాంటి వాళ్ళకి యీ టూరింగులు పడవుసార్!" అంటూ



ఉంటాడు మా ఆంజనేయులు - అంటే, ఆఫీసులో నా అసిస్టెంటు.

ఔను. నిజమే అనిపిస్తుం దిప్పుడు.

కళ్ళు మూతలు పడుతున్నాయి.

ఎక్కడా అలికిడి లేదు.

పెన్న మెల్లిగా నా మంచం దగ్గిరికి వచ్చింది.

కనురెప్పలు తెరుచుకోలేనంత బరువెక్కాయి.

ఒక్క క్షణం అలానే నిలబడి చూసింది. నేను కదలలేదు.

పెన్న మెల్లిగా వెళ్ళిపోయింది.

ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు.

తెలతెలవారుతూ ఉండగా మెలకువ వచ్చింది. నిన్న తీసుకున్న కదంబం, నా తలదగ్గిర నలిగిపడిఉంది!

అది అక్కడికి ఎలా వచ్చిందో గుర్తులేదు. ఒకవేళ నేనే అక్కడ పెట్టుకున్నానేమో? ఏమో, నా కేమీ జ్ఞాపకం లేదు!

లేచి వొళ్ళు విరుచుకున్నాను.

పెన్న తండ్రి వచ్చా డక్కడికి.

''బాగా నిద్రపట్టిందా అయ్యా?'' అని అడిగాడు.

''పట్టింది!'' అన్నాను.

ఆ అమ్మాయి, మొహం కడుక్కోనేందుకు నీళ్ళూ, వేపపుల్లా అక్కడ పెట్టివెళ్ళింది.

మొహం కడుక్కుని, కాఫీ తాగడానికి హోటలికి వెళ్ళాను.

తిరిగి వచ్చేసరికి, పెన్న వాకిట్లో కూర్చుని దండ కడుతోంది. ఎదురుగా బుట్టెడు పువ్వులు కుప్పగా పోసుకుంది.

పెన్న నవ్వింది.

నేనూ నవ్వాను. ఆ నవ్వు మన స్ఫూర్తిగా వచ్చింది కాదు.

"పంచాయతీ బంగళాలో గది తీసుకున్నాను; నా సామాను తెచ్చిపెట్టు;" అన్నాను.

"ఎల్లిపోతారా అయ్యా ?" అన్నది, కళ్ళు పెద్దవి చేసి.

"ఔను, ఇంకా ఎన్నాళ్ళుండమంటావిక్కడ ?"

"మీలాటి మారాజులు మా గుడిసెల్లో ఎట్లుంటార్లేండి !" అన్నది.

పెన్నకు యిన్ని మాటలు వచ్చునని నేను ఊహించలేదు.

"రాత్రి అంతా లేనూ ?"

"నిదరోయారు కదా !"

"లేదు !" అన్నాను స్పష్టంగా.

పెన్నమొహం వెలవెలబోయింది.

"అదే పట్టింది !"

"అంతేనా !" అని నవ్వింది.

ఇంతలోకే ఆమె తండ్రి వచ్చాడు. సామాను తీసుకుని నా వెంట వచ్చాడు.

వస్తూంటే పెన్న ఆపి –

"కదంబం అయ్యా ! ఇప్పుడే కట్టాను, తీసుకోండి !" అంటూ అందివ్వబోయింది.

"ఇప్పుడొద్దు ! మగవాణ్ణి నే నేం చేసుకుంటాను. నువ్వు పెట్టుకో !" అని, ఒక రూపాయి బహుమతిగా యిచ్చి బయటికి నడిచాను.

ఆవేళ్ళ మధ్యాహ్నం మా ఆంజనేయులు హఠాత్తుగా వచ్చిపడ్డాడు, నన్ను వెతుకుంటూ.

"ఏవిఁటీ రాక ?" అన్నాను,

"ఏముంది గురువుగారూ! మన టూరు ప్రోగ్రాం కాన్సిల్ అయిపోయింది. సాధ్యమైనంత తొందరలో యిక్కడ పని పూర్తి చేసుకుని మీతో హైదరాబాదు వచ్చెయ్యమని ఆఫీసరుగారు నాకు వెంకటగిరికి టెలిగ్రాం యిచ్చారు. బతుకు జీవుడా అనుకుని యిలా వొచ్చిపడ్డాను. ఈ మధ్య కంపెనీలేక టూర్లో చాలా అవస్థపడ్డాను. డబ్బుసంగతి సరేసరి, బొటాబొటీగా సరిపోయింది. ఇక్కడ మిమ్మల్ని చూడ్డంతోటే ప్రాణం లేచొచ్చింది!" అంటూ ఒక్కబిగిని ఉపన్యాసం యిచ్చాడు.

"వెరీగుడ్ ! మంచిన్యూసు తెచ్చావు: లేకపోతే యింకో నెల్లాళ్ళపాటు మన కీ అవస్థలు తప్పేవికావు !

"ఆంజనేయులంటే ఏవఁనుకున్నారు సార్ మరీ ! " అంటూ మాంఛిపోజులో మీసం దువ్వుకున్నాడు.

"సరేకానీ, లేచి తొందరగా స్నానం చెయ్యి. కాస్త టిఫిన్ తీసుకుని ఊళ్లో పడదాం."




"ఆ పిల్లిపిల్ల ఏమంటుంది?...అట్లా! మరి పాడిఆవు ఏం చెపుతుంది? అది... ఆఁ చిట్టిబాబు ఏం చెపుతాడు... కరెక్ట్."

---

"జో హుకుం!" అని, హోల్డాలు విప్పుకుంటూ అర్జంటుగా వెనక్కి తిరిగాడు.

"ఏవిఁ" టన్నాను.

"మీ రెప్పు డొచ్చా రిక్కడికీ?"

"నిన్న!"

"అరెరే! ఒకరోజల్లా వేస్టయి పోయిం దన్నమాట! స్టిల్ దేరార్ త్రీడేస్ మోర్! ఊరు చాలా బాగుంది."

"అప్పుడే ఊ రేం చూశావ్?" అని అడిగాను.

"దాని కేముంది సార్! ఫస్ట్ యింప్రెషన్ యీజ్ ది బెస్ట్ యింప్రెషన్ అన్నాడు శాస్త్రకారుడు. ఊళ్ళో అడుగు పెట్టడంతోనే ఇంప్రెషన్ పడిపోయింది!"

"ఏమని?"

"మా గిరీశం బాబాయి అన్నట్టు, మాంచి ఘీ, కమ్మని గేదె పెరుగూ, దంపుడు బియ్యపు అన్నం – లాస్ట్ బట్ నాట్ ది లీస్ట్ – ఫ్లవర్ గరల్స్! – కొండొక చో! గాస్ గరల్స్! – అందుకే కంట్రీలైఫో కంట్రీలైఫో అని దేవుళ్ళాడతారు మన పొయట్సంతా! మాంచి యీ స్థటిక్ సెన్సు ఉన్నవా డెప్పుడూ విలేజిలైఫే ప్రిఫరు చేస్తా డనుకోండి; ఒక చేలెక్ఖ!"

"ఇదుగో ఆంజనేయులూ, కాస్త నీ వాగుడు కట్టిపెడతావా?"

"దాందేముందిసార్! ఐ కెన్ ఆల్వేజ్ ఒబ్లైజ్ యూ! వాటీజ్ దేర్!"

* * *

ఆవేళ సాయంత్రం నేను గదిలో కూర్చుని రిపోర్టు రాసుకుంటూ ఉండగా ఒకసారి అలా బయటికి వెళ్లొస్తానని బయలుదేరాడు ఆంజనేయులు.

చీకటి పడింది. నా రిపోర్టు యింకా పూర్తి కాలేదు. ఆంజనేయులు యింకా గదికి రాలేదు. గంటల తరబడి రాసుకుంటూ కూర్చోవడంతో వొళ్ళు నొప్పులు చేసింది. కాస్సేపు అలా తిరిగొచ్చి భోజనం చేద్దామని బయలుదేరాను.

సందుమలుపు తిరిగేసరికి – ఆంజనేయులు ఎదురుపడ్డాడు.

"గురువుగారూ! అర్జంటుగా ఓ అయిదు రూపాయిల నోటుంటే యిలా పడెయ్యండి!" అని అడిగాడు.

"ఏం? ఎందు" కన్నాను.

"మనదగ్గర కరెన్సీ నిల్లుకుంది;"

"ఏమి టా అర్జెన్సీ?" అన్నాను.

"అంతా తరవాత చెప్తాపార్! ముందిలా పడెయ్యండి; అర్జంట్!"

వాడి ధోరణి చూస్తే నాకేదో అనుమానం కలిగింది. అతను యీ వూరొచ్చినప్పట్నించీ సిగరెట్లఖర్చు దగ్గర్నుంచి నేనే పెడుతున్నాను. అర్జంటుగా అయిదు రూపాయలు ఎందుకవసరమయిందో అర్థంకాలేదు.

"లేదు!" అన్నాను.

"చంపేశారు సార్! ఐ లాస్ట్ ఏ గోల్డెన్ అపర్చ్యునిటీ! పోనీ, యిఫ్ యూ డోన్ట్ మైండ్ ఒక్కసారి రూమ్‌కి రాకూడదూ?"

"వీల్లేదు! ముందు భోజనానికి పద!" అన్నాను ఖండితంగా.

అంతే, ఆంజనేయులు మళ్ళీ ఏం మాట్లాడలేదు. కిక్కురుమనకుండా వెంట వచ్చాడు.

ఆ మర్నాడు ఊళ్ళోపని పూర్తి చేసుకుని రిపోర్టురాయడాని క్కూచున్నాను. ఆంజనేయులు కిమిన్నాస్తి – మన్ను తిన్న పాములా పడున్నాడు.

నేను డబ్బు యివ్వనన్నందుకు చిన్నబుచ్చుకున్న ట్టున్నాడు. వెనకటంత ఉత్సాహంగా మాట్లాట్టంలేదు. అతన్ని అలా కూర్చోనివ్వటం యిష్టంలేక, నా రిపోర్టు కొంత సాపు రాసిపెట్ట మన్నాను. మాట్లాడకుండా కూర్చుని రాయడం ప్రారంభించాడు.

ఆ వేళ సాయంత్రానికి రిపోర్టు పూర్తి అయింది.

"రాత్రికి మనం నెల్లూరు చేరుకోవాలి!" అన్నాను.

"ఇవేళేనా?" అన్నాడు ఆంజనేయులు.

"అవును. నువ్వు రావడంవల్ల పని తొందరగానే పూర్తి చేశాను."

"పోనీ యీ పూట రెస్టు తీసుకోకూడదూ?"

"పని అయిపోయింతరవాత యింకా . యిక్కడెందుకు ?"

"మీరంతా అదో తరహా సార్ !" అన్నాడు.

నే నేం మాట్లాడలేదు. సామాను సరుకోవడం ప్రారంభించాను.

సాయంత్రం బస్సు వచ్చింది. ఇద్దరికీ టిక్కెట్లు కోయించాను. ఆంజనేయులు నా ఎదుటిసీట్లో కూర్చున్నాడు. మాటా మంతీ లేదు. మొహం ముడుచుకునున్నాడు.

పువ్వు లమ్మే పిల్లలు బస్సు చుట్టూ మూగారు. ఒక అమ్మాయి ఆంజనేయులు దగ్గిరికి వచ్చి దండ అందించింది. అతను తీసుకోలేదు. కొనమని బతిమాలింది. కసిరికొట్టాడు. అతని ధోరణి అలా ఎందుకు మారిందో నాకు అర్థం కాలేదు.

బస్సు బయలుదేర బోతూ ఉన్నది. దూరాన్నించి మా పుష్పలావిక— పెన్న - కదంబం తీసుకురావడం గమనించాను

పెన్న — కదంబం !"

పెన్న బస్సుదగ్గిరికి వచ్చింది.

పోతున్నారా అయ్యా ?" అని అడిగింది

అవును," అన్నాను.

"మళ్లా మా వూరు రారా ?"

"ఏమో ! చెప్పలేను," అన్నాను.

పెన్న నిరుత్సాహపడిపోయింది.

"కదంబం తీసుకోరా అయ్యా ?" అంటూ జాలిగా అడిగింది.

"నే నేం చేసుకుంటాను పెన్నా ! ఈ అయ్య కియ్యి!" అని ఆంజనేయుల్ని చూపించాను.

పెన్న అతని వైపు చూసింది, ఒక్కక్షణం- ఆశ్చర్యపోతూ అలానే చూసింది. ఆంజనేయులు మొహం తప్పించుకున్నాడు.

"ఈ అయ్యకా ?"

"ఔను."

"ఈ అయ్య మంచాయన కాదయ్యా! మీరే తీసుకోండి!" అంటూ కదంబం నా వొళ్ళోకి విసిరింది, పెన్న.

బస్సు కదులుతూ ఉంది. తొందరగా జేబులోంచి డబ్బులు తీసి, ఆమె బుట్టలో వేశాను.

బస్సు నడుస్తోంది.

పెన్న మా వాడివైపు చురచురా చుస్తోంది.

ఆంజనేయులు వారపత్రిక ముఖానికి అడ్డం పెట్టుకున్నాడు.

పెన్న చిన్నగా వెళ్ళిపోయింది.

నా దోసిట్లో కదంబం !



# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

### జ రి గి న క థ

*[పద్మ మళ్ళీ ఇల్లు చేరినప్పటి నుంచీ మనిషి మారిపోయింది. నారాయణరావు మూలంగా శ్యాంసుందర్ పట్టుబడి, ఆజన్మకారావాసం కల్గిం దతనికి. రఘు ఇంట్లోవారందరి ఇష్టం మీద డా. కమలను వివాహ మాడాడు. తరువాత కొన్నాళ్ళకు శ్రీహరితో నిర్మల వివాహం నిశ్చయమై తిరుపతికొండకు కళ్యాణం జరపడానికి అంతా వచ్చారు.]*

—ఇక చదవండి.

మాధవిని ఏదో విషయం అడుగవచ్చిన సరోజిని ప్రమాన్పడిపోయింది. మెల్లగా మాధవి కళ్ళు తుడిచి, రఘువైపు తిరుగుతూ "మనమే ఇలా గుంటే ఇందిరా, మీ అమ్మగారూ ఎంత విచారిస్తారో ఆలోచించండి. పాణిగారు ఆధ్వర్యం వహించ వలసొచ్చిన శుభకార్యం యిలా జరిపించవలసి రావడం అందరికీ కష్టంగానే వుంది. అనుక్షణం బాధ గుండెల్ని పిండివేస్తోంది. కాని ఏం చేస్తాం?" అంటూ ఓదార్చబోయింది.

"అదికాదు వదినా. ఆ బాధకు తోడు నన్నొక క్రొత్తభయం ఆవేశించింది. మీతో ఏమని చెప్పాలా అని బాధ పడ్తున్నాను."

"ఏమి టది?" రఘూ, సరోజినీ ఒకసారే అడిగారు.

"మనం శ్రీనివాసు డని కొలుస్తున్న ఈ దేవుడు సిరిచేత పరిత్యజింపబడినవాడు. పద్మావతితోడి ప్రణయం మూడునాళ్ళ ముచ్చటై నిరంతర ఎడబాటును భరించుతున్నవాడు. ఇక్కడే అంకురార్పణ జరిగిన నా వివాహ జీవితం యిలా మోడై పోయింది తిరిగి ఇందిరకు యిక్కడ వివాహం చెయ్యడానికి నా మనస్సు అంగీకరించడం లేదు వెళ్ళిపోదాం ఇంటిదగ్గరే చేసుకుందాం

"మాధవీ" అని వెర్రిగా చూడడం కంటె ఏమీ మాట్లాడ లేక పోయింది సరోజిని



రఘు కన్నీళ్ళ నాపుకోలేకపోయాడు మానవ దేహాలపై కటుకు కత్తులతో ఆడుకుంటూ కఠినత్వం జీర్ణించుకున్న డాక్టరు, అతి గంభీరవంతుడైన పురుషుడు అతివలాగా కదలికదలి ఏడ్చేశాడు "ఎంతటి విరాగి వైపోయావు వదినా ?" అంటూ

కన్నీళ్ళొత్తుకుంటూ సరోజిని అంది. "నీలో నువ్వు దిగ్రుళ్ళి పోతూ కడకు ఇంత మెట్టవేదాంతం అలవఱచుకొన్నావా మాధవీ ? ఏ బాధలూ లేకుంటే ఇవి

మానవ జీవితాలూ, ఇది బాధామయ భూ ప్రపంచం ఎందు కౌతుంది ? ఈ బాధ లిలా గే వుండిపోతాయా ? కాని కాల పరిపక్వత అవసరం. ఈ బాధల్ని మరచి సుఖపడే రోజు లుంటాయి ఎదర. తెలియక మనం బాధపడ్తాం. మానవులమై పుట్టి బాధలే లేని సర్గజీవితం ఆశించి నిరుత్సాహ పడితే ఎలా ?"

"బాధలకైనా హద్దూ పద్దూ లేదా వదినా ? వివాహమై మూడునెలలైనా కానిదే భర్తకు దూర మవ్వడం ఇది సామాన్యమైన బాధా ? తిరిగి వస్తారనే ఆశ చావకుండా వుంది. లేకపోతే ఏనాడో అంతం చేసుకుందు నీ పాపిష్టి జీవితాన్ని."

"వద్దు వదినా అంతమా టనవద్దు. నా కెందుకో మళ్ళీ మన మంతా కలుస్తా మనీ ఎప్పటిలా మన గృహాల్లో సుఖ సంతోషాలు నెలకొంటా యనీ గట్టి నమ్మక ముంది వదినా. ఎక్కడో ఒకచోట అన్నయ్య క్షేమంగానే వుంటాడు, భగవ త్కృపవల్ల."

"హుః. భగవంతుడు !"

"వదినా" కలవరపాటుతో అరిచాడు. "భ గ వం తు డు అస్తిత్వాన్నే శకింస్తున్నావా ?

"సుఖాలలో వున్నప్పుడు సంతోషించి, కష్టాలలో వున్నప్పుడు భగవంతుడిని దూషించడమా ? జిహ్వాకు షడ్రుచుల నేర్పఱచినట్టే జీవితానికి కష్టసుఖాలూ ఏర్ప రచాడు. కారం, పులుపుతోనే వస్తువుకు రుచి కలిగినట్టు కష్టాల అనుభవంతోనే జీవితానికి పరిపూర్ణత్వం సిద్ధిస్తుంది. చేదు లేనిదే తీపి విలువ తెలియదు. అతి తీపి మొహం మొత్తకుండా మధ్య మధ్య కారం వాడుకోవాలి, అలాగే దుఃఖం లేని సుఖం మొఖం మొత్తి మనిషికి జీవితం విలువ తెలియకుండా చేస్తుంది." అన్నాడు రఘు వదినకు బోధపరచే వుద్దేశ్యంతో.

"ఇవన్నీ వట్టి హేతువాదాలు. కాని నా మనస్సుకు శాంతిలేదు. వెళ్ళిపోదాం. ఇక్కడ చెయ్యొద్దు ఈ పెళ్ళి," అన్నది స్థిరంగా మాధవి.

"ఏమి టొదినా ? తిరుపతి శ్రీనివాసుడి దగ్గర వివాహం చేద్దామని నువ్వే అంటివి. తీరావచ్చాక ఇదా వరుస ?"

"ఏం చెయ్యను ? మనస్సు సరిపెట్టుకో లేకపోతున్నాను. ఈ తిరుపతికొండ మీదే తల పగలగొట్టుకు చద్దా మన్పిస్తోంది.

పరీక్షగా చూశాడు రఘు. ఒకరకం వున్మాదం ఆవరించినట్టుగా వుంది మాధవి ధోరణి.

"అవును, అది సహజమే," అనుకున్నాడు. పాణీ, రఘూ ఎన్నడూ అన్న దమ్ములలా ప్రవర్తించలేదు. వయోబేధం గుర్తించుకోలేదు. ఇద్దరూ ఆప్త మిత్రులలా ప్రవర్తించేవారు. మాధవితో జరిగిన తిరుపతియాత్రనుంచి వివాహం వరకూ అన్ని విషయాలు వివరంగా చెప్పాడు పాణి రఘుకు. అన్నా వదినల మధ్య గల అన్యోన్య అనురాగాలు, భార్యా భర్తల మధ్య అరుదుగా కన్పించే సున్నిత గౌరవ మర్యాదలు ఆ దంపతుల మధ్య వుండడం చూచి అతడెంతో ఆనందించేవాడు. ఇటువంటి అన్నా వదినలను పొందినందుకు గర్వపడేవాడు. మరి అటువంటి మధురఘట్టం ఈనాడు వదిన మనస్సులో మంటలు లేపడం సహజమే? మాటలవల్ల మాత్రం మారేది కాదు ఆ మంట.

ఆలోచనలు పైకి కన్పించనివ్వకుండా "సరే; నాకూ ఈ విషయమై కొంత ఆలోచించటానికి వవ్యధి యియ్యి వదినా. రాత్రి ఒక నిర్ణయానికి వద్దాంగానీ కొంచం సేపలా వెళ్ళివద్దాం. దయుంచి నా అభ్యర్ధన మన్నించు."

"సరే" అంది మాధవి.

కమలా, రఘూ, మాధవీ, సరోజినీ బయలేరారు. ముందు కొండలమీదికి దారి తీశాడు, రఘు; ప్రశాంత వాతావరణం మనస్సుకు ప్రశాంతత చేకూర్చగల దనే ఆశతో.కాని, మాధవి కొంతదూరం నడచి "వొద్దొద్దు, ఈ కొండ లవీ నాకేమేమిటో జ్ఞాపకం చేస్తున్నాయి," అంది.

రఘూ, సరోజినీ గ్రహించారు. మౌనంగా మరోదిక్కుకు దారి మళ్ళించారు. శ్రీనివాసుని ఆలయం ప్రక్కగా పోతూ బయటనుంచే నమస్కరించి బజారు వీథిలో కెళ్ళారు. మాధవి మనస్సు పరిపరివిధాల పోయింది. రెండేళ్ళనాటి సంగతి నిన్న జరిగినట్టుగా మనస్సులో స్పష్టంగా మెదిలింది. తాను బజారుకు వెళ్తాంటే 'వివిధ రకాల జనం. అందులోను ఈ సమయం ని న్నొంటరిగా వెళ్ళనివ్వను.' అంటూ కారెక్కిన పాణి కళ్ళలో మెదిలాడు.

'అంతమాత్రానికే వదలలేనివాడవు, ఇన్నిరకాల మనుష్యుల మధ్య శాశ్వతంగా వదలి ఎలా వెళ్ళగలిగావు?' అని ఆక్రోశించింది మనస్సు. కంటి కొలకుల జేరిన రెండు కన్నీటిబొట్లు భారంగా దిగజారడం ఆమె చూచుకోనేలేదు.

జోరుగా వచ్చిన కారును చూచుకోకుండా ఢీకొట్టుకోబోయిన తనను జబ్బపట్టుకు ప్రక్కకు లాగి సన్న సన్నగా మందలించాడు. ఇక ఆటువంటి జాగ్రత్తలు ఎవరి కప్పగించి వెళ్ళాడో? ఆ ఆలోచనతో బాటు మరో కన్నీటి బొట్టు రాలడం ఆమె చూచుకోలేదు.

మెదడులో ఒక్కొక్క సంఘటన గుర్తుకు రాగా మనస్సు కుమిలిపోయి కండ్ల నుండి ఒక్కో బాష్పకణం రాల్తూనేవుంది.

ఈ బజారులోనే ఆరోజు తాము జంటగా తిరిగారు. తమ హాస్యపు చెణుకులు చూచి ఒక పెద్ద ముత్తైదువ 'ముచ్చటగా వున్నారే ఈడూజోడూ!' అంది. పెద్దల నోటినుండి వెలువడ్డ ఆశీర్వాదం ఫలిస్తుందంటారే! యిలాగై పోయిందేమిటి?'

లోపల ఎన్నో కోర్కెలతో, ఆశలతో పద్మావతీ, శ్రీనివాసుల దంతపు విగ్రహాలు కొనుక్కున్నాం. 'జోడు విడదీయరాదు తల్లీ' అనిన షాపువాని మాట లింకా చెవుల్లో విన్పిస్తూనే వున్నాయి.

'జోడు విడదీయరాదు భగవంతుడా' అని ఎంత మొరపెట్టుకున్నా వినిపించుకోడేం మరి ఆ శ్రీనివాసుడు?

"మాధవీ" భుజంపట్టి కుదుపుతూన్నట్లై వులిక్కిపడి చూచింది మాధవి. వదిన సరోజిని తన కన్నీళ్ళు తుడుస్తోంది. అర్థమైంది మాధవికి తన పరిస్థితి. నిండు బజారులో తాను పరిసరాలు మరచి, గతం తలపోసి దుఃఖిస్తోంది. 'అందరూ నన్నే చూస్తున్నారేమో' అని సిగ్గుగా చుట్టూ పరికించింది. రఘూ, కమలా యేవో ఓదార్పు మాటలు చెబుతున్నారు; అటు ఇటు చంచలంగా కదల్తూన్న మాధవి నేత్రాలు ఆశ్చర్యంగా ఒకచోట నిల్చిపోయాయి. 'కరుణాకరం!' ఒక కొట్టుదగ్గిర నిల్చుని తననే పరీక్షగా పరికిస్తున్నాడు! మాధవి దృష్టులు తనను గుర్తుపట్టినట్టు తోచగానే త్వర త్వరగా వచ్చాడు కరుణాకరం "నమస్కారమండీ" అంటూ.

"ఇక్కడున్నారేం మీరు" అని ప్రశ్నించింది మాధవి.

"ఇక్కడ యూనివర్సిటీలో చదువుతున్నానండి! ఈ సంవత్సరంతో అయిపోతుంది. ఉత్సవాల రోజులుగదండీ — గుళ్ళో వాలంటీరుగా పనిచేస్తున్నాను," అంటూ రఘుని చూచి "దూరానికి మీరు పాణిగారిలాగే వున్నారు! ఆయన ఏరీ! బాగున్నారా?" అనడిగాడు వుత్సాహంగా. మాధవి ముఖం మరోప్రక్కకు త్రిప్పుకుంది!

సరోజిని, కరుణాకరాన్ని గుర్తించగలిగింది. "రండి మా బసకు వెళ్దాం. బజార్లో మాటలు కుదరవు" అంటూ దారితీసింది. అందరూ కాటేజీకి దారి తీశారు. దారిలో రఘుకు కరుణాకరం గురించి మెల్లగా, క్లుప్తంగా చెప్పింది మాధవి.

కాటేజ్ చేరాక అందరూ మౌనంగా కూర్చున్నారు. వరండామీద క్రొత్త వ్యక్తిని చూచి జానకమ్మ బయట కొచ్చింది. ఆ వెనకాలే "అమ్మా!" అంటూ అక్కడ కొచ్చిన ఇందిర కరుణాకరాన్ని చూచి గుర్తుపట్టి నవ్వింది.




"ఏమండీ పెళ్ళికూతు రయ్యారా? కంగ్రాచ్యులేషన్స్. మేష్టారి దర్శన మవ్వ దేమిటి ఎక్కడా?" అంటూ పలుకరించాడు, పెళ్ళికూతురు ముస్తాబులో నున్న ఇందిరను కరుణాకరం."

ఇందిర ముఖం అంతలోనే వికసించి, అంతలోనే చిన్నబోయింది. మెల్లమెల్లగా లోపలి కెళ్ళిపోయింది. 'ఏం చెప్పడమా' అని మథన పడ్తోన్న రఘూ, సరోజినుల సమస్యను జానకమ్మ ఏడుపు పరిష్కారం చేసింది.

చక్రపాణి అంతర్థానం వార్త విన్న కరుణాకరం నిర్ఘాంతపోయాడు. చాల విచారించాడు. "కారణ మేమి టంటారు?" కడకు అడగలేక అడగలేక అడిగాడు మెల్లగా.

ఎవ్వరూ మాట్లాడలేదు.

"బావగారూ, నేను బస్ దగ్గర కెళ్ళి మా స్నేహితు లెవరైనా వచ్చారేమో చూసొస్తాను" అంటూ అటువైపుగా వచ్చిన శ్రీహరి చటుక్కున ఆగిపోయాడు.

రెండు సంవత్సరాల అనంతరం కల్సుకొన్న శ్రీహరీ, కరుణాకరం అనేక ఆలోచనలతో ఒకర్నొకరు మౌనంగా తిలకించుకోవటంతోనే పదినిముషాలు గడిచి పోయేయి.

కడకు శ్రీహరి తెప్పరిల్లి "ను వ్విక్కడ చదువుతున్నా వేమిట్రా?" అన్నాడు.

"అవును" అంటూ కరుణాకరం ఏదో ఆలోచనతో చూడసాగాడు శ్రీహరినీ, ఆతడి పెండ్లికుమారుని వేషాన్నీ.

పరిస్థితి గమనించిన శ్రీహరి "పదరా అలా వెళ్లొద్దాం" అంటూ కరుణాకరాన్ని భుజంమీద చెయ్యి వేసి తీసుకుపోయాడు.

శ్రీహరి రాత్రి ఏడుగంటలకు తిరిగి వచ్చేసరికి అందరూ భోజనాలు చేస్తున్నారు.

"ఒంటరిగా వచ్చారేం? మీ స్నేహితుణ్ణికూడ తీసుకురాలేకపోయారా? పెళ్ళయ్యేవరకు వుంచవల్సింది." అన్నాడు రఘు.

"అలాగేలెండి" అన్నాడు శ్రీహరి.

"నువ్వుకూడా భోజనాని కూర్చో నాయనా" అంది జానకమ్మ.

"కొంచెంసేపు పోయాక తింటాలెండి" అంటూ దినపత్రిక తిరగేస్తూ కూర్చున్నాడు శ్రీహరి.

భోజనం ముగించి చెయ్యి కడుక్కుంటూన్న రఘు దగ్గర కెళ్ళి శ్రీహరి, "బావగారూ మీతో కొంత ప్రత్యేకంగా మాట్లాడాలి" అన్నాడు.

"ఇప్పుడా, ఏమిటి?" అనేక భయాందోళనలతో కలవరంగా ప్రశ్నించాడు రఘు.

శ్రీహరికి నవ్వూ, జాలీకూడ వచ్చాయి. "కలవరపడవల్సిం దేమీ లేదులెండి. ఒక విషయం, అంతే."

"సరే, అయితే అలా బయటి కెక్కడికైనా పోదాం."

"మాధవక్కగార్ని కూడా తీసుకురావాలి. నేను నడుస్తుంటాను," అంటూ దారి తీశాడు శ్రీహరి.

కొంత సేపటికి, "కరుణాకరంతో విషయా లన్నీ చెప్పక తప్పింది కాదు." అన్నాడు శ్రీహరి వుపోద్ఘాతంగా.

రఘు ఒక్కసారి శ్రీహరి ముఖం చూచి వూరుకున్నాడు.

నిట్టూర్చుతున్న మాధవిని చూస్తూ "మీకు కోపం రాదంటే ఒక విషయం మాట్లాడాలి అక్కగారూ" అన్నాడు శ్రీహరి మందస్వరంతో.

"ఏమిటి?"

శ్రీహరి మాట్లడలేదు.

"చెప్పండి మనలో మనకు కోపతాపా లేమిటి?" అన్నాడు రఘు.

"నేను ఇంకా పూర్తిగా మీ కుటుంబంలో ఒకడిని కాకపూర్వమే కుటుంబ విషయాలలో జోక్యం కలుగజేసుకుంటున్నందుకు మన్నించాలి," అని ఆరంభించాడు

శ్రీహరి. "కరుణాకరం ఒకప్పు డల్లరివాడైనా దురాచారుడు మాత్రం కాదు. అత నిలో వున్న కొద్ది చెడుఅలవాటూ పాణిగారి సాన్నిహిత్యంలోనే సమసిపోయాయి. అదంతా అక్కగారికే తెలుసు. ఇప్పుడు మరీ పెద్దమనిషి తరహాకూడా అబ్బింది. ఈ సంవత్సరంతో చదువు పూర్తౌతుంది. ఇక అతడూ వుద్యోగస్థుడే."

"అతడి గోల మన కెందుకో అర్థం కావడం లేదు." అన్నాడు రఘు విసుగ్గా.

శ్రీహరి చిన్నగా నవ్వాడు. "అవసరం గనుకనే చెప్తున్నాను. మన కటుంబం విషయా లన్నీ విన్నాక అతడు చాల బాధపడ్డాడు. ఆనాడు అందరూ ఒకవైపు చక్రపాణి గార్ని కొట్టినవా డితడేనని తీర్మానించినా, నమ్మక సహృదయంతో తన జీవితాన్ని నాశనం చెయ్యకుండా వదలిన పాణిగారి ఋణం ఇప్పుడు తీర్చుకోదలచుకున్నాడట."

కొంచం సేపాలోచించి, "ఏ విధంగా తీర్చుకుంటాడట ?" అన్నాడు రఘు.

"పద్మను వివాహం చేసుకుని." బెదుర్తూ చెప్పాడు శ్రీహరి.

"పద్మనా"? ఆశ్చర్యంగా అడిగాడు రఘు.

మాధవి చేష్టలు దక్కి చూస్తూండిపోయింది.

శ్రీహరి మళ్ళీ అన్నాడు. "అతడు క్రిష్టియన్ అని మనంసందేహించక్కర్లేదు. ఆ విషయా లన్నీ నేనే మాట్లాడా నతనితో. నాకు మతం, కులం అంటే నమ్మకం లేదు. నాకు ఏ మతాన్ని గురించీ ఆపే తెలియదు. ఇటు క్రైస్తవాలయాన్నిగాని, అటు హిందూ దేవాలయాన్నిగాని నే నెప్పుడూ దర్శించలేదు; ద్వేషించనూలేదు. అలాగని ఆ నమ్మకా లున్నవారిని నేను విమర్శించలేదు, అడ్డుపెట్టను. మంచి పను లంటూ ప్రత్యేకంగా చెయ్యకపోయినా లక్షణంగా మానవత్వంతో మాత్రం బ్రతుకగలను అన్నాడు."

"కులమతాల విషయాలతో నాకూ పట్టింపులేదు బావగారూ. కాని కరుణాకరం అన్ని విషయాలూ తెలిసే ఒప్పుకున్నాడా ?" ప్రశ్నించాడు రఘు.

"అన్నీ తెల్సుకున్నాకనే తన అభిప్రాయం చెప్పాడు. తెలిసో తెలియకో ఒక అపరాధం చేసినందుకు ఇక ఆ జీవితాన్ని అలా క్రుళ్ళి మ్రగ్గబెట్టేకంటే ఆ జీవితాని కొక దారి చూపించడం అన్నివిధాల మంచి దనీ, ఒకవేళ తనకు చెయ్యకపోయినా, మన కులస్థులలోనే ఎవరైనా సహృదయుడిని వెదకి పద్మకు వివాహం చెయ్యటా నికి ప్రయత్నించ మనీ తన మాటగా మీకు చెప్పమన్నాడు."

రఘు "పద్మ సౌందర్యం చూచి భ్రమపడలేదుకదా !" అని అనుమానంగా ప్రశ్నించాడు.

"లేదు బావగారూ;" బాధపడ్డాడు శ్రీహరి. "కరుణాకరం కొంచం అల్లరివాడే కాని నీచుడుకాదు. ఆ విషయం నాకు బాగా తెల్సు. 'క్షమా, అహింస లంటూ అంటారే కాని ఎక్కడా కన్పించటం లేదు. ఆ అమ్మాయి బ్రతుకిక అంతేగా' అంటూ అత డెంతగా బాధపడ్డాడో మీరు చూడలేదు మరి."

"నువ్వేమంటావ్ వదినా?" అన్నాడు రఘు.

"నా కేం అభ్యంతరం లేదు. నిరర్ధకంగా వున్న జీవితాన్ని వుద్ధరించగల వ్యక్తి ఏ కులమైతే ఏమిటి? అయినవాళ్ళు ఆదుకున్నారు గనుకనా? కరుణాకరం మంచి వాడే; నే నెరుగుదును. కాని......?

"ఏమిటి?"

"పద్మనుకూడ అడగాలి. అత్తగారి మనఃపూర్వక అంగీకారం కావాలి. నా అనుభవంలో నేను తెల్సుకొన్న దేమంటే, పిన్నలం ఎంత సహృదయంతో, సంస్కారంతో చేసిన పనైనా పెద్దల అంగీకారం, ఆశీర్వాదబలం లేనిదే ఫలించదు.

"సరే, అమ్మకు మనం చెప్దాం. మరి కరుణాకరం తలిదండ్రులమాట?"

"వారి అభ్యంతరం లేదట; తన ఇష్టమేనట."

"అయితే వదినా నువ్వు ముందు పద్మతో మాట్లాడు. నా దగ్గర సిగ్గుపడవచ్చు, భయపడవచ్చు. నీకైతే నిస్సంకోచంగా ఏమైనా చెప్తుంది. అమ్మసంగతి తర్వాత చూద్దాం."

రాత్రి ఒక్కొక్కరే నిద్రకు వాల్తున్నారు. "కాస్సేపు బయట వెన్నెలలో కూర్చుందాం," అంటూ పద్మను కమలా మాధవీ బయటకు తీసుకువెళ్లారు.

"సాయంకాలం కరుణాకరం వచ్చాడు చూచావా పద్మా?" అంది మాధవి.

పద్మ మాట్లాడలేదు.

"కరుణాకరాన్ని మర్చిపోయావా?" అనడిగింది తిరిగి.

"లేదు వదినా మర్చిపోలేదు. లోపలగదిలోంచి చూచాను. ఎదుటకు రావటానికి సిగ్గయింది," అంది పద్మ మెల్లగా.

"సిగ్గేమిటి? ఎందు కలా నిన్ను నువ్వే కించపర్చుకుంటావ్? అతడు చాలా మంచివాడు తెలుసా?"

"అందుకే అతడిముఖం చూడలేకపోయాను. ఎంత మంచివాళ్ళకైనా అసహ్యకరమైన వస్తువును చూడగానే ఫుమ్మివేయ బుద్ధివేస్తుంది."

"మరీ ఏం మాటలు పద్మ అవి? అసలు నిన్ను మళ్ళీ సంసారంలో పడేసి ఈ ధోరణి మార్చెయ్యాలి" నవ్వుతూ నవ్వుతూ అనేసింది కమల.

"పద్మ విసుగ్గా లేచిపోయింది. "ఇలా నన్నెత్తి పొడవటానికా తీసుకొచ్చావ్?"

"అయ్యో, యేమన్నా మనీ?" అంటూ వదిన లిద్దరూ రెండుచేతులూ పట్టుకు నిలిపారు.

"లేకపోతే నన్ను చేసుకునేంత కర్మ కాలినవా డెవడు వదినా?"

ఆ వెన్నెల్లో స్పష్టంగా పద్మకళ్లలో నీటిబిందువులు కన్పించాయి.

"ఛ ఏడవకు పద్మా, మేం నిన్ను కించపరచే వుద్దేశ్యంతో అనటంలేదు. నిజంగానే కరుణాకరం నిన్ను చేసుకుంటాడట." అంది మాధవి.

"వదినా!" విశ్చేష్టురాలై పోయింది పద్మ. అంతకంటె మాట్లాడలేకపోయింది.

"అవును పద్మా నువ్వేకాదు, నీవంటి తెలివితక్కువవాళ్ళు లోకంలో అనేక మంది. కాని ఆత్మహత్యలు చేసుకొనీ, ఇలా నలుగురిచేత వ్రేలెత్తి చూపించుకొనీ బాధపడేకంటే, తిరిగి తగిన వ్యక్తితో జీవితంలో ప్రవేశించడం మంచిది."

"ఇక నా కటువంటి కోరిక లేం లేవు వదినా; ఇలా పోనియ్యి."

"ఇప్పు డుండకపోవచ్చు కాని జీవితమంతా ముందేవుంది. తాత్కాలిక వైరాగ్యం వల్ల కలిగిన ఈ నిగ్రహం ఎల్లకాలం వుంటుం దని నమ్మక మేమిటి? అదీకాక కుటుంబం ఎల్లకాలం యిలా కలిసివుండదు. ముమ్ముందు ఎవరి సంసారాలు వాళ్ళవి; ఎవరి పిల్లల బాగోగులు వాళ్ళవి. ఇలా ఒకరిపై ఆధారపడే జీవితం సుఖ మేమిటి?" అంది మాధవి.

చాలాసేపు మౌనంగా వున్న పద్మ హఠాత్తుగా తలెత్తి "ఎవరికి భారమైనా నా కెన్నటికీ అవ్వననే నమ్మకం నాకుంది వదినా; కాని ఒక్క ప్రార్థన. నాకు చదువు చెప్పు, చాలు; ప్రైవేటుగా పరీక్షలు పాసౌతాను, నాబ్రతు కేదో నేను బ్రతుకుతాను."

"ఏం, పెళ్ళెందుకు చేసుకోవు?"

"అన్నీ అయిపోయిన నా బ్రతు క్కింకా పెళ్ళేమిటి? అయినా మగవాళ్ళమీద నమ్మకం పోయిం దొదినా"

"అందరూ అట్లాగే వుండరు పద్మా. మీ అన్నయ లిద్దర్నీ మనసులో వుంచుకు మాట్లాడు. వాళ్ళూ మగవాళ్ళేగా?"

"అటువంటి అన్నయ్యలకు ఈ వచ్చిన అప్రతిష్ట చాలకనా ఇదికూడా?"

"ఈ వివాహం తప్పంటావా? నీకంటె చిన్నపిల్లకి పెళ్లయి, నీ కవ్వలేదంటే, ఏ మని నలుగురూ కారణాలు తరచిచూచి పాతవన్నీ త్రవ్వడం, హేళనచేయడం; ఇది అప్రతిష్ట కాదా?"

"మీరు చెయ్యకపోయినా అది కూడా పెళ్ళిలోనే జమకదా. ఆడదానికి రెండు పెళ్ళిళ్ళు అపవిత్రం కాదా ?''

"పవిత్రం కాదని నేనూ ఒప్పుకుంటాను. కాని అంతకంటె అతఃపతనం కంటె చాల మేలైన మార్గం. పతితలూ, వితంతువులూ తిరిగి వివాహం చేసుకోవడమే అంటాను. ఈ సమాజం సంగతి నీకుతెల్సుకదా. ఒంటరిగా బ్రతకడ మెంతకష్టమో, అసాధ్యమో ఆలోచించావా !"

నీరసంగా నవ్వింది పద్మ. "ఇప్పుడు క్రొత్తగా ఆలోచించేదేముంది ? రాత్రిం బవళ్ళు, అనుక్షణమూ తెగని సమస్యలుగా నన్ను వేధించుతూన్న విషయాలే ఇవి. భార్య పోయినవాడు, పదిమంది పిల్ల లున్నవాడు, ముసలివాడు—ఒకరేమిటి. ఎటు వంటివాడైనా పురుషుడు పవిత్రమైన కన్యనే వివాహమాడ్తాడు కదా, తన కెన్ని దుర్గుణా లున్నా భార్య పవిత్రంగా వుండా లనుకుంటాడుగా ? కరుణాకరం ఎందుకు నన్ను చేసుకుంటున్నట్టు అన్నీ తెలిసి ? విలువలేనిదాన్ని, మనస్ఫూర్తిగా ఆదరించ గల దని నాకు నమ్మకంలేదు. మరొక మూడునాళ్ళ ముచ్చట ఎందుకు ? ఇలా పడుండనీ వదినా నన్ను." కళ్ళు తుడుచుకుంది.

శ్రీహరీ, రఘూ కలసివచ్చారు. "ఏమంటోం?" దంటూ.

కమల క్లుప్తంగా చెప్పింది,

శ్రీహరి అన్నాడు. "అంటువంటి భయాలుండటం సహజమే.కాని కరుణాకరం స్వార్థపరుడుకాదు, పోనీ మీరొకసారిఅతనితో మాట్లాడటానికేమైనా అభ్యంతరమా?" అనడిగాడు పద్మను.

"వొద్దొద్దు, నేనేమీ మాట్లాడవలసిందిలేదు." ఖంగారుగా అందిపద్మ. "అందరికీ ఆమోద మైతే నేనూ భగవంతునిపై భారం వేసి ఒప్పుకుంటున్నాను."

రఘు మెల్లగా అన్నాడు. "దేనికైనా భగవతునిపై భారంవెయ్యడమే మంచిది. కాన అనవసరంగా భయపడకు పద్మా. మనకు తెలిసినలోకం చాలాచిన్నది. అటువంటి స్వార్థపరులే అంతటా నిండివుంటా రనుకోవడం అవివేకం. మనదీనస్థితికి జాలిచూపే విశాలహృదయులు లేరనుకుంటూ విచారించి, తీరా తనంతతాను వచ్చిన యోగ్యుడ్ని అనుమానించడమా ? మంచిగానే భావిద్దాం. తర్వాత పైన భగవంతు డున్నాడు. వెనుక మే మున్నాం, నీ కేం భయవద్దు.''

హాయిగా నవ్వింది కమల. "ఒకపెళ్ళి చేద్దామనివస్తే ఈతిరుమలవాసుడు రెండు పెళ్ళిళ్ళు చేయించేస్తున్నాడు. ఇక అత్తగారి అనుజ్ఞ మిగిలివుంది," అంటూ లేచింది. కాటేజ్ వైపు నడకసాగించారు; రఘూ, మాధవీ కొంచం వెనుకకు మిగిలారు.

"మధ్యాహ్నం. నువ్వు చెప్పినవిషయం ఆలోచించాను " అన్నాడు.
"ఊఁ" అంది మాధవి పైమాటకు ఎదురుచూస్తూ
"పద్మ సమస్య ఇంత తేలికగా పరిష్కార మౌతుందని నే ననుకోలేదు. పైకి తిని తిరుగుతున్నా నిత్యం అంపపుకోత అనుభవించేవాడిని దానివిషయమై. ఇదంతా ఈ వెంకటేశ్వరుని దయ అనే నమ్ముతున్నాను." ఆగి వదినముఖం చూచాడు.

మాధవి మౌనంగా వింటూండడం చూసి తిరిగి ఆరంభించాడు రఘు. "దేవుని వునికినే శంకించి మాట్లాడావు నువ్వు మధ్యాహ్నం, అందుకే తన మహిమను చూపటానికి ఒకపెళ్ళి కింకోపెళ్ళి జతచేశాడు శ్రీనివాసుడు. నిష్కళంకమైన ఇల్లాలివి గనుక నీ నిర్వేదఘోష ఆ భగవంతుడి కర్ణపుటాలకు శోకింది. మన మెవ్వరికీ ఎన్నడూ హానిచెయ్యనివాళ్ళం; మనకుమాత్రం అపకారం చేస్తాడా? అన్నయ్య ఎక్కడో క్షేమంగా వున్నాడనీ. తర్వాత వస్తాడనీ నాకెవరోలోపల చెప్తున్నట్టుంది."
"హుఁ, ఇల్లాలు!" నిర్జీవంగా నవ్వింది మాధవి."ఇదేం పురాణయుగమా చిన్న బాబూ?"

"పాతివ్రత్యాని కున్న విలువా, మహిమా యే యుగంలోనైనా, ఒకటే." గంభీరంగా, నిర్మలంగా వుంది రఘుగొంతు. "అందుకే నాకు అన్నయ్య విషయంలో ఏ చీకూ, చింతాలేదు. అత డెక్కడున్నా నీ పూజామహిమ అతడిచుట్టూ పరిభ్రమిస్తూ కంచుకోటలా కాస్తూనేవుంటుంది. అతడి అమాయకత్వం, అతి మెత్తదనం పోయి పరిపూర్ణమైన మనిషిగా తిరిగి వస్తాడని అప్పుడప్పుడు సంతోషిస్తూంటాను కూడ."
"ఏమి టక్కా అంత మెల్లగా వడుస్తున్నారు? రండి త్వరగా." కమల కేక విని సంభాషణ కట్టిపెట్టి త్వరత్వరగా నడిచి నివాసం జేరుకున్నారు.
విషయ మంతా విన్న జానికమ్మ "నాకు ఆలోచన తక్కువమ్మా" నా తెలివి తక్కువతో ఈ తెచ్చిన అనర్థాలుచాలు. మీ కందరకు ఏది మంచి దనిపిస్తే అలా చెయ్యండి. నలుగురి బిడ్డలతోబాటు దానిక్కూడా ఓ ఇల్లూ, సంసారం అంటూ ఏర్పడితే నాకుమాత్రం సంతోషంకాదూ? నవ్వేననాడు నవ్వడానికే కాని ఎందుకు ఈ కులాలు, మతాలునూ? మనిషిని మనిషి ఆదరించడానికే అడ్డమయ్యే ఈ కులాలు, మతాలు నాకక్కర్లేదు. నా బిడ్డలు సుఖపడితే అంతేచాలు. మీఇష్టప్రకారం చెయ్యండి."
అందరి ముఖాలు ఆనందంతో విప్పారేయి.
"అయితే రెండుపెళ్ళిళ్ళూ శనివారమే చేశేద్దాం?" అన్నాడు రఘు.
"నువ్వూ పెళ్ళికూతురి వౌతున్నావటే తల్లీ?" ఆనందాశ్రువులతో పద్మను అక్కునజేర్చుకుంది జానికమ్మ. "ఇప్పుడేగనుక పెద్దబా బుంటే......" ఆనంద బాష్పాలతో విచారాశ్రువులు మిళిత మయ్యాయి. [సశేషం]

Printed and Published by A. Sudhakar Rao from Yuva Press, 5-9-88,
Public Garden Road, Hyderabad-1. Controlling Editor Sri "CHAKRAPANI"

